# చతుర

సంపుటి: 3 సంచిక: 3
ఏప్రిల్ 80

## ఈ నెల సమగ్ర నవల

ఆమె ఎవరికీ అంతు పట్టని వ్యక్తి. మాంగల్యం విషనాగై కాటేస్తే, స్త్రీలో ప్రజ్వరిల్లే దావానలంతో తనదంటూ ఒక స్వాప్నిక జగత్తు నిర్మించుకొంది. ఆ ప్రపంచంలోనికి ప్రవేశించిన వారికి కమ్మని కథలు చెప్తూ ఆనంద పరిచింది. అయితే ఆ తర్వాత ఆ అద్భుత ఇంద్రజాల మహేంద్ర జాల ప్రపంచంలో అడుగిడిన వ్యక్తులందర్నీ నవ్వుల ఇంద్ర ధనస్సులపై నడిపించి శోకాల—

# సుడిగుండం

లోనెట్టి, తీరం చేరక వాళ్ళు కొట్టు మిట్టాడుతుంటే చేతులెత్తి గేలిచేసింది. ఎందువల్ల? పెర్వర్షన్ తాలూకు మరొక కోణాన్ని యథాతథంగా చిత్రించిన

## రుక్మిణి

నవల ఈ నెల 'చతుర' సమగ్ర నవల.



ముఖ పత్రం ఫోటో: అమితేష్ బెనర్జీ

రెండవ కవరు: ఎల్.ఆర్. గ్రోవర్

మూడవ కవరు: మోహన్ కుమార్ శర్మ

# రచయితలకు సూచనలు

* 'చతుర'లో ప్రచురణార్థం పంపే నవలలు అచ్చులో 100 పేజీలకు సరిపడేవిగా ఉండాలి. 'చతుర'లో అచ్చులో పేజీకి సుమారుగా 260 పదాలు వస్తుంటాయి. ఈ లెక్క ప్రకారం సరిచూసుకున్న తర్వాతనే నవలలు పంపటం మంచిది.

* ప్రస్తుతం వివిధ మాసపత్రికలు వెలువరిస్తున్న 100-112 పేజీల పాకెట్ సైజు నవలానుబంధాలలో ప్రచురితమవుతూన్న నవలికలు చతురలో అచ్చులో 60-70 పేజీలు మాత్రమే అవుతాయి. రచయితలు ఈ తేడా గమనించాలి.

* పై పరిమితులను దృష్టిలో ఉంచుకుని 'చతుర' కొరకై ప్రత్యేకంగా వ్రాసి పంపిన నవలలు మాత్రమే పరిశీలింపబడుతాయి.

* ప్రచురణకై ఎన్నిక కాని నవలలను తిప్పి పంపేందుకై నవలతో పాటే తగు పోస్టేజీ తప్పనిసరిగా జత పరచాలి. అలా జతపరచని పక్షంలోనూ, నవలలు పోస్టులోగానీ, ఇతరత్రాగానీ పోయినా మా బాధ్యత ఉండదు.

* 'చతుర'లో ప్రచురించే నవలలకు పారితోషికం రచనను బట్టి రు. 1,000 నుండి రు. 2,000 వరకూ ఉండగలదు. ఈవిషయంలో సంపాదకులదే తుది నిర్ణయం.

చతుర

ఈనాడు కాంపౌండ్ సోమాజిగూడ,

హైదరాబాద్-500 004

## పునర్జన్మ

పర్వతారోహణ చాలా ధైర్య సాహసాలతో కూడిన పని. తమిళనాడులో ఇంజినీరింగ్ విద్యార్థి అయిన రమణన్ పర్వతారోహణలో దిట్ట. స్నేహా హిమాలయ పర్వతారోహణ సంస్థలో సభ్యుడు. అతన్ని అందరూ దక్షిణ భారత 'మౌంటెన్ ఎంబాసిడర్' అని పిలుస్తారు. ఓసారి ఇరవై వేల అడుగుల ఎత్తున్న కోటేశ్వర శిఖరాన్ని అధిరోహించడానికి తరలి వెళ్ళారు రమణన్ బృందం. పర్వతం అంతా మంచుతో కప్పబడి వుందిగానీ ఎక్కువ దట్టంగా లేకపోవడం వల్ల మంచులోవాడే ప్రత్యేకమైన జోళ్ళను వేసుకోలేదు. సాధారణంగా పర్వతారోహకులందరూ ఒకరి నొకరు తాడుతో బంధించుకుంటారు. కానీ ఆరోజు ఎవరంత వారు విడివిడిగా ఎక్కడం ప్రారంభించారు. శిఖరాన్ని చేరడానికి మొత్తం మూడు గంటలు పడుతుందని అంచనా. ఉత్సాహంగా ఎక్కుతూ పంధొమ్మిదివేల అడుగుల ఎత్తు దాటి వెళ్ళారు. గమ్యం ఇంకో యాభై అడుగుల దూరంలో వుందనగా ఓ పెద్ద మంచుగడ్డ పైనించి దొర్లుకుంటూ రాసాగింది. కిందనించి ప్రమాద సూచకంగా తుపాకి శబ్దం వినిపించినా పక్కకి తప్పుకునే అవకాశం చాలా తక్కువగా వుంది. అలా ప్రయత్నించడంలో పట్టుతప్పి మంచుమీద దొర్లుకుంటూ దొర్లుకుంటూ ఓ సమతలప్రదేశంలోపడ్డాడురమణన్. మంచు పెళ్ళలు అతన్ని కప్పేశాయి. గాయాలు కూడా బాగా తగిలాయి. అయినా లక్ష్య పెట్టక జారిపోయిన కెమేరాను వెతికి పట్టుకుని దగ్గర్లో వున్న కొన్ని మంచు కొండల ఫోటోలు తీసుకున్నాడు. ముప్ఫయి సెకండ్లపాటు జరిగిన ఈ దుర్ఘటన మూలంగా పదిహేను వేల రూపాయలు ఖరీదుచేసే సామాగ్రి నష్టపడింది. వాతావరణం అనుకూలంగా వుండడం వల్ల ఎవరికీ ప్రాణాపాయం సంభవించలేదు. అలాగే ఓసారి ఇరవై మూడువేల అడుగుల ఎత్తున వుండగా విపరీతమైన కడుపునొప్పి వచ్చిందట.



అయినాగాని ఓర్చుకుని శిఖరాన పతాకాన్నెగరవేశాడేగాని తిరోగమించలేదట. నందాదేవి శిఖరాన్ని అధిరోహించాలన్నది అతని జీవితాశయమట. *

## పుస్తక ప్రపంచం

పుస్తకాలు కొని చదివే అలవాటు చాలా తక్కువ మందికి వుంటుంది. ప్రపంచం మొత్తంలో పెద్ద పుస్తకాల దుకాణం





లండన్లో వుంది. దానిపేరు ఫోయర్స్. తొమ్మిదెకరాల విస్తీర్ణంలో వున్న ఈ విక్రయ శాలలో తొమ్మిది వందలమంది పనివాళ్ళున్నారు. వీళ్ళంతా ఒకరి వెనకాల ఒకరు నిలబడితే మూడు మైళ్ళపొడవు క్యూ అవుతుంది. అరవై అయిదు ఏళ్ళ కిందట ఫోయర్స్ చిన్న దుకాణం. ఆల్ఫ్రెడ్ అనే అతను సివిల్ సర్వీస్ పరీక్షల కోసం శ్రద్ధగా పుస్తకాలు కొని చదివి వెళ్ళినా వుత్తీర్ణుడు కాలేకపోయాడు. దాంతో తను కొన్న పుస్తకాల్ని తగ్గింపు ధరలకి అమ్మతానని పత్రికల్లో ప్రకటించాడు. అప్పట్లో సెకండ్ హాండ్ పుస్తకాల షాపులు లేవు. ప్రకటన వృథాపోలేదు. అలాపాత పుస్తకాల్ని కొనడం ఎక్కువ రేటుకి అమ్మడం వల్ల ఫోయర్స్ పునాది గట్టిపడి కొద్దికాలంలోనే అభివృద్ధి చెందింది. ప్రస్తుతం ఫోయర్స్ లో నలభై నుండి ఏభై లక్షల పుస్తకాలున్నాయి. ఏటాపిక్ మీదపుస్తకం కావల్సినా క్షణాల్లో దొరుకుతుంది. ఆల్ఫ్రెడ్ ఫోయర్స్ కస్టమర్స్ని చాలా శ్రద్ధగా చూస్తాడు. తన దగ్గర పుస్తకం కొన్నా, కొనక పోయినా ఎవరికే పుస్తకం కావాలంటే ఆ పుస్తకం నిరాటంకంగా చదువుకోవచ్చు. చాలా మంది ఉదయం తొమ్మిది నుండి సాయంత్రం ఆరు దాకా ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకుంటున్నారు కూడా! ఎంతోమంది పండితులు అతని దుకాణానికి వస్తారు. ఇది వరకటి రాణీ మేరీ, ఎలిజబెత్, విన్స్టన్ చర్చిల్ రెగ్యులర్‌గా ఫోయర్స్‌కు వెళుతుండేవారు. ప్రఖ్యాత నవలా రచయిత ఆర్నాల్డ్ బెనెట్ తన నవలల్ని ఎంతమంది పాఠకులు చదువుతున్నారో చూడ్డానికి అక్కడికివచ్చేవాడట. ఫోయర్స్ పాఠకులు ప్రపంచమంతటా వున్నారు. ప్రతి సంవత్సరం పాతవీ, కొత్తవీ కలిపి ఇరవై లక్షల పుస్తకాలు అమ్ముడు పోతాయి. అందులో మూడొంతులు పోస్టుద్వారా పంపించాల్సినవే. అయినా గాని ఫోయర్స్ పాత పుస్తకాల్ని కొనడం మాత్రం మానలేదు. ఇదేగాక 12 లక్షల పుస్తకాలతో ఒక లైబ్రరీ, విడిగా ఒక మాగజైన్ క్లబ్బుకూడా వున్నాయి.

ప్రతివారం సాహితీ వేత్తలకు విందు ఏర్పాటు చేసి పేరుపొందిన రచయితలను ముఖ్య అతిథులుగా ఆహ్వానిస్తాడు. పరస్పరం స్నేహ సంబంధాలు పెంపొందించుకునేందుకు ఎంతోమంది సాహితీ ప్రియులు ఆ విందుకు హాజరవుతారు.



## ప్రదర్శనల నగరం

చరిత్ర చూస్తుంటే ప్రదర్శనలు ప్రజాస్వామ్యంలో ఒక భాగంగా కనిపిస్తున్నాయి. దేనికోదానికి ఆందోళన జరపడం, వాటిని ప్రభుత్వం దృష్టికి తేవడం కోసం

ప్రదర్శనలు జరపడం ప్రస్తుతం అమెరికా రాజధాని వాషింగ్టన్‌లో సర్వసామాన్యమైపోయింది. రెండవ ప్రపంచ యుద్ధం నాటివరకూ ఒకటో, అరో తప్ప ఏ గొడవలూ లేకుండా వాషింగ్టన్ నగరం ప్రశాంతంగా వుండేది. యుద్ధానంతరం యువతరంలో విప్లవ భావాలు చెలరేగిన ఫలితంగా ప్రదర్శనలు నిత్య జీవితంలో ఒక భాగం అయి కూర్చున్నాయి. 1968లో సంవత్సరం మొత్తంమీద వైట్ హౌస్ ముందు జరిగిన రకరకాల ప్రదర్శనల్లో తొమ్మిది వేల మంది



పాల్గొన్నారు. రాను రాను ప్రదర్శకుల సంఖ్య అధికమవుతోంది. 1973లో డెబ్బై వేల మంది స్త్రీలు సమాన హక్కుల కోసం వైట్ హౌస్ ముందు ప్రదర్శన జరిపితే 1977లో వాషింగ్టన్‌లో 677 ప్రదర్శనలు జరిగాయి. కేవలం 20 మంది టిబెట్ పౌరులు అమెరికాలో జరిపిన ప్రదర్శన అన్నింటిలోకి చిన్నదిగా చెప్పుకుంటారు. 1977లోనే అమెరికాలో వున్న ఇరానీ విద్యార్థులు షా దురాగతాలకు వ్యతిరేకంగా ఇరవై నాలుగు ప్రదర్శనలు జరిపారు. ఇవిగాక శాంతి కాముకులు, మత ప్రచారకులు, బొగ్గు గని వాళ్ళు, అంధులు, పక్షులను ప్రేమించే వాళ్ళు కారణం ఏదైనా గానీ ప్రదర్శన తప్పదు. అన్నిట్లోకీ ఆసక్తి దాయకమైనది హోమోసెక్సుని ఆచరణలో పెట్టడానికి చట్టబద్ధమైన అనుమతి నివ్వాలని స్త్రీలు జరిపిన ప్రదర్శన. అరబ్బులు, యూదులు ఒకేసారి ఒకే వేదిక మీద వైట్ హౌస్ ముందు ప్రదర్శన జరిపిన అపూర్వ సంఘటనలు కూడా వున్నాయి. అమెరికాలో పోలీసులకు ఓవర్ టైం ఇస్తారు. గత పదేళ్ళుగా కేవలం పోలీసులకు ఓవర్ టైం డబ్బు నివ్వడానికి కొన్ని కోట్ల డాలర్లు ఖర్చయిందట. రాను రాను అమెరికా రాజధాని వాషింగ్టన్ ప్రదర్శనల నగరంగా పేరు పడ్డా ఆశ్చర్యపోనక్కరలేదు.

## అదృష్టవంతులు

జేబులో ఒక్క పైసా అయినా లేని నిరుద్యోగ యువకుడు అమెరికాలోని వ్యోమింగ్ వీధుల్లో కాళ్ళీడ్చుకొంటూ వెళ్ళి ఓ బార్ ముందు నిలబడ్డాడు. లోపల కొందరు ధనవంతుల పిల్లలు తింటూ, తాగుతూ సంతోషంతో కేరింతలు కొడుతున్నారు. నిరుద్యోగ యువకుడు చివరికి అభిమానాన్ని పక్కకి నెట్టి "సార్! మీరే పని చేయమంటే ఆ పని చేస్తాను. ముందు తినడానికేమన్నా ఇవ్వండి సార్!" అనడిగాడు. తాగివున్న ఆ యువకులు తాముచెప్పింది ఏదైనా చేస్తానని అంగీకరించాక ఆ యువకుడి చేతిలో ఓ డాలరు పెట్టి "పై అంతస్థులో ఓ అమ్మాయి




వుంది. వెళ్ళి ఆమెను ముద్దు పెట్టుకొని తిరిగి రా" అన్నారు. నిజానికామె ఓ పెద్ద గనుల యజమాని కూతురు. అతను తన ఆస్తిపాస్తులను చూసిపోదామని ఆ వూరొచ్చి హోటల్లో దిగాడు. ఆకలిలో మిగిలిన విషయాలు ఆలోచించకుండా సంపన్నుల పుత్రరత్నాలు వెంటరాగా పైకి చేరుకున్నాడు. గని యజమాని కూతురు పుస్తకం చదువుతూ వరండాలో కూర్చుంది. నిరుద్యోగ యువకుడు తిన్నగా ఆమెదగ్గరకెళ్ళి ఒక్కమాటయినా మాట్లాడకుండా ఆమె పెదవులపై ముద్దు పెట్టుకున్నాడు. ఆ అమ్మాయి దిమ్మెరపోయి, గట్టిగా కేకలు వేసింది భయంతో. కేకలు విని వచ్చిన ఆమెతండ్రి ఆ యువకుడి చెంపలు వాయగొట్టి, క్రిందికి తోసేశాడు. ఆ యువకుడు 12 అడుగుల ఎత్తునుంచి పడటంతో అతని తల పెద్ద రాయికి కొట్టుకుంది. అతను చనిపోయాడనేఅనుకున్నారందరూ. అప్పటికి తాగిన మత్తులో వున్న సంపన్న యువకులు తెలివిలో కొచ్చారు. గనుల యజమానితో అసలు సంగతి చెప్పేశారు. విషయం విన్న ఆ అమ్మాయి, ఆమెతండ్రి జాలిపడి ఆ యువకుడిని తమ గదిలోకి చేర్చి, చికిత్స చేయించి ఎలాగైతేనేం ప్రాణాలు కాపాడారు. గనుల యజమాని తన గనుల్లో ఒకదాన్లో అతనికి ఉద్యోగం ఇచ్చాడు. ఆ యువకుడు సామర్థ్యంతో త్వరలోనే అతని యజమాని విదేశీ ఆస్తులన్నిటి సంరక్షకుడయ్యాడు. ఈ మధ్యకాలంలో ఆ యువకుడి శక్తి సామర్థ్యాలు, మంచితనం చూసి మురిసిపోయి గనుల యజమాని తన కూతుర్ని అతనికిచ్చి పెళ్ళిచేసి తన ఆస్తులన్నింటినీ అతడిపేర మార్పించాడు. ముద్దు చెంపలు వాయగొట్టిన కథలే విన్నాంగాని ఆస్తిపాస్తులుతెచ్చిపెట్టాయంటే జనం ఎగబడరూ!

ఇంగ్లండ్‌లోని లీడ్స్ అనే ప్రాంతంలో ఒకతను దర్జాగా సిగరెట్లు కొనడానికని ఓ షాపులో ప్రవేశించాడు. కౌంటర్ దగ్గిర షాపు యజమాని కుమార్తె కూర్చొని వుంది. వచ్చినతను సిగరెట్లు కొంటూ ఆమెను తెగ అల్లరి చేశాడు. అయితే సహించింది ఆ అమ్మాయి. ఆమె ఉదాశీనతను తనమీద ఇష్టంగా భావించిన అతగాడు ఉత్సాహంగా ఆమె కూర్చున్న వైపుకి గెంతి పెదవులపై ముద్దు పెట్టుకున్నాడు. ఆ అమ్మాయి గట్టిగా అరుస్తూ



అతని చెవులు గట్టిగా పట్టుకొని మెత్తేసింది. లోపలినుంచి ఆమె తండ్రి వచ్చి పొగతాగే గొట్టంతోనూ, సిగార్ పెట్టెతోనూ ఆ యువకుడి తలమీద బాదాడు. ఒక చిన్న ముద్దుకి ఇంత శిక్షా! అనుకున్న అతగాడు వ్యాపారి మీద ఫిర్యాదు చేసి అరెస్ట్ చేయించాడు. విచారణ సమయంలో కోర్టంతా నవ్వుల్లో నిండిపోయిందట. కోర్టు వారు వ్యాపారిని నిర్దోషిగా విడుదల చేశారు. యువకుడు ఊళ్ళో

అందరూ తనని చూసి సవ్వడంతో ఉండలేక దక్షిణాఫ్రికా బయలుదేరాడు. కేప్ పట్టణంలో నిరుద్యోగిగా వీధులు సర్వే చేసి కింబర్లే చేరుకున్నాడు. అక్కడ ఒక చిన్న ప్లాట్ కొన్నాడు. ఆ నేలలో వజ్రాలున్నాయన్న అనుమానం కొద్ది వారాలకే నిజమైంది. ఆ భూమిని కొనడానికి ఒక కంపెనీ ముందుకొచ్చింది. బేరసారాలయ్యాక నలభై వేల డాలర్లకు అమ్మేశాడు. ఇందులో పదివేల డాలర్లు పెట్టి మరోచోట భూమినికొన్నాడు. అతని అదృష్టవశాత్తు ఆ నేలలో బంగారం వుందని తేలింది. ఈ ప్లాట్ సతను లక్షా అరవై వేల డాలర్లకమ్మాడు. దాంతో అతని దశతిరిగింది. అలా ఒకముద్దు అతనికి లక్షా ఎనభై వేల డాలర్లను సంపాదించి పెట్టింది.

# బతికుంటే...

ఉద్యోగ నిర్వహణా బాధ్యత ఒక్కోసారి సంకట స్థితిని తెచ్చిపెడుతుంది. పాండిచ్చేరికి చెందిన కుమారస్వామి అనే శాస్త్రజ్ఞుడు భారత ప్రభుత్వం తరుఫున ఉగాండా వెళ్ళాడు. వెంట అతని అసిస్టెంటు నాగవల్లి కూడా ప్రయాణమైంది. వాళ్ళు ఉగాండా చేరుకున్న రెండో రోజునే టాంజేనియా సేనలు ఉగాండాపై దండెత్తాయి. దాంతో కంపాలాకు ముప్పయి అయిదు కిలోమీటర్ల దూరంలో వున్న ఎంటబీ విమానాశ్రయంలోవున్న హోటల్ ఎయిర్‌పోర్టులో ఓ నెల్లాళ్ళు బసచేశారు. ఓ రోజు నాగవల్లి కారు డ్రైవరు పరిగెత్తుకుంటూవచ్చి అతని ఇంటివెనక భాగాన్ని టాంజానియా సేనలు ఆక్రమించుకుంటున్నాయనీ వాళ్ళని వెంటనే బయల్దేరమనీ చెప్పి గబగబా వాళ్ళని ఆఫీసుకి తీసికెళ్ళాడు. భయంతో వణికిపోతూ నాగవల్లి ఎలాగోలా కార్డ్సని పంచ్ చేయడం మొదలెట్టింది. ఆఫీసు కిటికీల దగ్గరి కెళ్ళొద్దని ఆమెని హెచ్చరించాడు డైరెక్టరు. ఇరవై నాలుగేళ్ళ ఈడీ అమీన్ కొడుకు స్టెన్‌గన్ పట్టుకుని ఆ చుట్టుపక్కల విక్టోరియల్ లేక్ దగ్గర తిరుగుతున్నాడు. ఎవరిమీద అనుమానం వచ్చినా కాల్చిపారేసేలా వున్నాడు. అందరూ బల్లల కింద



దాక్కుని, అతని తుపాకిలో గుళ్ళన్నీ అయిపోయాకే బైటికి రావడానికి నిశ్చయించుకున్నారు.

తర్వాత నాగవల్లి వాళ్ళు కంపాలాలో ఇంపీరియల్ హోటల్లో దిగారు. ఘనత వహించిన అమీన్‌గారి బంగళా అక్కడికి చాలా దగ్గర్లోవుంది. దాన్ని ప్రెసిడెంట్ లాడ్జి అనికూడా అంటారు. బాంబుల వర్షం చూసి, పంపు నీళ్ళ తగాదాలు తప్ప రెండోది ఎరుగని నాగవల్లి జ్వరం తెచ్చుకుంది. ఈ ముట్టడి ఫలితంగా వస్తువుల ధరలు విపరీతంగా పెరిగిపోయాయి.

బ్రెడ్ ఒకటి పదిహేడు రూపాయలు, బియ్యం కిలో డెభై రూపాయలకీ అమ్మారు. మధ్యాహ్నం రెండు గంటలకల్లా దుకాణా లన్నీ మూసివేశారు. రెండు గంటల తర్వాత రోడ్డుమీద పిట్టపురుగులేదు. ఈదీ అమీన్‌గారు పత్తా లేకుండా పోయారు. యునెస్కో వారి సహాయ సహ కారాలతో నైరోబీ వచ్చి అక్కణ్నించి భారతదేశం చేరుకున్నాక ఇంపీరియల్ హోటలు మీద బాంబులుపడి సర్వనాశనం అయిపోయిందన్న వార్త పేపర్లో చదివిన నాగవల్లి, కుమారస్వామి 'బ్రతుకు జీవుడా' అనుకున్నారు.

# పరిశుభ్రత

ఈ మధ్యకాలం వరకు జర్మన్ దేశస్థులు ప్రపంచంలోని అన్ని దేశాల వారికన్నా సమర్థులని, శుభ్రంగా వుంటారని ప్రతీతి. జర్మన్స్ కూడా తమ ఈ సుగుణాలను చూసి గర్విస్తారు. కాని రూజ్వెల్ట్‌కి వీరు గర్విష్ఠుల్లా కన్పిస్తే, డీగన్‌లేకు అయోమయం మనుషులుగా, బలహీనులుగా అన్పించారు. గర్వం, మూర్ఖత్వం వలన జర్మన్లు పాడయ్యారు అని జె. బి. షా అభిప్రాయం. మొత్తానికి ఎవరెలా అనుకున్నా ఈ సుగుణాలువారిలో నిజంగా ఎంతవరకు వున్నాయని పరిశీలించిన వారు లేరు.

ఈ మధ్య ఈ సుగుణాలు జర్మనీలో క్రమంగా తగ్గుతున్నట్లే వుంది. ఒకప్పుడు పరిశుభ్రతకి పేరొందిన జర్మన్లు కిటికీ చెక్కలు, కార్లు చాలా శుభ్రంగా వుంచినా వ్యక్తిగత పరిశుభ్రతలో అలసత్వం కన్పరుస్తున్నారట. అరవైఐదు శాతం జర్మన్లు ప్రత్యేక సందర్భాల్లో మాత్రమే పళ్ళు శుభ్రంచేస్తే నలభైఐదు శాతం జర్మన్ కుటుంబాల్లో మొత్తం కుటుంబానికి కలిపి ఒకే ఒక టూత్‌బ్రష్ వుంటుందట. వీరిలో కేవలం పదిశాతం మాత్రమే రోజుకి రెండుసార్లు పళ్ళు తోముకుంటే ఏభైశాతం మంది మాత్రమే వారానికోసారి స్నానం చేస్తారు. రెండునుంచి పది శాతం మాత్రమే రోజూ దుసులు మారుస్తారు. మగవారి కన్నా స్త్రీలే ఎక్కువ శుభ్రంగా వుంటారట.

నమ్మకస్తులు, సమర్థులు అని పేరొందిన జర్మన్లకి ఇప్పుడా ఖ్యాతి దక్కేలా



లేదు. బెర్లిన్‌లోని ఓ ఫ్యాక్టరీలో ఐదువేల మంది ఉద్యోగులున్నారట. ఫ్యాక్టరీ లాభాలతోనే నడుస్తున్నా ఉద్యోగులెవరికీ పనిమీద అంత శ్రద్ధలేదట. కొత్తగా చేరిన వ్యక్తి అందర్నీ పరిచయం చేసుకోవాలంటే మందు పార్టీ ఇచ్చి తీరాలట. అలాగే ప్రధానమయినా, పెళ్ళయినా పార్టీలిస్తేగాని పిల్లేదట. మధ్యాహ్నంపూట సుష్టుగా భోజనం చేయడం వలన వారు చేయగలిగినంత పని చేయలేకపోగా

సాయంత్రం వీలయినంత త్వరగా ఇళ్ళకి పోడానికే ప్రయత్నిస్తారట. అంచేత ఈ సుగుణాల్లో ఇప్పుడు ప్రథమస్థానం ఎవరో మరి?

# బాబా వైద్యం

చెట్టుకో బాబా పుట్టకో బాబా వెలుస్తున్న ఈరోజుల్లో రెండున్నర సంవత్సరాల కుర్రవాడు బాలక్ బాబాగా చెలామణి అవడం వింత కాకపోయినా సంచలన వార్తే! పశ్చిమబెంగాల్‌లో అంబా అనే ఓ చిన్న గ్రామంలో బీదవాడైన పగల్ మాల్ కొడుకే ఈ బాలక్ బాబా. ఒకప్పుడు ఎక్కువ జనసంచారం లేక ప్రశాంతంగా వుండే ఈ గ్రామం ఇపుడు బస్సుల్లోనూ, రిక్షాల్లోనూ, ఎద్దు బళ్ళల్లోనూ వచ్చే వంద లాది భక్తులతో నిరంతరం సందడిగా వుంటోంది. దూర ప్రాంతాల నుండి కూడా ఎంతోమంది ప్రజలు వస్తున్నారు. ఉబ్బస వ్యాధి, గ్యాస్ ట్రబుల్, కడుపు నొప్పికి ప్రత్యేకమైన మందులు ఉచితంగా యిస్తాడు బాబా.

ఇదివరలో బాలక్ బాబా తండ్రి పగల్ మాల్ తరచూ విపరీతమైన కడుపు నొప్పితో బాధపడుతూ వుండేవాడు. ఆరు నెలల కిందట ఓ అర్ధరాత్రి కడుపు నొప్పితో లుంగలు చుట్టుకుపోతున్న తండ్రిని చూసి పరిగెత్తుకుంటూ వెళ్ళి పొలాల్లోంచి ఏవో ఆకులు తీసుకొచ్చి తండ్రిని స్నానం చేయమని ఆ తర్వాత ఆ ఆకుల్తో చేసిన మందిచ్చాడు. అంతే! మూడు రోజుల్లో మంత్రం వేసినట్లు అతని కడుపు నొప్పి మాయమైంది. కానీ ఈ విషయం రహస్యంగా వుంచమని తండ్రిని కోరాడు. తర్వాత పక్క గ్రామంలో వున్న బంధువుకు అదేమందు ఇచ్చి నయం చేయడంతో ఈ విషయం వూరూ వాడా తెలిసిపోయి ప్రజలు వైద్యం కోసం రావడం మొదలు పెట్టారు. ఒక్కోసారి ఆ ప్రజల్ని అదుపులో పెట్టడానికి పోలీసులు అవసరమయ్యేవారు. చుట్టుపక్కల పట్టణాల్లో హోటళ్ళు, అతిథి గృహాలు, తినుబండారాల దుకాణాలు, యాత్రీకులతో క్రిక్కిరిసి వుండేవి. రిక్షావాళ్ళకి, చిల్లర వర్తకులకి



మంచి గిరాకి. వైద్యం కోసం వచ్చిన వారి క్యూ ఓ మైలు పొడవు వుంటుంది. తాటాకులు కప్పిన ఓ చిన్న యింట్లో కూర్చుని బాలక్ బాబా అందరికీ మందు లిస్తాడు. అతను మందులు తయారుచేసే ఆకుల్ని పోగుచేయడానికి బాబా చేతికింద ఏడెనిమిది మంది వున్నారు. పిల్లవాడు అలసిపోయినప్పుడు అతని తల్లిదండ్రులు మందిచ్చేవారుగానీ ప్రజలు వారి చేతో ఇచ్చిన మందు పని చేయదని తీసుకునే వారుకాదు. బాలక్ బాబా డబ్బులు తీసుకోడని వస్తురూపేణా ఏదో ఒకటి అతని

ముందుంచి వెళ్ళిపోతారు భక్తులు.

# పిచ్చి కుదిరింది

ఉత్తర ప్రదేశ్‌లోని భరత్‌పూర్ ప్రాంతంలో గులాబి బాబు అనబడే ఓ లక్షాధికారి, అయిన వడ్డీ వ్యాపారి వున్నాడు. వడ్డీ వ్యాపారి అనగానే చాలా మందికి సినిమా సీన్లు గుర్తొస్తాయిగాని ఈ గులాబి బాబు పక్కా గాంధేయవాది. అందుకని తక్కువ వడ్డీకి కేవలం హరిజనులకి మాత్రమే అప్పులిస్తుంటాడు. మూడేళ్ళ క్రితం ఇతనికి గుండె నొప్పి వచ్చినపుడు మేకపాల సాయంతో, సంపూర్ణారోగ్య వంతుడిని చేసింది అతని భార్య.

ఆ మేకపాలే తనను గట్టున పడేశాయని గట్టిగా నమ్మిన గులాబి బాబు ఆ మేకకు రాచమర్యాదలు చేశాడు. కాని ఆ మేక ఓ పిల్లని కని కొన్ని నెలలకు మరణించడంతో ఆ రాజయోగం మేక పిల్లకి పట్టింది. చనిపోయిన మేకకు ఘనంగా శ్రాద్ధకర్మలు జరిపి అనేక మంది బ్రాహ్మణుల్ని, మేకల్ని పిలిచి విందు భోజనం పెట్టి ఒక్కొక్కరికి ఐదు స్టీలు కప్పులను బహుమతిగా ఇచ్చాడు.

మేక పిల్ల కోసం గులాబి బాబు ఇరవై లక్షల ఖరీదుచేసే భవనాన్ని నిర్మించాలని నిశ్చయించు కున్నాడు. ప్రస్తుతం ఈ భవన నిర్మాణంమీద దాదాపు డెభ్బై వేలు ఖర్చు చేశాడు. ఇది పూర్తవడానికి పది సంవత్సరాలు పడుతుందట. మేక పిల్లకి మాత్రం అవసర ముందదా అని ఇందులో విశ్రాంతి గది, పడక గది, భోజనాల గది కూడా ఏర్పాటు చేశారు. ఈ మేకపిల్లగారు రోజూ శ్రేష్టమైన బెంగాల్ సెనగలను వెండిపళ్ళెంలో వడ్డిస్తే కాలు మీద కాలేసుకొని మేస్తుందట. ఇదే ఇలా వుంటే ఇక ఈ మేక పుట్టిన రోజు వైభోగమే మని చెప్పాలి. ఏకంగా ఆహ్వాన పత్రికలు అచ్చు వేయించి ఊరి వాళ్ళందరినీ విందుకి పిలిచి భారీ ఎత్తున చేస్తాడట.

అంతేకాదు ఇతను గాడిదను, పందిని కూడా భక్తిగా పూజిస్తాడు. ఇదే





మిటని అడిగిన వారిని "మీకవి కేవలం గాడిదలు, పందులే కావచ్చు కాని నాకు గాడిదంటే లోకమాత, పంది అంటే వరాహ దేవత" అంటూ కేక లేస్తాడట. ఇతనికి ఇష్టమైన రంగు గులాబి. అన్నీ భారీ ఎత్తున చేసాడు గనుకనే గులాబి బాబంటారు ఊర్లోవాళ్ళతన్ని.

చైతన్య స్టెతస్కోపు టేబిలు మీద పెట్టాడు. ఎదురుగా కూర్చున్న ముసిలాడు చొక్కా క్రిందికి దింపుకున్నాడు.

ఆ ముసిలాడు దగ్గుతున్నాడు. తెల్లటి గెడ్డం బాగా పెరిగిపోయింది. రాలిపోతున్న తల వెంట్రుకలు......కళ్ళు చాలా లోతుకు పీక్కుపోయాయి. వాటిలోనుండి ఎప్పుడూ ఏదో విషాదకర దృశ్యాన్ని చూస్తున్నట్లున్న చూపులు.

"దగ్గు బాగా వస్తున్నదా?..."

"బాగంటే ఏం చెప్పేది? దగ్గి దగ్గి నా పేగులు తెగిపోతయ్యేమోనని భయం వేస్తోంది. హమ్మ...! ఇట్లా దగ్గే బదులు గింత విషం మింగి చస్తే బాగుండు!"

చైతన్య చిన్నగా నవ్వుకున్నాడు. ప్రిస్క్రిప్షన్ రాసి మందులు ఎట్లా వాడాలో చెప్పి ముసిలాణ్ని పంపించేశాడు!

వేదాంతం చెప్పే వాళ్ళు మనిషిలో మూడు రకాల వైరాగ్యాలున్నట్లు చెబుతారు. పురాణ ... స్మశాన... ప్రసూతి వైరాగ్యాలతోబాటు 'రోగ వైరాగ్యం' కూడా వాటితో చేర్చితే బావుండేది. రోగం కాస్త ఎక్కువైనపుడు ప్రతివాడూ వెంటనే ఛస్తే ఏ బెడదా ఉండదు కదా అని అంగలార్చుకుపోతాడు. అది కాస్తా నయం కాగానే ప్రాణమంటే అంతులేని తీపి ఏర్పడుతుంది. బాధ తాత్కాలికంగా బ్రతుకుమీది మమకారాన్ని అణిచి పెట్టి ఉంచుతుంది.

సాయంత్రం కావస్తూంది.

చైతన్య గడియారం చూసుకున్నాడు. అయిదున్నర!

బయట సినిమాలకు పోయే రిక్షాలు గణగణమని శబ్దం చేసుకుంటూ పోతున్నాయి!

ఓసారి ఉదయంనుండీ వచ్చిన కేసులు లెక్క చూసుకున్నాడు. "నాట్ బాడ్!" అని తనలో తాను గొణుక్కున్నాడు.

పట్నాల్లో ప్రాక్టీసు పెట్టే డాక్టర్ల సంఖ్య చాలా ఎక్కువ! ఇంతమందిలో పోటీకి నిలబడి, తట్టుకుని బాగా ఆర్జించే వాళ్ళు చాలా కొద్దిమంది మాత్రమే!

'హస్తవాసి', 'అదృష్టం' వీటి మీద చైతన్యకు నమ్మకంలేదు. పరిస్థితులు అనుకూలంగా లేనపుడు ఏం చేయగలం? అని మాత్రమే ఆలోచిస్తాడు!

చైతన్య నుదురు తుడుచుకున్నాడు.

"సార్!" కాంపౌండర్ కుర్రాడు పలకరించాడు.

"ఏమిటి?"

వాడు తలగోక్కున్నాడు. "కొత్త ఇంగ్లీషు సినిమా వచ్చిందండీ"

"మంచిది!"

వాడు హుషారుగా వెళ్ళిపోయాడు. చైతన్య తలుపులు మూసి తాళం వేసి రోడ్డు మీదకు వచ్చాడు.

అప్పటికి రోడ్డుమీద జనం రద్దీ బాగా ఎక్కువయింది. జనం హడావుడిగా రంగు దీపాల మధ్య మిడతల్లా తిరుగుతున్నారు.

"డాక్టర్...డాక్టర్!"

ఎవరో వెనక నుండి కేకేశారు. నెమ్మదిగా నడుస్తున్న చైతన్య ఆగి వెనక్కి తిరిగి చూశాడు. అంతలోనే వేగంగా దూసుకువచ్చిన అంబాసిడర్ కారు చైతన్య పక్కన ఓ కుదుపుతో ఆగింది.

"డాక్టర్ చైతన్య మీరేనా?"

"ఆ"

"చాలా అర్జంటు ... వెంటనే కారెక్కండి సార్"

చైతన్య అయోమయంగా చూశాడు. డ్రైవరు కారు దిగి వెనుక డోర్ తీసి పట్టుకుని చైతన్య వంక చూశాడు.

"ఎక్కడికి ?"

"అమ్మగారికి ఒంట్లో బాగోలేదు!"

అమ్మగారెవరు? తాను ప్రాక్టీసు పెట్టి సరిగ్గా నెలయినా పూర్తి కాలేదు.

తన పేరు ఇంకా ఇళ్ళకు పిలిచేటంత ప్రాచుర్యం పొందలేదు. పైగా తన దగ్గరకు వచ్చే రోగులందరూ చిన్న చిన్న ఉద్యోగస్థులూ, మధ్య తరగతి కుటుంబాలవారూ, పేదవారూ మాత్రమే.

"రండి సార్ !"

చైతన్య మళ్ళీ క్లినిక్ తలుపులు తెరిచి 'మెడిసిన్ ఛెస్ట్' అందుకుని వచ్చి కార్లో కూర్చున్నాడు. కారు రయ్యిమని ముందుకు దూసుకుపోయింది.

"మీ అమ్మగారెవరు ?"

"సంధ్యాదేవిగారు!" డ్రైవరు చాలా క్లుప్తంగా సమాధానం చెప్పాడు.

కారు రోడ్డుమీద దూసుకుపోతోంది. చైతన్య మనసునిండా ఈగల్లా ముసిరిన ఆలోచనలు.

చైతన్య కింకా ముప్పయేళ్లు నిండలేదు. పొడగరి..ఉంగరాల క్రాపు...చూడడానికి బక్కపలచగా కన్పిస్తాడు. చాలా మృదువుగా మాట్లాడతాడు. అదో ప్రత్యేక ఆకర్షణ అతనిలో. కళ్లు కత్తుల్లా, మెరుపుల్లా తీక్షణంగా చూస్తుంటాయి. వాటిలో విజ్ఞానం తాలూకు ఛాయలు కొట్టొచ్చినట్లు కనిపిస్తాయి.

* * *

కారు ఆగింది.

డోరు తెరుచుకుని చైతన్య క్రిందికి దిగాడు.

ఎదురుగా ఉన్న రాజ భవనంలాంటి బంగళాను చూసి ఓ క్షణం అట్లాగే నిలబడిపోయాడు.

డ్రైవరు గేటు తెరిచాడు.

బాటకు ఇరుప్రక్కల అందమైన జినియాలు, క్రోటన్లు! గేటుమీదికి ఎగబ్రాకిన బోగన్ విల్లాలు. లాన్‌లో వరుసలుగా విరబూసిన గులాబీలు, కాస్మాస్ పూలు !

చైతన్య యాంత్రికంగా అడుగులు వేస్తూ లోనికి నడిచాడు. వరండాలో నలుగురు నౌకర్లు ఆందోళనగా ఎదురు చూస్తున్నారు.

"ఇటు...ఇటు !"

చైతన్య వారు చూపించిన గదిలోకి ప్రవేశించాడు. ఫోం బెడ్‌మీద పడుకుని ఉంది ఆమె ! సంధ్య అంటే ఆవిడే కాబోలు.

వెల్లకిలా పడుకునుంది. శ్వాస బలంగా పీల్చి వదులుతూంది !

చైతన్య ముక్కుపుటా లెగరేశాడు ! వెనక నిలబడి ఉన్నవాళ్ళని తప్పుకోమని సైగచేసి, కుర్చీ ముందుకు లాక్కుని స్టెతస్కోప్‌తో పరీక్షించాడు.

ఆవిడ కళ్లు నెమ్మదిగా తెరిచి, చూసి మళ్ళా మూసుకుంది. అప్పుడా కళ్ళు సూర్యకిరణాలను మింగడానికి కొలను లోంచి పైకి లేచిపడిన చేపపిల్లలా మిలమిల మెరిశాయి!

"చెప్పండి. ఎన్ని మాత్రలు మింగారు?"

తిరిగి ఆమె కళ్ళు ఓసారి తెరుచుకుని మిలమిల మెరిశాయి.

"ఊఁ! చెప్పండి !"

ఆమె నెమ్మదిగా గొణిగింది. "సెవెన్"

చైతన్య గబగబ రెండు ఇంజక్షన్లు చేశాడు.

చీకటి పడింది. నౌకరు స్విచ్ వేశాడు. గదిలోని తెల్లని నియోన్‌లైటు వెలిగింది.

ఆ కాంతిలో మొజాయిక్ నేల పాల పుంతలా మెరిసిపోతోంది. కిటికీ గుండా తోటలోని గులాబీలు సౌరభాన్ని భారంగా మోస్తూ గాలిలోనికి పరిగెత్తుకువస్తోంది.

చైతన్య సోఫాలో కూర్చుని తదేకంగా సంధ్య మొహంలోకి చూశాడు. ఆమె మొహం పాలపుంతలో వెలిగిపోతున్న చంద్రునిలా ఉంది. నల్లటి నిడుపాటి వెంట్రుకలు పరుపుమీద అందంగా పరుచుకునున్నాయి.

"చాలా అందకత్తె" అని అప్రయత్నంగా గొణుక్కున్నాడు చైతన్య తనలో తానే.

"సార్"

చైతన్య తలత్రిప్పి చూశాడు. సెగలు కక్కుతున్న కాఫీ పట్టుకుని నౌకరు నుంచున్నాడు. చైతన్య మౌనంగా కాఫీ అందుకున్నాడు. వాడు కూడా మౌనంగానే వెనక్కి తిరిగి వెళ్ళిపోయాడు.

చైతన్య నెమ్మదిగా బయట వరండాలోకి వచ్చాడు.

రాజప్రాసాదం లాంటి ఆ మహా భవనంలో చైతన్య ఒంటరితనం ఫీలయ్యాడు. తోటంతా నిద్రపోయింది. వరండాలో చాలా చల్లగా ఉంది.

చైతన్య మెదడులో రెండు మూడు ప్రశ్నలు కదలాడాయి !

ఈవిడ జమీందారిణియా! మరయితే ఈ ఇంట్లో ఎవరూ లేరేం? ఒక్కర్తే ఎట్లా ఉంటోంది.. పెళ్ళయిందా? మెళ్ళో మంగళసూత్రం కనిపించడం లేదు. అయితే గొప్పవాళ్ళ ఇళ్ళల్లోనూ ఒంటిమీదా అవి లేకపోవడం కూడా ఫాషను



కావచ్చు !

వాటన్నింటినీ మించి ఓ తేలుకొండి లాంటి ప్రశ్న అతన్ని వేధించింది. తాను కొత్తగా ప్రాక్టీసు పెట్టుకున్న కుర్ర డాక్టరు...తన హాస్పిటల్ గురించీ, తన గురించీ ఆ చుట్టుపక్కల ఇళ్ళ వాళ్ళకే సరిగా పట్టినట్లు లేదు! ప్రాక్టీసూ, పేరూ కూడా చెప్పుకోదగినంత లేదు ! అలాంటప్పుడు తన పేరు ఈవిడకు ఎట్లా తెలుసు? తెలిసినా ప్రత్యేకించి తననే పిలవడమేమిటి? ఫోను ఎత్తితే పదిమంది 'ఫారిన్ రిటర్న్డ్' డాక్టర్లు వరండాలో గుమిగూడతారు గదా!

హాల్లో గడియారం తొమ్మిది గంటలు కొట్టింది.

చైతన్య సంధ్య పడుకున్న గదిలోకి వచ్చాడు. సంధ్య కళ్లు తెరిచి పైకప్పు కేసి చూస్తోంది. చైతన్యను చూసి నీరసంగా నవ్వింది. ఆ నవ్వు ఆటలో ఓడిపోయిన పసిపాప నవ్వులా ఉంది! అయితే చైతన్యకు మాత్రం యుద్ధంలో ఓడిపోయిన వీరుడు గెలిచినవాడు నవ్వుతున్నపుడు అతన్ని చూసి, నవ్విన నవ్వులా అనిపించింది.

"కూర్చోండి!"

"ముందు మీరు కదలకుండా అట్లాగే పడుకోండి! లేచే ప్రయత్నం చేయకండి!" చైతన్య వారించాడు.

సంధ్య కొంచెం వెనక్కి జరిగి దిండు కానుకుని చైతన్యను చూస్తూ నవ్వింది.

"సో... యూ ఆర్ ఆల్‌రైట్!" చైతన్య కొద్ది క్షణాలు ఆలోచించాడు. తర్వాత "మరిక నేను పోయిరావచ్చును కుంటాను!" అన్నాడు.

"అపుడే!" సంధ్య కళ్ళు మళ్లా మిలమిల లాడాయి!

"మీ ఒంట్లో బావుందిగదా! అన్నట్లు

ఈ కాప్సూల్స్. ఈ టాబ్లెట్లు రెగ్యులర్‌గా ఓ పది హేను రోజులపాటు వాడాలి! ఎట్లాఅంటే.. ఉదయం ఒక కాప్సూలు.. రెండు టాబ్లెట్లు.. మధ్యాహ్నం..

"ఒక టాబ్లెటు.. రెండు కాప్సూల్సు!" సంధ్య నవ్వింది. అంత నీరసంలోనూ నవ్విన సంధ్య నవ్వు ఆ తెల్లని లైటు వెలుగులో క్షణంసేపు గలగల మంది.

చైతన్య బిత్తరపోయి చూశాడు!

"ఆ బీరువాలో మీరు రాసిన టాబ్లెట్లూ, కాప్సిల్సూ.. సీసాల కొద్దీ ఉన్నాయి. వాటిని నేను చాలా కాలంగా వాడుతున్నాను కూడా!"

చైతన్య తికమక పడ్డాడు. ఏం మాట్లాడాలో తోచక ఆ పాలనురుగు లాంటి కాంతిలో అంతకన్నా ఎక్కువగా వెలిగిపోతున్న ఆమె మొహం వంక చూస్తూ నుంచుండి పోయాడు!

"ఈ మాత్రలూ.. టానిక్కులూ వాడి వాడి విసుగెత్తి పోయాను!"

"మరి!"

"ఏం...లేదు!" సంధ్య బలహీనంగా నవ్వి, తనను తాను సముదాయించుకుంటున్నట్లు చైతన్య వేపు తీక్షణంగా చూసి చీర కుచ్చిళ్లు సర్దుకుంది.

"నాకేం ఫర్వాలేదు గానీ... అట్లా కూర్చోండి!"

"రాత్రి చాలా పొద్దు పోయింది. మీకిక ఏం ఫర్వాలేదు. నేను వెళ్తాను" చైతన్య అనవసరంగా చేతి గడియారం వంక చూసుకుని ఇబ్బందిగా మొహం పెట్టాడు.

"అంత అవసరంగా పోవాలా? అహఁ...... నా ఉద్దేశం ఏమిటంటే ..." సంధ్య క్షణకాలం కళ్ళు మూసుకుంది.

ఈ క్షణ కాలంలోనూ సంధ్యనే తదేకంగా చూస్తున్న చైతన్య అచేతనావస్థలోకి, చీకటి గుహ్వారంలోకి పోయినట్లయి నిశ్శబ్దంగా ఊరుకున్నాడు.

"మీ గురించి ఎదురుచూసేవాళ్ళుంటే అట్లాగే వెళ్ళండి! ఏమంటారు ?" సంధ్య నిర్లిప్తంగా పైన నెమ్మదిగా కదులుతున్న ఫాను వంక చూస్తూ అంది.

ఏమిటి ఈవిడ ఉద్దేశం? తన గురించి ఎదురు చూసే వాళ్ళెవరూ లేకపోతే మాత్రం తాను ఎంతకాలం ఇక్కడ ఉండాలి? అయినా 'ఇపుడు' తనవసరం ఏముంది గనక? తాను చేయవలసిన ట్రీట్‌మెంటు చేశాడుగద! ఏ డాక్టరయినా ప్రస్తుతం ఇంతకన్నా ఎక్కువగా చేసేదేముంటుంది గనక ?

"ఎవరో ఎదురు చూస్తుంటారని కాదు. ఇహనిక్కడ నేనుండాల్సిన అవసరం లేదుగదాని!"

"అంటే...?అవసరం ఉంటే ఎంతసేపయినా ఉంటారుగదా!" సంధ్య కండ్లు చక్రాల్లా తిప్పి చైతన్యనే చూస్తూ అంది.

చైతన్య ఉక్కిరి బిక్కిరయ్యాడు.

"ఆహా! అలా ఎందుకనుకోవాలి! పేషంటుకు బాగోలేనపుడు ఉండక తప్పదుగదా?"

"మరింకేం! ఇప్పుడిక్కడ పేషంటుకు బాగోలేదు. పూర్తిగా స్వస్థత చిక్కాలి గదా! మరి ఆ పైన మీ ఇష్టం. వెళ్ళిపోతానంటే నా అభ్యంతరం ఏమీలేదు. అదుగో ఆ బీరువా తలుపు లాగండి! లోపల ఎర్ర పెట్టెలో డబ్బుంది. అందులోంచి మీ ఫీజు తీసుకుని మీరు వెళ్ళిపోవచ్చు!!"

సంధ్య ఈ మాటలని గోడవేపు తిరి

గింది. ఆ మెత్తని డన్‌లప్ పిల్లో చాటున సంధ్య పెదిమలు కొంటెగా నవ్విన సంగతి చైతన్యకు తెలియదు. ఆ సమయంలో సంధ్య కళ్ళతో, మెదడుతో. రక్తనాళాలతో కూడా చైతన్యనే గమనిస్తున్నదనే విషయం అసలే తెలియదు.

చైతన్య ఆలోచిస్తూ నిలబడిపోయాడు.

గదిలో నియోన్‌లైటు పాలవెన్నెలను కురిపిస్తూనే ఉంది. హాల్లోని గడియారం 'టిక్కు టిక్కు'మని కాలాన్ని వెనక్కినెడుతూ ముందుకు పరుగెడుతూనే ఉంది.

చైతన్య సోఫాలో కూలబడ్డాడు. నుదుటికి పట్టిన చెమట తుడుచుకున్నాడు. పైన తిరుగుతున్న ఫాన్ చైతన్యను జాలిగా చూసింది.

సంధ్య దిండులోంచే సన్నగా నవ్వుకుంది. ఆ పైన కొంటెగా నవ్వుకుంది.

"తీసుకున్నారా ?" కదలకుండానే ప్రశ్నించింది.

"ఏమిటి?" చైతన్య తడబడ్డాడు.

"మీ ఫీజు!"

"ఫీజు సంగతలా వదిలేయండి! మిమ్మల్ని ఒకటి రెండు ప్రశ్నలడుగుతాను. దయచేసి వాటికి సమాధానాలు చెప్పండి!"

"అంటే...మీరడిగిన వాటికి సమాధానాలు చెబితే మీ ఫీజు వదిలేస్తామంటారు!"

సంధ్య గోడ వేపునుండి చైతన్య వేపు తిరిగింది. చైతన్య మొహం పక్కకు తిప్పుకుని తోటలోని చీకట్లను కిటికీలో నుంచి చూస్తూనే అన్నాడు –

"అసలు మీరు ఫీజిస్తారని నేవిక్కడికి వస్తేగదా!"

"మరి...?"

"డబ్బు సంగతి వదిలేయండి! 'హిపోక్రాట్' అని మాకో గురువుగారుండేవారు. ఆయన మా వృత్తిని గురించి ఎన్నో విషయాలు చెప్పాడు. ప్రతి డాక్టరూ తప్పకుండా ఆచరించి తీరాల్సినవవి..."

"అట్లాగా! మరి పేషంటు చావు బ్రతుకుల్లో ఉన్నా వదిలి వెళ్ళిపోవాల్సిందేనని మీ గురు గారు చెప్పారా?"

చైతన్య బిక్క చచ్చిపోయాడు. తను మాటల్ని ఎంత జాగ్రత్తగా తూచి తూచి వాడుతున్నా ఎక్కడో ఓ చోట చిన్న గండి ఏర్పడుతోంది. ఓ క్షణం ఆలోచించి అన్నాడు–

"చావు బ్రతుకుల సమస్య వచ్చింది కాబట్టి చెబుతున్నాను. మా గురువుగారు ఆత్మహత్య చేసుకునేవారిని కాపలా కాస్తూ ఉండమని చెప్పలేదు !"

ఈ మాటలు చైతన్య కసికొద్దీ అనలేదు. సంధ్యని నొప్పించాలనే ఉద్దేశంతోనూ అనలేదు.

అయినా సంధ్య దెబ్బతిన్న పావురంలా చూసింది. ఆ చూపులో ఓ క్షణం..వేటగాడి వాడి ములుకు రొమ్ములో దిగబడినపుడు అడవి పావురం చూసే చూపు కనిపించింది. మరుక్షణం ఆ బాధనంతటినీ మింగేస్తూ పురివిప్పి రాజసంగా నాట్యంచేసే మయూరంలోని హుందాతనం కనుపించింది.

"అవుననుకోండి ! ఈ విషయం తర్వాత చర్చిద్దాంగానీ మీ 'గురువుగారు' మీకేం ఉపదేశాలు చేశారో చెప్పారు కాదు!"

"నా రోగులు పేదవాళ్ళయిందీ, ధనికులయిందీ పట్టించుకోవద్దన్నాడు"

"ఆహా! అంటే నేను పేదదాన్నయినా మీరు పరిగెత్తుకుని వచ్చేవారన్నమాట !"





"ఆఁ అంతేగదా! ఇక రోగుల రహస్యాలను ఎక్కడా వెల్లడి చేయగూడదని గురువుగారి ఆదేశం!"

"ఓహో! అయితే నా రహస్యాలన్నింటినీ మీ గుండెలో పదిలంగా కాపాడతారన్న మాట!"

పిల్లసెలయేరు నదిలో కలవాలని తాక్కే పరవళ్ళని సంధ్య కళ్ళల్లో ఓ క్షణం చూశాడు చైతన్య.

"చెప్పండి మరి మీ రహస్యాలేమిటో?"

"రహస్యాలా!?"

"ఏమీ లేకపోతే నా బాధను కొంత తగ్గించిన వారవుతారు. నా ఫీజును నేను భేషరతుగా వదిలేస్తానుగానీ ముందు ఒకటి రెండు ప్రశ్నలకు జవాబు చెప్పండి"

"అడగండి ఏమిటో ?" సంధ్య కవ్విస్తూ అంది.

చైతన్య క్షణకాలం ఎట్లా అడగాలా అని సంకోచపడ్డాడు.

"ఏమీలేదు. నేను మీకెట్లా తెలుసు?"

సంధ్య గడుసుగా నవ్వింది. గోచ వంక అస్తమిస్తున్న సూర్యుణ్ని చూసి ఎగతాళి చేస్తున్నట్లు గోముగా, గడుసుగా నవ్వింది!

"పార్సీలో ఓ సామెత ఉంది తెలుసా?"

"ఏమిటది ?"

"నాకు పార్సీ సరిగా రాదుగానీ, దాని భావం మాత్రం చెబుతాను. ఏమిటంటే..." సంధ్య క్షణకాలం ఆలోచించింది. అట్లా ఆలోచిస్తున్నప్పుడు ఆమె కనుబొమ్మలు ముడివడ్డాయి.

"పూజారి గుడికి రావాలి! లేకపోతే గుడే పూజారి కోసం పూజారి దగ్గరకు రావాలి. అంతే! తెలుగులో ఇంతకన్నా బాగా చెప్పలేను!"

చైతన్య నెమ్మదిగా లేచి నిలబడ్డాడు. కిటికీలోనుండి బయట చీకట్లో కనిపించకుండా సువాసనల్ని వెదజల్లుతున్న గులాబీ పొదల ఒడిలోని గులాబీల వంక చీకట్లోకి చూస్తూ నుంచున్నాడు.

"దీన్ని గురించి మీరు ఏదో దూరంగా ఆలోచించాల్సిన పనిలేదు! మీ గురువుగారు చెప్పినట్లు డాక్టర్లు పేషంట్లను వెదుక్కుంటూ రాకపోయినా, పేషంట్లయినా డాక్టర్లను వెదుక్కుంటూ రావాలిగదా అనే నా ఉద్దేశం!"

"అయితే నేనెట్లా మీకు తెలుసు ?"

"ఎట్లా ఏమిటి? మీ డిస్పెన్సరీముందు మీ నేమ్‌ప్లేట్ లేదూ? ఈ నెలరోజుల నుండీ లేడీస్ క్లబ్బుకు పోతున్నప్పుడల్లా దాన్ని చూస్తూనే ఉన్నాను."

"అదేనండీ నేనడిగేదీ! నాలాంటి లెర్నర్, బిగినర్ పెద్దగా అనుభవంలేని డాక్టర్ మీ కెందుకు కావలసి వచ్చిందీ అని ?"

సంధ్య ఓ వేడినిట్టూర్పు వదిలింది.

"సముద్రంలో...సారీ సింబాలిక్‌గా అంటున్నాను. నొచ్చుకుని నాతో యుద్ధం చేయకండి! సముద్రంలో మునిగేవానికి గడ్డిపోచే ఆధారం !"

చైతన్య చికాగ్గా చూశాడు.

"ఆహాఁ మిమ్మల్ని గడ్డిపోచతో పోలుస్తున్నానని మీరనుకోవద్దని ముందే చెప్పాను !"

తను మాట్లాడవలసింది కూడా అవిడే మాట్లాడుతోంది !

"అంటే...ఈ గడ్డిపోచతో మీరు సముద్రాన్ని ఈదగల రన్నమాట!"

చైతన్య సిగరెట్ వెలిగించి అగ్గిపుల్ల బయట చీకట్లోకి విసురుతూ అన్నాడు.

"ముందు మీరు గడ్డిపోచని తేలాలి

గదా!" పావురాలు రెక్కలు టపటప లాడిస్తూ ఎగిరిపోతున్నట్లు నవ్వింది ఆమె.

"కూర్చోండి. మీరు లాయర్లు కాదు. ఎంత సేపని అట్లా నుంచుని చేతకానిదాన్ని నన్ను 'క్రాస్ ఎగ్జామిన్' చేస్తారు?"

చైతన్య సిగ్గుపడుతూ కూర్చున్నాడు.

"మీకు భోజనానికి వేళయిందికదూ ?"

"అబ్బెబ్బే!"

"సరేలెండి. కానీ మీరడగవలసిన అసలు ప్రశ్న అట్లాగే మిగిలిపోయింది !"

"ఏమిటది ?" చైతన్య కుతూహలంగా అన్నాడు.

"అంటే... ఈ ట్రాంక్విలైజర్స్... ఈ నిద్ర మాత్రలు నేను మింగవలసిన అవసరం ఎందుకు ఎప్పటినుండి కలిగిందీ అని !"

"అవునవును. అడగాలనుకుంటూనే మీ మాటల్లో పడి మరచిపోయాను" మీ అన్న దగ్గర నొక్కుతూ అన్నాడు చైతన్య.

"పోనీండి. ఇంకోరోజు చెబుతాను!"

సంధ్య బలహీనంగా నవ్వి చైతన్య వారిస్తున్నా వినకుండా లేచి మంచంమీద



కూర్చుంది. సంధ్యని చైతన్య రెప్పవాల్చకుండా చూస్తున్నాడు. అలసటతో నీరసించిన మొహంలో ముడుచుకుపోతున్న కలువలు కనిపించాయి! నీరసించిన ఆ పెదిమల మధ్యనే దరహాసం రాలిపోతున్న గులాబీ రేకులను గుప్త చేస్తోంది.

"సారీ మీ కోసం ఎదురు చూసే వాళ్ళని నిరాశ పరచడం బాగోలేదు. పోయిరండి. డ్రైవర్...వాణ్ని పిలవండి.. కార్లో మిమ్మల్ని డ్రాప్ చేస్తాడు"

"నో...నో...టాక్సీలో పోగలను... మీకు విశ్రాంతి..."

"ఇంతసేపూ నేను తీసుకున్నది విశ్రాంతి కదూ? మళ్ళా నేను విశ్రాంతి తీసుకోవాలనుకుంటే మీరు మళ్ళీ నాకు వైద్యం చేయాల్సి వస్తుంది. సో.. పోయి రండి.. గుడ్‌నైట్!"

సంధ్య వెనక్కి బెడ్ మీదికి ఒరిగింది. చైతన్య ఓ సారి సంధ్య మొహంలోకి.. అలసటగా మూసుకుంటున్న ఆవిడ కళ్ళ లోకి చూసి వెనక్కి తిరిగాడు.

గేటు దగ్గరకు రాగానే కారు వచ్చి పక్కన ఆగింది. చైతన్య మాట్లాడకుండా ఎక్కి కూర్చున్నాడు!




కమల తలుపు తీసింది.

ఇంటిముందు ఆగివున్న కారువంక ఆశ్చర్యంగా..దానిలో నుండి దిగుతున్న చైతన్య వంక ప్రశ్నార్థకంగా చూసింది!

కమల తెల్లగా.. సన్నగా...సలాకులా ఉంది. కోలమొహంలో అందంగా అమరిన ముక్కు, భావాలు చక చక పలికే విశాలమైన కళ్ళూ, ధనవంతుల బిడ్డ అనేమో దర్పాన్నీ ఆధిక్యతనీ, సూచించే పెదిమల చివర్లూ! కమల తన అంతస్తును - అంటే తన తల్లి తండ్రుల కుటుంబ అంతస్తును దృష్టిలో ఉంచుకునే పెదిమలను విప్పుతుంది! విప్పి ఒకటి రెండు మాటలు మాట్లాడుతుంది. అట్లా కాని సమయాల్లో విశాలమైన తన కళ్ళనూ, పెదిమల చివర్లనూ చక చక కదిలించి, తాను నోటితో చెప్పవలసిన విషయాన్ని చూపుల్లో.. ముఖ కవళికల్లో వ్యక్తం చేస్తుంది!

"డియర్! నీ మొహంలో భావాలు ఎంత వేగంగా కదలి మాటలు పలుకుతాయంటే ... కొద్దిపాటి ప్రయత్నంతో నీవు చాలా మంచి నటివి కాగలవు!" అని ఓ సారి అన్నపుడు కమల కళ్ళెత్తి చైతన్యకేసి ఓ సారి తీవ్రంగా చూసింది.

ఆ చూపులో.."ఇలాంటి లేకి మాటలూ, చిల్లర మాటలూ నా దగ్గర మాట్లాడే ముందు ఒకటికి రెండు సార్లు ఆలోచించుకోవాలి! సినిమాల్లో నటించాల్సిన ఖర్మ నాకేమిటి?'' అన్న భావాన్ని, పబ్లిక్ స్కూల్ కుర్రాడు ఏ. బి. సి. డి. లను చదివినంత తేలిగ్గా చదివి చైతన్య బిక్కచచ్చిపోయాడు.

చైతన్య ఫైనలియర్‌లో ఉండగా తండ్రి బ్రెయిన్ హెమరేజ్‌తో వారం రోజులు తీసుకుని పోయాడు. ఆయన పోతూ పోతూ చైతన్య మెడిసిన్ చదువుకు అంతదాకా అయిన ఖర్చు తాలూకు




ప్రామిసరీ నోట్లనూ, ఉన్న ఆస్తిని తెలిపే లెక్కలనూ.. కూడికలూ తీసివేతలూ చేసి 'బ్యాలన్స్ షీట్' చేతికిచ్చి పోయాడు. ఆ బ్యాలన్స్ షీట్ చూసి చైతన్య నివ్వెర పోయాడు! దాన్లో శూన్యం తప్ప మరేం లేదు.

అపుడు ఆదుకున్నాడు కమల తండ్రి వెంకటపతిగారు. కావడానికి దూరపు బంధువులే అయినా ఆ బంధుత్వం ఏ నాడూ చర్చకు రాకుండా వారి మేడా.. యాభై ఎకరాల కమతం ట్రాక్టరూ, అంతస్తూ అడ్డు పడ్డాయి! వెంకటపతి గారు చాలా దూరదృష్టి గల మనిషి! ఆ అలవాటు ఆయన తాత ముత్తాతల నుండీ వస్తోంది కాబట్టి ఆస్తి తరక్కుండా పెరిగి పోతోంది.

ఇంటర్మీడియట్ తో చదువు చాలించి ఇంట్లో ఉన్న అమ్మాయికి ఏ డాక్టర్నో తెచ్చి ముడి పెట్టాలంటే ఒక లక్షకు తక్కువ కాదు. అయినా తానెట్లాగూ డాక్టరు కన్నా ఓ మెట్టు పైనున్న వాడ్నే ఎంచుకొంటాడు గానీ.. అంతకు క్రిందికి తొంగి చూడను గాక చూడడు!

ఈ అదనులో చైతన్య వెంకటపతి గారికి చాలా మంచి పెట్టుబడిలా కనిచాడు. ఈ ఒక్క సంవత్సరం కండ్లు మూసుకొని నెలకింత అని ఖర్చు చేస్తే లక్ష రూపాయల బెడదలేకుండా డాక్టరు తనల్లుడౌతాడు! చైతన్య చూడ్డాని క్కూడా బాపుంటాడు. ఎందుకయినా మంచిదని కూతుర్ని కదిపి చూశాడు!

"అమ్మాయ్! చైతన్య ఎట్లా ఉంటాడు?"

"బాగానే ఉంటాడుగా!"

"అహ...నీ దృష్టిలో విషయం చెప్పు!" వెంకటపతి అసలు విషయాన్ని బయట పెట్టాడు.

"నాకలాంటి పట్టింపులేం లేవు! మన అంతస్థుకు సరి తూగుతాడని మీరను కుంటే ఏం ఫర్వాలేదు!" కమల సన్నగా నవ్వింది.

వెంటనే వెంకటపతిగారు చైతన్యను కదిపి చూశాడు. ఆ సమయానికి బేలగా దిక్కులు చూస్తున్న చైతన్య తన అవసరానికి ఆదుకునే ఆత్మీయులు ఎవరేనా దొరికితే జీవితాంతం ఋణపడిపోవడానికి తయారుగా ఉన్నాడు.

వెంకటపతిగారి ఓదార్పు మాటలకు చైతన్య కన్నీళ్ళు కార్చాడు. వెంకటపతి గారు ధైర్యం చెప్పారు. చదువు కుంటు పడకుండా తానున్నానని హామీ ఇచ్చారు.

"చూడబ్బాయ్! నువ్వు నాకు నచ్చావు. అందులోనూ మనం దగ్గిర బంధువులం కూడా! నా కున్నది ఒక్కర్తే కూతురు. ఉన్న ఒక్క అబ్బాయి చదువుకుంటు న్నాడు. కాబట్టి నీ చదువు పూర్తికాగానే అమ్మాయినిచ్చి పెళ్ళిచేసి నా బరువు దింపుకుంటాను! మన దగ్గర డబ్బుకేం లోటులేదు. కనుక హాయిగా మీరిద్దరూ చిలకా గోరింకల్లా జీవించవచ్చు"

చైతన్యకు అంతకుముందు నుండే వెంకటపతిగారు దైవ సమానంగా కనిపిస్తున్నారు. ఇపుడు ఇక వారి దేవతను చేసుకోవడానికి అభ్యంతరం ఏమీ లేదు గానీ తనకంత అర్హత ఉందా అని మాత్రం తల్లడిల్లి పోయాడు!

అనుభవజ్ఞుడు గనక వెంకటపతిగారు చైతన్య ముందు కాళ్ళకు తెలివిగా బంధం వేశాడు!

"చూడు నాయనా! నువ్వు ఆలోచనా పరుడివి. వివేక వంతుడివి. నీకు తెలీని



విషయం ఏముంది చెప్పు! అమ్మాయి కావాలని నిన్నే ఇష్టపడింది కాబట్టి నేనింతగా ప్రాధేయ పడుతున్నాను. లేకపోతే నాకు కొదవేమిటి! అందుకని ఒక విషయం గుర్తుంచుకో బాబు ... నీ భావి జీవితంలో రెండు ఆలోచనలను నీ దగ్గరకు రానివ్వకు. ఒకటేమిటంటే నేను నీకు ఆపదలో సహాయం చేసినందుకు ప్రతిఫలంగా నువ్వు కమలను కట్టుకున్నావనేది! అది చాలా ప్రమాదకరమైంది. ఇక రెండోది. నువు కమలకు కృతజ్ఞుడుగా ఉండాలన్న ఆలోచన రాకూడదు! అర్థమయిందా?"

ఈ రెండో ఆలోచన గురించి ప్రస్తావించటం వెంకటపతిగారికి ఇష్టం లేకున్నా మొదటిదానికి తోడుగా ఉంటుందని చెప్పాడు.

అట్లా జరిగిపోయింది కమలతో చైతన్య వివాహం!

* * *

కారు దిగి చైతన్య గుమ్మంలోకి వచ్చాడు.

కారు వెళ్ళిపోయింది.

కమల చూపుల్ని తప్పించుకుంటూ లోపలికి పోయాడు.

కమల కళ్ళలో 'ఎవరిదా కారు?' అన్న ప్రశ్నను చదివి చికాకుపడ్డాడు.

"బట్టలు విప్పి హేంగరుకు తగిలించి వాలు కుర్చీలో కూలబడ్డాడు.

"చాలా రాత్రయింది! భోజనం చేద్దురుగాని రండి!"

"అంత ఆకలిగా లేదు. సరే గానీ నువ్వు తినేయలేక పోయావ్?"

చైతన్య మాటలకు కమల చిన్నగా నవ్వి ఊరుకుంది!

ఆ నవ్వులో 'నేను మీ కోసం ఓ గంట ఎదురుచూసి తినేశాను. మీ కాకలి కానంత మాత్రాన నాకూ కాదని ఎక్కడా రూలు లేదు!' అన్న భావం కనిపించి చైతన్య తృప్తిగా నిట్టూర్చాడు.

కమల పక్క సర్దింది.

చైతన్య మౌనంగా భోజనం ముగించి సిగరెట్ కాలుస్తూ కూర్చున్నాడు.

"లైటు ఆర్పేదా?"

చైతన్య సమాధానానికి ఎదురు చూడకుండా కమల స్విచ్ ఆఫ్ చేసింది.

చైతన్య కాలుస్తున్న సిగరెట్టు ఆ చీకటిలో ఆ చిన్న బెడ్‌లైటు వెలుతురులో ఒంటి కంటి రాక్షసుడి నిప్పులు చెరిగే కన్నులా మిల మిల మెరుస్తోంది!




"రాత్రి ఎవరి కారులో వచ్చారు?"

బూటు లేసు కట్టుకుంటున్న చైతన్య కమలవేపు చూశాడు.

కమల మామూలుగానే అడిగింది!

"ఓ పేషంటుంది!"

విప్పారిన కమల కండ్లు చక్రాల్లా తిరిగాయి.

'అంత ఖరీదైన పేషంట్లు కూడా మీ కున్నారన్నమాట!' అన్న భావం తళుక్కుమని మెరిసింది ఆ చూపుల్లో.

అది గమనించిన చైతన్య చికాకు

పడ్డాడు. అయినా తన చికాకు లోపల అణుచుకుని నెమ్మదిగా అన్నాడు.

"సంధ్య అనే ... ఓ డ్రగ్ ఎడిక్ట్ కమలా ... ఆడవాళ్ళు ఈ మాదక ద్రవ్యాలకు ఎలా అలవాటు పడతారో గదా!"

"ఏమో...మీరు డాక్టర్లు, మీకే తెల వాలి!"

"ఈ వ్యాధి మామూలు వ్యాధి కాదు కోరి కొనుక్కొని తెచ్చుకున్న వ్యాధి! అట్లా ఎందుకు కొనుక్కుంటారూ-అని నా సందేహం!"

"అందులో ప్రత్యేకించి ఆడాళ్ళనే ఎందుకు కనుకోవాలి? ఎంతమంది మగాళ్ళు అట్లా కొనుక్కోవడం లేదు!?"

ఖాళీ కాఫీ కప్పు అందుకుని కమల వంటింట్లోకి పోబోయింది. చైతన్య ఒక్క ఉదటున లేచి, కమల చేయందుకుని దగ్గరగా లాక్కున్నాడు.

కమల ఎర్రని పెదిమలు క్షణకాలం కంపించాయి! కమల మాట్లాడేది ఒకటి రెండు మాటలే అయినా అవి ఎపుడూ లోతైన అర్థాలతో నిండి ఉంటాయి. అట్లా మాట్లాడిన ప్పుడల్లా చైతన్య ఆశ్చర్యపోతాడు.

"వదలండి! అవతల వంటపనంతా అట్లాగే మిగిలుంది. మీరు హాస్పిటల్‌కు పోయేటైమవుతోంది!"

సన్నని శంఖం వంటి కమల మెడ వంక చూస్తూ చైతన్య అట్లాగే నిల బడ్డాడు. కమల మొహంలోకి ఓసారి చూసి తలదించు కున్నాడు.

"నిన్న బాగా అలసిపోయాను.. ఆవి దను తిరిగి మామూలు మనిషిని చేయ డానికి మూడు గంటలు పట్టింది!"

కమలను వదిలి చైతన్య వరండాలోకి వచ్చాడు.

కమల చిన్నగా నవ్వుకుని వంటింట్లోకి పోయింది!




"దగ్గు.. దగ్గు.. ఒకటే దగ్గు బాబా!" ముసిలాడు ఆరాట పడిపోతున్నాడు.

"నిన్నటి మందులు తెచ్చావా?"

"ఆఁ!"

"వాడావా?"

"ఆఁ... మీరు ఒకటే మింగమంటే రెండేసి కూడా మింగాను డాక్టరు బాబా!"

చైతన్య విసుక్కున్నాడు. "ఇదుగో చూడూ.. ఈ మాత్రలు కొనుక్కుని పూటకు నాలుగు చొప్పున.. మూడు పూటలేసుకో.. తగ్గిపోతుంది!"

"తగ్గకపోతే ఎనిమిదేసుకునేదా?"

"వద్దు!"

"ఏం?"

"అట్లా అయితే దగ్గు బాగా ఎక్కువై పోతుంది! నీ ఇష్టం!!"

ముసిలివాడు గొణుక్కుంటూ లేచి బయటకు వెళ్ళిపోయాడు!

ఇన్ని మందులు వస్తున్నా కొన్ని రోగాలు ఇంకా కొరకరాని కొయ్యల్లాగే ఉండి పోతున్నాయి! బాధ పెట్టి పెట్టి గాని వదలడం లేదు. రోగ లక్షణాలు కూడా ఒకదాన్ని మించి ఇంకోటి

అయోమయం అయిపోతున్నాయి?

దాదాపు పేషంట్లందరూ వెళ్ళిపోయారు!

మధ్యాహ్నం ఒంటి గంటయింది. బయట ఎండ మాడ్చేస్తోంది. హాస్పిటల్ కట్టేయాలి. భోజనానికి వేళవుతోంది. లేచి బయటకు అడుగుపెట్టబోయేంతలో కారు వచ్చి హాస్పిటల్ ముందాగింది.

చైతన్య దిగాలు పడ్డాడు.

ఆవిడ తిరిగి నిద్రమాత్రలు మింగింది కాబోలు! మింగదలుచుకున్నవేవో ఓ నాలుగు ఎక్కువే వేసుకుంటే కోరిక తీరిపోతుంది గదా! పోనీ మింగిన మనిషి తన మానాన తాను పడుకుని చావక మళ్ళీ డాక్టరు కోసం వెంపర్లాట ఎందుకూ?

"పద!"

ఛెస్ట్ తీసుకుని కార్లో కూర్చున్నాడు చైతన్య. కారు ఎండలో తారురోడ్డు మీద దూసుకుపోతూంది!

"మళ్ళీ ఎన్ని మింగిందేమిటి ?"

డ్రైవరు తల తిప్పి చైతన్య వంక చిత్రంగా చూసి తిరిగి కారు నడపడంలో మునిగిపోయాడు!

డబ్బు లేకపోవడం ఒక సమస్యే! అయితే అవసరాన్ని మించిన డబ్బుండడం కూడా సమస్యే! ఇది ఒక సమస్యకాదు. వందల సమస్యల పెట్టె! అవీ కోరి తెచ్చుకునేవి.

కారు బంగళా ముందాగింది.

చైతన్య చెమట తుడుచుకుంటూ, తోటను దాటి లోపలి గదిలోకి అడుగు పెట్టాడు.

సంధ్యను చూసి అవాక్కయిపోయాడు.

బెడ్‌మీద పడుకుని సగం మూసిన నిషా కళ్ళలో నీరసంగా...నిశ్శబ్దంగా... పెదిమలను శబ్దం లేకుండా కదుపుతూ ఉంటుందనుకున్న సంధ్య సోఫాలో వెనక్కి తిరిగి కాలాడిస్తూ గలగల మాట్లాడుతోంది.

తలంటు పోసుకుని ఇంకా జడవేసుకోలేదేమో...వెంట్రుకలు గాలికి చిందర వందరగా నాట్యం చేస్తున్నాయి.

గులాబీరంగు పట్టుచీర మీద అదే రంగు స్లీవ్‌లెస్ జాకెట్టు వేసుకుంది.

పొడవైన ముత్యాలహారం మెడలో అటూ ఇటూ ఊగిసలాడుతోంది. దాని చివర్లోని లాకెట్‌లో పొదిగిన రాళ్ళు అది కదిలినప్పుడల్లా 'తళుక్'మని మెరిసిపోతున్నాయి!

"రండి" చైతన్యను సాదరంగా ఆహ్వానించింది.

ప్రకాశవంతంగా వెలిగిపోతున్న ఆమె మొహంలోకి చూసి చైతన్య తల పక్కకు తిప్పుకున్నాడు. ఆవిడ నుదుటి మీద కుంకుమ లేదు...పాపిట్లోనూ లేదు!!

"నేను చాలా భయపడ్డాను!"

"ఎందుకు ?"

"తిరిగి మీరు టాబ్లెట్లు వేసుకున్నారేమోనని !"

"ఊహుఁ... నేను వేసుకుంటే మీకు భయమెందుకు ?" సంధ్య కవ్వింపుగా అంది. ఆ మాటలు గంజాయి మత్తులా నరాల్ని పట్టి కూర్చోబెట్టే మత్తుకాదు. మొగలి పూల నుండి రాలుతున్న పుప్పొడిని పీల్చినపుడు కలిగే మత్తు అది!

చైతన్య ఉక్కిరిబిక్కిరయ్యాడు.

"ఎందుకేమిటి ? 'రిస్క్' తీసుకుని ట్రీట్‌మెంటు చేయాలి గదా !"

"అబద్ధం...మీకు అబద్ధం ఆడడం కూడా సరిగా చాతకాదు మీరు డాక్టర్లు గదా... డాక్టర్లూ, లాయర్లూ ఎపుడూ





తమ ఖరీదైన పేషంట్లు, క్లయింట్లూ.. అట్లాగే ఉండాలని కోరుతుంటారు! మీరెన్ని సార్లు విజిట్ చేస్తే అన్నిసార్లు మీకు ఫీజు ముడుతుంది గదా!''

చైతన్య కొద్ది సేపు ఏమీ మాట్లాడ లేకపోయాడు!

ఎదురుగా టీపాయ్ మీద కాళ్ళుమడత వేసుకుని తన వంకే గుండ్రని చక్రాల్లాంటి కళ్ళని కలయదిప్పుతూ చూస్తున్న బేబీని చూస్తూ కూర్చున్నాడు.

'నేనేం ఫీజు కోసం రావడం లేదు' అని అందామనుకుని అనలేక ఊరుకున్నాడు. చైతన్య అంతరాంతరాల్లో సిగ్గనిపించింది. ఆ మాట తనంటే ఎంత వికారంగా ఉండేది? అంతే - తాను ఫీజు కోసం కాకుండా ఇక్కడికి మరెందు కోసం వస్తున్నట్లు? ఎంత లజ్జాకరమైన మాటది?

"సరేగాని ఈ బొమ్మెవరు?''

''నేను 'బొమ్మ'ను కాను అంకుల్!' పాప బుంగ మూతి పెట్టింది.

''మిమ్మల్ని ఎందుకు పిలిపించానను కున్నారు?"

చైతన్య తల విదిలించాడు.

"ఇవాళ మీరిక్కడే భోజనం చేయాలి! డాలీ డార్లింగ్! అవ్వతో వడ్డించమని చెప్పు!"

డాలీ ఛంగున క్రిందికి గెంతి లోపలకు పరుగెత్తింది. సంధ్య పోతున్న డాలీ వంక రెప్ప వేయకుండా చూస్తూ కూర్చుంది. అంత గాలిలోనూ చైతన్య గాలి లేనట్లు ఉక్కిరి బిక్కిరయ్యాడు"

"డాలీ నా ప్రాణం! షీ ఈజ్ మై బ్లడ్! బట్... సంధ్య ఆగింది. చైతన్య వింటూ కూర్చున్నాడు.

"దానికి అన్నీ ఉన్నా ఏమీ ఇవ్వలేక పోతున్నాను. ఇప్పుడదో అనాథ. డబ్బుతో జీవితంలో అన్నీ కొనుక్కోలేం. కొంత కాలం క్రిందటి వరకూ నేను ప్రేమను కూడా డబ్బుతో కొనుక్కోవచ్చు అనుకునే దాన్ని. కానీ అనుభవం అది తప్పని రుజువు చేసింది. ఎందుకంటే ప్రేమ మనసుకి సంబంధించింది. ముందు కొంత కాలం తాత్కాలికంగా ఆత్మవంచన చేసుకుని సుఖపడుదామనుకున్నా తర్వాత అదంతా ఉత్త 'భ్రమ' అని తప్పక తెలుసుకోగలరు! డబ్బు తాత్కాలికంగా ఆప్యాయతలనూ, ఆహ్లాదకరమైన వాతావరణాన్ని సృష్టించవచ్చు. కాని అది గుండెలలోకి చొచ్చుకుని పోలేదు. సరే పదండి!"

"ఇప్పుడా! ?"

"అదేమిటి? ఇది భోజనానికివేళ కదా! అందులోనూ ప్రత్యేకంగా ఇవ్వాళ మిమ్మల్ని అతిథిగా ఆహ్వానించాను"

చైతన్య మారు మాట్లాడకుండా సంధ్య వెంట డైనింగ్ హాల్లోకి నడిచాడు.

"కూర్చోండి"

చాలా ప్రత్యేకంగా చేసిన వంటకాలతో భోజనం పూర్తయింది. మధ్యలో చైతన్య ఏమీ మాట్లాడలేదు. సంధ్య డాలీతో కబుర్లు చెబుతూ కూర్చుంది.

"డాలీ డార్లింగ్! ఆయా కబుర్లు, కథలు చెబుతుంది వింటూ పడుకో"

"యస్ మమ్మీ"

ఆయా డాలీని తీసుకుని వెళ్ళిపోయింది. చైతన్య డ్రాయింగ్ రూంలో కూర్చుని సిగరెట్ వెలిగించాడు.

"నిన్న ఏమేమో అడిగారు. నాకు మతి సరిగా లేక సమాధానాలు చెప్ప లేకపోయాను!"



సంధ్య క్షమార్పణ కోరుతున్నట్లుగా అంది.

చైతన్య ఆవిద వంక జాలిగా చూశాడు. సంధ్య డ్రగ్ ఎడిక్ట్! అలాంటి వాళ్ళమీద తనకేం సానుభూతి లేదు. పొరపాటున ఒళ్ళుకాలిన వాళ్ళనూ కాళ్ళు చీదుకుపోయిన వాళ్ళనూ తాను సహించగలడు. కుష్ఠు రోగికి పరిచర్యలు చేయమంటే చేయగలడు. కానీ తెలిసీ అల

వాట్లకు బానిసలుగా మారిన వారిని చూస్తే బాధనిపించదు. ఎందుకంటే వాళ్ళకి చాలావరకు తాము చేస్తున్న దేమిటో తమకు బాగా తెలుసు! ప్రస్తుతానికి అది వాళ్ళ స్వంత వ్యవహారం కాబట్టి ఇతరుల జోక్యం అవసరంలేదు!

కానీ... కానీ. సంధ్యను చూస్తే ఆ భావం కలగడం లేదు! దానిక్కారణం తెలుసుకుంటే ఆ భావం ఇంకా బలపడ వచ్చు!

"చెప్పండి!"

సంధ్య మాట్లాడకుండా మౌనంగా పడగ్గదిలోకి నడిచింది

"రండి"

చైతన్య సిగరెట్టార్పి మాట్లాడకుండా యాంత్రికంగా లోపలికి నడిచాడు.

"అట్లా కూర్చోండి" సోఫా చూపించింది.

చైతన్య కూర్చున్నాడు. సంధ్య పెద్ద బీరువా పిడి త్రిప్పి లోపలనుండి ఓ దంతపు భరిణె తీసింది. మౌనంగా బీరువా తలుపులు మూసి వచ్చి చైతన్య కెదురుగా కూర్చుంది. ఆ దంతపు పెట్టెను, దాని నగిషీలను దాని మూలల్లో చెక్కిన సింహాలనూ, పూలనూ అల్లిబిల్లిగా అల్లుకున్న తీగెలనూ చూస్తూ కూర్చున్నాడు చైతన్య.

"దాన్లో ఏముందో చెప్పుకోండి చూద్దాం"

సంధ్య ప్రశ్న తమాషాగాఅనిపించింది.

"ఏముంటాయి...? నగలేమో!"

"ఊహుఁ!"

"మరి..."చైతన్య ఆలోచిస్తున్నాడు. సంధ్య చూస్తూ కూర్చుంది. దానిలో తప్పకుండా విలువైన వస్తువులే ఉండాలి. అలాంటి వాటిల్లో నగలు మినహా ఇతర వస్తువులు ఏముంటాయి ?

చైతన్య తలలో మెరుపు మెరిసి నట్లయింది.

"చెప్పేదా ?"

"చెప్పండి.. చెప్పమనేకదా నేనడిగింది ?"

"మీ ప్రాణప్రదంగా ప్రేమిస్తున్న ప్రేమలేఖలు !"

సంధ్య నివ్వెరపోయి ఓ క్షణం తేరిపారజూసింది. తర్వాత గలగలనవ్వింది! అట్లా నవ్వినప్పుడు సంధ్య తల తమాషాగా వెనక్కి ముందుకీ ఊగింది ! జారిపోతున్న పమిటను కూడా లెక్కచేయకుండా నవ్వింది.

తర్వాత తన నవ్వునాపుకుని గంభీరంగా అంది ! "దాన్లో నేను సృష్టిలో అన్నిటికన్న ఎక్కువగా ద్వేషించే, అసహ్యించుకునే వస్తువుంది !"

చైతన్యకు అదేమిటో వెంటనే పెట్టె తెరిచి చూడాలనిపించింది. ముందుకు వంగి పెట్టెను అందుకోబోయాడు. సంధ్య చేయి ముందుకు చాచి వారించింది.

"అహహః.. చూద్దురుగాని. కొంచెం ఓపిక పట్టండి ! ముందు నేను చెప్పే విషయాలు విన్న తర్వాత అదేమిటో మీకే తెలిసిపోతుంది. నా ద్వేషానికి కారణం తెలుస్తుంది!"

చైతన్య ఆగాడు.

"అయితే చెప్పండి ! వినాలని నాకూ కుతూహలంగా ఉంది. అయాం సోమచ్ ఇంటరెస్టెడ్ !" వినడానికి సిద్ధపడిన వానిలా చైతన్య సోఫాలో సర్దుకుని కూర్చున్నాడు.

"నాకు ఊహ తెలియకముందే మా

అమ్మా నాన్నా పోయారు. వాళ్ళు వదిలి పెట్టి పోయిన ఆస్తి మాత్రమే నాకు మిగిలింది. ఆ చిన్న వయసులోనే నాకు తల్లిదండ్రుల ప్రేమంటే ఏమిటో తెలీకుండా పోయింది! మాకో మేనమామ వుండేవారు! ఆయనే నన్ను చేరదీశాడు. నన్ను చాలా ప్రేమగా చూసుకునేవాడు. అందులోనూ నేనొకర్తినేనాయె! వేరే తో బుట్టువులెవరూ నాకు లేరు. మామయ్యా నాకు దొరకని ప్రేమను కొంత అందించాడు. సాయంకాలంపూట కార్లో ఎక్కడికైనా షికారు తీసికెళ్ళే వాడు. లేకపోతే, లాన్‌లో కుర్చీ వేసు కుని కూర్చుని నన్ను ఒళ్ళో కూర్చోబెట్టు కుని అరేబియన్ నైట్స్ కథలు చెప్పే వాడు. ప్రొద్దుపోయి భోజనానికి లేవండని అత్తయ్యా కబురుచేసేదాకా అలా చెప్పే వాడు!

మామయ్యది భారీ విగ్రహం, గుప్పెడు మీసాలు.. బట్టతల, చెవులకు మొలిచిన వెంట్రుకలు.. చూడ్డానికి అడవిలోనుండి పులి వచ్చి ఠీవిగా కుర్చీమీద కూర్చు న్నట్లుండేవాడు! అయితే మామయ్యా నోరుతెరచి ఎవర్నీ గట్టిగా మందలించినట్లు గానీ, కోప్పడినట్లుగానీ నేనేనాడూ చూడ లేదు. నౌకర్లనూ, కౌలుదార్లనూ చాలా ఆదరంగ చూసేవాడు. ఆయన మంచి తనం, ఆప్యాయతే అన్ని అనర్థాలనూ తెచ్చిపెట్టింది!

మామయ్యకో కొడుకు! అంటే నాకు మేనబావన్నమాట. నాకన్న మూడేండ్లు పెద్ద. సుధాకర్ బావని నాకిచ్చి పెండ్లి చేస్తానని అన్నప్పుడల్లా అంత చిన్న వయసులోనే నాకు ఒళ్ళుమండి పోయేది!

నేనుమామయ్యా ఒళ్లో కూర్చున్నప్పుడు సుధాకర్ ఓసారి చేయిపట్టి నన్ను క్రిందికి లాగాలని విశ్వప్రయత్నంచేశాడు. మామయ్యా నచ్చచెబుతూనే ఉన్నాడు. అయినా పెంకిఘటం.. విన్లేదు. చివరికి అట్లా లాగడంతో నేను ఢబ్ మని ఒళ్ళోనుండి నేలమీద పడ్డాను. మోకాలు చీరుకుపోయి రక్తం వచ్చింది.. మామయ్యా గుడ్లెర్ర చేశాడు!

"ఎందుకురా దాన్నట్లా లాగావ్?"

"నా ఇష్టం! అది నీ ఒళ్లో ఎందు క్కూర్చోవాలి?" పొగరుగా సమాధానం చెప్పాడు.

"ఎందుకంటే అది నీకన్నా చిన్నది!"

"అయినా కూర్చోవద్దు. నేనూ ర్చోను!"

మామయ్యా అరిచాడు.

సుధాకర్ అత్తయ్యా దగ్గరకు పోయి ఫిర్యాదు చేశాడు.

అత్తయ్యకు బావ ఆకతాయితనం... పెంకితనం అంటే మహాముద్దు! ఆడపిల్లల జడలు లాగినా, కొట్టినా, కొరికినా ఆవిడ మహా సంబరపడి పోయేది.

"అట్లా చేయడం పురుషలక్షణం. మరి ఆడాళ్ళను మగాళ్ళేడిపించకపోతే కోతు లేడిపిస్తాయా? సంబరం" అని తన అభి ప్రాయానికి బలమైన వాదనను కూడా తోడుచేసేది. ఎవరైనా కంప్లెయింట్ చేస్తే ఉరిమి, వాళ్ళనే నాలుగు చీవాట్లు పెట్టి కయ్యానికి కాలు దువ్వేది.

బావకేమో అత్తయ్యా అట్లా ప్రవర్తిం చడంతో తాను చేస్తున్న పనులు చాలా గొప్పపనులనీ ... ఘనకార్యాలనే భావం ...ఆలోచన బలపడింది ఇంక మామయ్యా మాట వినాల్సిన అవసరం లేక పూర్తిగా అదుపుతప్పిపోయాడు!

పన్నెండేండ్ల వయసొచ్చేసరికే








చాటుగా సిగరెట్లు కాల్చడం మొదలు పెట్టాడు. ఓరోజు బత్తాయి తోటలో చెట్టుకింద కూర్చుని సిగరెట్టు కాలుస్తుంటే నేను చూశాను.

"అదేమిటి బావా ?" అమాయకంగా అడిగాను.

"సిగరెట్ !" చాలా షోగ్గా పొగ వదులుతూ సమాధానం చెప్పాడు.

"ఛా...తప్పుకదూ ?"

"తప్పా! నీ మొహం. ఇది మగవాళ్ళు తప్పనిసరిగా తాగాలి"

"ఉండు మామయ్యతో చెబుతాను!" అని ఇంట్లోకి పరిగెత్తబోయిన నన్ను జడ పట్టుకుని బలంగా వెనక్కు లాగాడు; నా తల భగ్గున మండిపోయింది.

"మామయ్యతోగానీ చెప్పావంటే కాళ్లు విరగ్గొడతాను జాగ్రత్త"

నాకు ఏడుపొచ్చి వెక్కి వెక్కి ఏడుస్తుంటే "ఫో...ఫో" అని కసిరాడు.

నేనా విషయాన్ని చాలా రోజుల వరకూ మనసులోనే ఉంచుకున్నాను. స్కూలు ఫైనల్ పూర్తి చేసేసరికి సుధాకర్ కాలేజీలో చేరాడు. మరింక షోకులకీ, వ్యసనాలకీ అంతే లేకుండా పోయింది. మామయ్య 'ఇదేమిటని' నోరు తెరిచి అనబోతే అత్తయ్య వెంటనే అడ్డు తగిలేది !

డబ్బుకేం కొదవలేదు. ప్రపంచంలో మరి డబ్బు కొనిచ్చే వ్యసనాలకేం కొదవుంటుంది గనక ! బావ పూర్తిగా మారి పోయాడు.

నేను ఉమెన్స్ కాలేజీలో ఇంటర్‌లో చేరాను. మా కాలేజీకి దగ్గర్లోనే పబ్లిక్ పార్కు దాటినతర్వాత బావా వాళ్ళ ఆర్ట్స్ కాలేజీ ఉంది! బావ నన్ను కారులో మా కాలేజీముందు 'డ్రాప్' చేసి తాను తన కాలేజీకి వెళ్ళిపోయేవాడు. కారులో వస్తున్నప్పుడు, పోతున్నప్పుడు కూడా నేనేమీ ఎక్కువగా మాట్లాడలేక పోయేదాన్ని. అసలు బావ నన్ను చాలా అరుదుగా పలకరించేవాడు. కారు డ్రైవ్ చేస్తున్నప్పుడు ఎప్పుడో ట్రాఫిక్ పోలీసు చేయి అడ్డుపెట్టినప్పుడు మాత్రం కాస్త బ్రేక్ వేసి అద్దంలోంచి నన్ను పరిశీలించేవాడు. నేనది గమనించినా ఏమీ పట్టనట్లు కిటికీలో నుండి బయటకు చూస్తూ కూర్చుండి పోయేదాన్ని.

ఇపుడు తోటలో చెట్ల కింద దొంగతనంగా సిగరెట్లు తాగాల్సిన ఖర్మ బావకేం పట్టింది. సిగరెట్ నోట్లో ఉంచుకుని దర్జాగా కారు డ్రైవ్ చేస్తూ వేగంగా పోనిచ్చేవాడు:

ఆ స్పీడుకి నేను ఒక్కోసారి భయపడేదాన్ని. ఎక్కడ ఏక్సిడెంటవుతుందోనని హడలిపోయేదాన్ని.

"కాస్త నెమ్మదిగా పోనివ్వకూడదూ?" అంటే

"ఏం ఫరవాలేదు" అని బావ చాలా నిర్లక్ష్యంగా జవాబిచ్చేవాడు.

"దేనికయినా గుద్దుకుంటుంది !"

అపుడు బావ చాలా తమాషాగా నవ్వేవాడు. ఆ నవ్వులో కొంటెతనం కన్నా కర్కశత్వం లాంటిది చాలా నిగూఢంగా నాకు కనిపించేది. అది చూసి ఒక్కోసారి నేను బెదిరిపోయేదాన్ని ! దానికి తగ్గట్టు ఆ సమాధానం కూడా అట్లాగే ఉండేదిమరి!

"ఏక్సిడెంటయితే నువ్వొక్కదానివే చావవులే"

"అంటే...?"

"నేనూ ఖసానుగా. నీకు నీ ప్రాణం మీద ఎంత తీపివుందో నాకూ అంతే ఉంది. కోరి కావాలని నా ప్రాణాలను తీసుకునేటంత మూర్ఖుణ్ని కాదులేవే మరదలా!"

ఆ మాటల్లో ఏ మూల ఎంత వెదికినా నాకు హాస్యం కనిపించేదికాదు. అయినా బావ నవ్వుతూనే ఆ మాటలని కారింకా స్పీడెక్కించే వాడు!

బావకు నేనంటే అభిమానం లేదని ఆ తర్వాత తెలిసింది. ప్రేమనేది బావకు




అసలు తెలవదని కూడా ఆ తర్వాతి సంఘటనలు ఋజువు చేశాయి. అట్లా అని బావను నేనేమీ ప్రేమించలేదు. అభిమానించనూ లేదు! బావంటే ఓ విధమైన 'భయం' ఉందిగానీ 'ద్వేషం' మటుకు ఆ రోజుల్లో లేదు.

అయితే బావకు నేనంటే ప్రేమలేక పోయినా ద్వేషం ఉందని తర్వాత తర్వాత తెలిసి చాలా ఆశ్చర్యపోయాను. ఎందుకంటే 'సుధాకర్'కు నా మీద 'ద్వేషం' ఉండాల్సిన అవసరంలేదు. నేను స్వయంగా మేనత్తకూతుర్ని. వాళ్ళమీదా, వాళ్ళ ఆస్తిమీదా పడిఉండి వాళ్ళకేం నేను గుదిబండలా తయారయిందీ లేదు. మా నాన్నగారు 'కూర్చుని' తినడానికి సరిపడా ఆస్తిని మామయ్య చేతిలో ఉంచే పోయాడు.

సరే! అదలా ఉండనిద్దాం.

కారు మా కాలేజీ ముందు ఆగగానే తలుపు తెరుచుకుని నేను దిగేదాన్ని! లోపల కాంపౌండు గోడ మీదనుండి, వరండా మెట్లమీద నుండి నా క్లాసు మేట్సు చాలా మంది చూస్తుండేవాళ్ళు. తర్వాత తర్వాత వాళ్ళు రోజూ మేమి ద్దరం కార్లో ఎపుడు వస్తామా? అని ఎదురు చూస్తున్నారన్న విషయం అర్థమయింది.

వాళ్ళలోగల కానున్న వాళ్ళని చూడాలనే ఓ వెర్రి కోరిక వల్లా, నేనెంత అదృష్టవంతురాలినో అనే ఒక ఆలోచన వల్లా, నా మీద తమకే అర్థంకాకుండా ఏర్పడిన 'అసూయ' వల్లా అట్లా చూస్తున్నారని తర్వాత తర్వాత తెలిసొచ్చింది.

నేను గేటు దగ్గరకు పోగానే కార్లో నుండి ఓ సారి బావ చెవులు చిల్లులు పడేలా హారన్ మ్రోగించి ఆ తర్వాత కారు స్టార్టు చేసేవాడు.

నాకు గేటు దగ్గిర జమున నవ్వుతూ ఎదురయి పలకరించేది.

జమున కలవారి పిల్లకాదు. ఉన్నంతలోనే చాలా పొదుపుగా, గౌరవంగా బ్రతికే కుటుంబంలో నుండి వచ్చింది. చాలా 'సింపుల్'గా అలంకరించుకునేది. దాని కళ్ళు మాత్రం చాలా ఆకర్షణీయంగా ఉండేవి. మొత్తం ఆ కాలేజీలో జమున ఒక్కర్తే నాతో చాలా స్నేహంగా ఉండేది. తన మనసులోని ఏ ఆలోచనయినా ఎట్టి సంకోచం లేకుండా నాకు చెప్పేది. నేనూ అంతే! మనసు విప్పి చాలా ఆత్మీయంగా దానికి అన్ని విషయాలు చెప్పుకునేదాన్ని! దాన్ని విడిచి కాలేజీలో ఒక్క క్షణం కూడా ఉండలేక పోయేదాన్ని.

"కాలేజీ వదిలిన తర్వాత నువ్వూ మా కార్లో రాకూడదూ ? మీ ఇంటి దగ్గిర హాయిగా డ్రాప్ చేసి వెడతాను" అంటే

"రాకూడదు" అని జమున చిన్న చిరునవ్వుతోనే త్రోసి పుచ్చేది.

"ఏం ? ఎందుకో ?"

"ఎందుకేమిటి? నేను బస్‌లోమాత్రమే తిరగ్గలిగిన దాన్ని. అది నా అంతస్థు. అలాంటి దాన్ని నీ మాట మీద కారు అలవాటు చేసుకుంటే ఆ తర్వాత ఎట్లా ?''

"ఏం ? ఏమవుతావేం ? పేద...!!"

"అదేం కాదు. రేపు నీకు...రేపేమిటి? ఇపుడే నీకు కారున్న మొగుడున్నాడు. మరి నాకు? ఏ కారూలేని క్లర్కు మొగుడయితే అపుడేం చేయమంటావ్? ఆ పేదరికాన్ని ఈ కార్లో తిరిగిన రోజులతో పోల్చుకుంటూ, ఆ బతుకునీ మొగుణ్ణీ ద్వేషిస్తూ నరకంలో బ్రతకమంటావా ?"



జమున అట్లా నవ్వుతూ మాట్లాడినా దాని మాటల్లో ఎంతో వివేకం...ముందు చూపూ...జీవితాన్ని గురించిన ఓ నిర్దిష్టమయిన ఆలోచనా ఉన్నదన్న సత్యాన్ని గ్రహించాను.

రోజులు గడుస్తున్నాయి-

మామయ్య ఇంట్లోలేడు. వెంకటాపురం పొలాలు చూడడానికీ, అక్కడేవో పంట

కాలవలు మరామత్తు చేయించే విషయం చూడడానికి పోయాడు !

నన్ను కాలేజీనుండి ఇంట్లో డ్రాప్‌చేసి కారులో ఎక్కడికో వెళ్ళిపోయాడు బావ ! నేను కొంచెం కాఫీ తాగి మేడమీది నా గదిలో నుండి తోటలోకి చూస్తూ కూర్చున్నాను. అక్కడో పున్నాగ చెట్టుంది. దానిమీద పిట్టలు తమ రంగు రంగుల తోకలాడించుకుంటూ కిచకిచ లాడుతుంటే చూడ్డానికి చాలా బావుం టుంది.

అత్తయ్య అక్కడికి దగ్గర్లోనే ఉన్న రామ మందిరానికి పోయింది. ఆరోజు శనివారం కాబోలు...అత్తయ్య శనివారం ఒక్కపూటే భోజనం చేస్తుంది. ఆవిడ భగవంతుణ్ని ఏం కోరి అట్లా ఉపవాసా లుంటుందో నాకర్థం కాదు ! ఎందుకంటే దేవుడిలాంటి మామయ్యను చేసుకున్న తర్వాత ఇంకా ఆవిడకు లోటేమిటి ?

ఎవరి గుండెల్లో ఎలాంటి తీరని కోరిక లుంటాయో ఎవరికి తెలుసు !

"రండమ్మా.. భోజనం చేద్దురుగానీ!"

కిటికీ చువ్వలకానించిన నా చెంపల్ని వెనక్కి తీసుకుని వంటావిడ వెంట వంట గదిలోకి పోయాను. అక్కడ నేనను కున్నట్లు బావలేడు ! సాధారణంగా నేను భోజనానికి పోయేసరికి బావ భోజనం పూర్తి చేసయినా లేచిపోతూంటాడు. లేక పోతే వచ్చయినా కూర్చుంటాడు!

"మీరు తినేయండి.. బాబుగారొస్తే నేను లేచి వడ్డిస్తాను. సినిమాగ్గాని పోయా రేమో !"

నేను డైనింగు టేబిలు దగ్గర కూర్చు న్నాను.

మామయ్య ఉంటే • ఏవో పాతకాలం నాటి కబుర్లు వారపత్రికలోని సీరియల్లా చెబుతూ ఉండేవాడు.

భోజనం అయిందనిపించి, గదిలోనికి పోయి ఓ పుస్తకం ముందేసుకున్నాను. అట్లా ఎంతసేపు చదివానో గుర్తులేదు. అట్లాగే బెడ్ మీదికి ఒరిగి పడుకున్నాను.

బావ ఎప్పుడు వచ్చాడో తెలీదు. నా బెడ్‌మీద కూర్చుని కాళ్ళాడిస్తూ నన్నే చూస్తున్నాడు. పెదిమలమధ్య ఎర్రగా సిగరెట్టు వెలుగుతోంది ! సాధారణంగా బావ నా గదిలోకి రాడు. అయినా అంతగా నాతో అతనికి అవసరం కూడా రాదు ! ఒంటరిగా ఏమీ తోచక ఏవైనా కబుర్లు చెబుదామని వచ్చాడేమోనని, బెడ్ మీదనుండి లేచి క్రిందికి దిగబోయి అపుడు చూశాను ! గది తలుపులు దగ్గి రగా వేసున్నాయి !

బావ ఉద్దేశ్యం లీలగా అర్థమయింది.

తలుపులు తెరుద్దామని ఓ అడుగు ముందుకు వేయబోయాను. కానీ బావ కాలు అడ్డంపెట్టాడు.

"కాలు తియ్!" నేను చాలా శాంతంగా అన్నాను.

బావ ఏమీ సమాధానం చెప్పకుండా లేచి కిటికీలోనుండి సిగరెట్టు బయటకు విసిరేసి నన్ను దగ్గరకు లాక్కున్నాడు.

అపుడు వచ్చింది గప్పుమని నోట్లో నుండి వాసన ?

నేను అరచి గోల చేయలేదు.

లోలోపల మండుతున్నా చాలా శాంతంగా ఉండడానికి ప్రయత్నించి సాధించాను !

"ఏమిటిది ?"

బావ మీదికి వంగి బుగ్గమీద ముద్దు పెట్టుకోబోయాడు.

"నువ్వెంత అసహ్యంగా ప్రవర్తి

సున్నావో తెలుసా ? నీ శరీరం నీ ఆధీనంలో ఉండగా నువ్విట్లా ఎపుడయినా చేస్తే నా శరీరం ఒప్పుకోకపోయినా, నా మనసు సంతోషించేదేమో ! అదయినా నిశ్చయంగా చెప్పలేను ! కానీ ఇపుడు నువ్వు నా శరీరాన్ని గాయపరిచినా..దాని కన్నా నా మనసే ఎక్కువగా గాయపడుతుంది! వదిలెయ్ ఇట్లా ఇంకొంచెంసేపు గానీ నువు నన్ను పట్టుకుంటే ఇపుడు నేను మళ్ళా స్నానం చేయాల్సి వస్తుంది!"

బావ దెబ్బతిన్నట్లు నావేపు చూశాడు! బావ కండ్లు ఎర్రగా మెరిసిపోతున్నాయి.

"ఏం...రా... రమ్మంటే!" చేయందుకుని బెడ్ వేపు లాగాడు. నేను శాంతంగా వెళ్ళి బెడ్ మీద కూర్చున్నాను. బావ నావేపే చూస్తూ నుంచున్నాడు.

"నువు బావవు కాబట్టి మర్యాద కోసం కూర్చోమంటే కూర్చున్నాను. నీకు మగవాడిగా పుట్టుకతోనే కొన్ని అధికారాలూ.. హక్కులూ ఏర్పడ్డాయి.. మరి అవి లేని నేను ఎంత జాగ్రత్తగా ఉండాలో నీకు తెలీదు ! ఇంతకాలం నుండి బావవని అభిమానించిన నువ్వు ఇంకో అడుగు ముందుకు వేస్తే నా కళ్ళకు పురుగులా కనబడతావ్. నువ్విట్లా నా దృష్టిలో పురుగులా మారడం నాకెంత మాత్రం ఇష్టంలేదు. ఎందుకంటే మామయ్య నాకు దేవుడిలాంటివాడు. మరి మామయ్య రక్తం పంచుకుని పుట్టిన నువ్వు నాకట్లా కనబడ్డం ఎంత మాత్రం ఇష్టంలేదు !"

బావ మాట్లాడకుండా తలుపు తీసుకుని బయటకు వెళ్ళిపోయాడు !

ఆ రాత్రంతా నా తల బ్రద్దలయిపోతుందేమోనన్నంత బాధతో అస్సలు నిద్ర పోలేదు నేను.

* * *

సంధ్య చెప్పడం ఆపుచేసింది. చైతన్య ఆసక్తిగా వింటూ కూర్చున్నాడు.

"డాలీ నిద్రపోయిందమ్మా"

"సరే !"

ఆయా వెళ్ళిపోయింది.

సంధ్య కళ్ళు మూసుకుని సోఫాలో వెనక్కి వాలింది. పెదిమలతో ఓసారి నాలికను తడుపుకుంది. ఎర్రటి పెదిమలు తేనె పూసిన గులాబీల్లా నిగ నిగలాడాయి.

"నేనింత వివరంగా ఎందుకు చెబుతున్నానా అని మీకు ఆశ్చర్యం కలగవచ్చు. ఒకటి రెండు మాటల్లో చెబితే నా ఆవేదనా, నా పరిస్థితీ మీకర్థం కాదు. విషయాన్ని అర్థంచేసుకోవడానికి సానుభూతితో పరిశీలించే మనసూ, ఆర్ద్రత కలిగిన హృదయమూ ఉండాలి. అవి లేనపుడు మనిషి శిలా విగ్రహంతో సమానం. పదండి అట్లా తోటలో కూర్చుందాం !"

సంధ్య వెంట చైతన్య బయటకు వచ్చాడు.

తోటలో చల్లటిగాలి వీస్తోంది. గులాబీ పూలు తలలూపుతున్నాయి. నాలుగంటలు దాటిందేమో సూర్యుడు పశ్చిమాన అస్తమించడానికి సిద్ధమవుతున్నాడు.

తోటలో వేసిన పేము కుర్చీల్లో కూర్చున్నారు. దూరంగా మామిడి చెట్టు మీదనుండి లయబద్ధంగా కోయిల 'కూ(.. కూ(...' అని ఒకటే కూస్తోంది. భారమైన హృదయాన్ని అది కొంచెం తట్టి లేపి చైతన్యం వేపు నెడుతోంది.

నౌకరు ట్రేలో టీ ... బిస్కట్లు




తెచ్చాడు. ఓ గుక్క టీ తాగి సంధ్య ప్రారంభించింది.




తెల్లవారింది.

బావ నాతో మామూలుగానే ఉన్నాడు. డైనింగ్ హాల్లో టిఫిన్ చేసేటపుడు మౌనంగా కాఫీ సిప్ చేస్తూ ఒకటి రెండు సార్లు మాత్రం నా వేపు కళ్ళెత్తి చూశాడు. ఆ కళ్ళల్లో రాత్రి జరిగిన సంఘటన గురించి అత్తయ్యతో చెప్పవద్దనే అర్థింపు లేదు. ఎందుకంటే అలాంటి విషయాల్లో అత్తయ్య అతణ్ణి మందలించకపోగా సమర్థిస్తుంది కూడా!

అయితే ఆ ఎర్రబడ్డ కళ్ళ వెనుక నా మీద 'కక్ష' లాంటిది ఏమయినా ఉందేమోనని అనుమానం వేసింది.

మామూలుగా కార్లో నన్ను కాలేజీకి తీసుకువెళుతున్నపుడు కూడా ఏమీ మాట్లాడలేదు.

నన్ను కాలేజీ దగ్గర దింపి అలవాటు ప్రకారం హారన్ మోగించి కారు వెనక్కి తిప్పుకుని వెళ్ళిపోయాడు. గేటు దగ్గిర మామూలుగానే జమున నవ్వుతూ స్వాగతం చెప్పింది.

"ఏమిటే మీ బావకి వేరే పనేంలేదా?"

జమున ప్రశ్నకు ఆశ్చర్యపోయాను.

"ఏం? అలాంటి అనుమానం ఎందుకొచ్చింది నీకు? మా బావకు "పని లేకపోవడమేమిటి? తీరికే దొరకదుగానీ!"

"అదిసరే. అట్లా ఆడవాళ్ళని కొరికి తినేసే వాడిలా చూసాడేమిటి మీ బావ?"

"కొరికెయ్య వచ్చో లేదోననే ఆలోచనతో కావచ్చు!"

"మరి పక్కన నువ్వున్నావుగా!?"

"అంటే నన్ను కొరికేయమనా? లేక ఎవర్నయినా కొరుకుతుంటే నేను విడదీయాలనా నీ ఉద్దేశం?"

"ఛ...ఛ...అట్లాంటివాళ్ళని చూస్తే నాకేం మంచిగా అనిపించదు"

"అలాంటప్పుడు ఆ విషయం గురించి ఆలోచించడం మానెయ్యాలి! అట్లా మానేయకపోవడం వల్ల మానసిక 'వుగ్మత' పెరుగుతుంది మరి!"

* * *

ఆ సాయంత్రం ఇంటికి పోతూండగా దారిలో 'అప్సర' హోటల్ దగ్గిర కాపాడు బావ!

"ఎందుకు?" అడిగాను నేను.

"కొంచెం కాఫీ తాగుదాం. కమాన్!"

బావ వెంట ఏ. సి. రూంలోకి పోయి కూర్చున్నాను. వెయిటర్‌కి రెండు కాఫీ ఆర్డరు చేశాడు బావ. అట్లా తీరిగ్గా కూర్చుని బావతో మాట్లాడాల్సిన అవసరమే కలగలేదింత కాలం!

కాఫీ సిప్ చేస్తూ నెమ్మదిగా కదిపాడు.

"నీకు నీతిని గురించి పట్టింపు లెక్కువనుకుంటాను!"

నాకు తెలుసు ఇట్లాంటి ప్రశ్నేదో అడుగుతాడని.

"నీతిని గురించిన పట్టింపంటే నీకు లొంగకపోవడమేనా?"

బావ తికమక పడ్డట్లు బావ మొహమే చెబుతోంది.

"అట్లాగే అనుకుందాం. దానివల్ల నువ్వు మహా గొప్ప నీతిమంతురాలివీ, నేనో అవినీతి పరుణ్ణి అయిపోయినట్లా?"

"అది మనం ఎట్లా అనుకుంటే అట్లా ఉంటుంది"

"మానసిక వ్యభిచారం అందరూ చేస్తున్నారు. పైకిమాత్రం అందరూ నీతి పరులే!"

నాకు వొళ్ళంతా కారం పూసినట్టయింది. అయినా నిగ్రహించుకున్నాను. కాఫీ పూర్తి చేసి కప్పు టేబిలు మీద పెట్టాను.

"ఇష్టం లేని పనికి మనసు ఎదురు తిరిగితే అది నీతని నేనసడంలేదు. నిన్ను అవినీతి పరుడవనీ అనలేదు" అని కోపం అణచుకుంటూ హోటలు బయటకు వచ్చాను.

బావ కారు స్టార్టుచేసి ఇంటికి తీసుకు వచ్చాడు.

ఇంకో రోజు.

కాలేజీనుండి వచ్చేటపుడు 'సిల్క్ కాంప్లెక్సు' ముందు కారాపాడు. ఎందుకన్నట్లు చూపులతోనే ప్రశ్నించాను.

"పద. ఓ చీర సెలక్టు చెయ్యాలి!"

"ఎవరికి?" కుతూహలాన్ని ఆపుకోలేక అడిగాను. నాకు కావలసిన చీరలు ఎపుడూ నేనే కొనుక్కుంటాను. మామయ్య కావలసిన డబ్బిస్తాడు.

"ఒకరికి ప్రెజెంట్ చేయాలి! బర్త్‌డేకి!"

"ఎవరికి?" మళ్ళీ అడిగాను. బావ నా వేపు విసుగ్గా చూశాడు.

"నీలాంటి గొప్ప నీతిపరురాలికి మాత్రం కాదు" బావ కటువుగా సమాధానం చెప్పి షాపులోకి నడిచాడు.

నేనూ కారు దిగి వెంట నడిచాను.

"నీలాగే ఎర్రగా ఉంటుంది. కొంచెం హెఫ్టీగా ఉంటుంది. కాస్త డార్క్ కలర్ చూడు!"

బావ ఓ మూల కూర్చుని సిగరెట్టు తాగుతున్నాడు.

నేను చాలా రకాలు చూసి రెండు చీరలు తీశాను. ఒకటి నైలక్స్—డార్క్ గ్రీన్‌లో మెరుస్తున్న యెల్లో స్పాట్స్.. ఇంకోటి స్నఫ్ కలర్ మీద వైట్ డిజైన్.. జరీ అంచు!

"వీటిల్లో ఏది కావాలో చూడు!"

"రెండూ ప్యాక్ చేయించు!" బావ నిర్లక్ష్యంగా అనేసి బిల్ 'పే' చేశాడు.

బయటకొస్తున్నపుడు నెమ్మదిగా అడిగాను.

"నాచేత ఎందుకు సెలక్టు చేయించావు?"

"పెద్ద కారణం ఏమీలేదు. తర్వాత అవి బాగాలేవని ఆవిడంటే.. ఆ బాధ్యత నా మీద ఉండగూడదని!"

నాకు చుర్రుమంది. కావాలని నన్ను మధ్య సాధ్యమైనంత వరకూ గాయపరచాలని బావ ప్రయత్నిస్తున్నాడు.

మర్నాడు కాలేజీలో ఏదో లిటరరీ ఫంక్షను. ఎవరో కవికి సన్మానం కూడా! నాటకాలు వగైరా కార్యక్రమాలున్నాయి! నేను కాలేజీ గేటు దాటి లోపలికి పోబోయేసరికి ఎపుడూ ఎదురుగా వచ్చే జమున కనిపించలేదు! జమునకు ఒంట్లో బాగోలేక రాలేదేమోనని ముందనుకున్నాను. వెయిటింగ్ రూంలో జమునను చూసి మూర్ఛ వచ్చినంత పనయింది. నా ఒళ్ళు నా స్వాధీనం తప్పి అక్కడే






పడిపోతానేమోనని భయపడ్డాను. జమున చుట్టూ నలుగురయిదుగురు నా క్లాస్‌మేట్సు చేరి జమున కట్టుకున్న కొత్త చీర 'చాలా బావుందని' ప్రశంసిస్తున్నారు. ఆ చీర నేను నిన్న 'సిల్క్ కాంప్లెక్స్'లో తీసిందే!

డార్క్ గ్రీన్‌లో మెరుస్తున్న యెల్లో స్పాట్స్.. ఆ పసుపు పచ్చని చుక్కలు నా కళ్ళలోకి జొరబడి ఆ గదినీ, గదుల్నీ కాలేజీనీ, సమస్తాన్నీ ఆక్రమించి.. నా చుట్టూ అనంత కోటి సంఖ్యలో తళుకు

తళుకుమని మెరిసినట్లయి కళ్ళు మూసుకున్నాను.

జమున !

బావ జమునకు ప్రజెంట్ చేశాడన్న మాట! ఒక్కసారిగా బావ రోజూ కాలేజీ గేటుముందు హారన్ మ్రోగించడం.. జమున గేటు దగ్గరకు రావడం.. అట్లా రావడం నా కోసమే అని నేను ఇన్నాళ్ళూ పొరబడ్డాను. అట్లా వాళ్ళు చూసుకోవడానికీ.. సంజ్ఞలకూ, అవి సంకేతమన్న మాట! ఎంత వెర్రిదాన్ని నేను!

జమున అన్న మాటలు కూడా నాకు ఒకటొకటీ గుర్తుకు వచ్చాయి. నిజానికి జమున పేదరికాన్ని ద్వేషిస్తుంది. పైకి అట్లా పేదరికంలోనే మ్రగ్గుతూ.. కష్టాల్ని భరిస్తూ నెట్టుకొస్తున్నా.. ఆ పేదరికం మీద జమున కేమాత్రం ప్రేమలేదు?

నా పిచ్చి!

పేదరికం మీద ఎవరికుంటుంది ప్రేమ? అసలు సమాజంలో ఎవరుగాని తమ స్థానాన్ని ప్రేమించి తృప్తి పడతారు? ఎప్పుడూ తమకన్నా ఉన్నత స్థానానికి ఎగ్రబాకాలనే ఆశ! ఆరాటం!

తన పేదరికాన్ని తాత్కాలికంగా మరిచిపోవడానికి ముళ్ళ దారైనా జమున ఈ అడ్డదారిని ఎన్నుకుందా?

బావ దీనికెన్ని ఆశలు కల్పించి, ఊహా లోకాలు చూపించి మురిపించాడో!

"రా సంధ్యా...రా!" జమున నాచేయి ఆప్యాయంగా పట్టుకుని లాగింది. ఆ చేయి కాలుతున్న ఇనప కడియంలా అనిపించిందో క్షణంసేపు! తర్వాత నన్ను నేను నిగ్రహించుకుని చిరునవ్వు నవ్వాను!

నేను నిజానికి జమునను ఎందుకు ద్వేషించాలి?

నేను బావని ప్రేమించనపుడు ఇలాంటి పరిస్థితిలో నిజంగా సంతోషపడాలి! పెళ్ళిదరూ ఏ గంగంలో దూకితే నాకేం?

"చీర చాలా బావుంది! ఎక్కడ కొన్నావ్?"

"మా అన్నయ్య విజయవాడ నుండి వస్తూ తెచ్చాడు!"

దానికి అన్నయ్య ఉన్నాడో లేడో తర్కించాల్సిన అవసరం నాకు లేదు కాబట్టి "చీర నీకు చాలా బాగా మ్యాచయిందని" ప్రశంసించి ఊరుకున్నాను.

రోజులు, నెలలు గడుస్తున్నాయి!

పరీక్షలయిపోయాయి!

రెండు రోజుల తర్వాత వేసవి శలవులు మొదలవుతాయి.

పరీక్షలయిన మర్నాటి నుండి జమున కాలేజీకి రాలేదు! పరీక్షల్లో కూడా చాలా ఉదాసీనంగా, నీరసంగా, సుస్తీగా కనిపించింది. అంతకు ముందు లాగా నేను ఎక్కువగా పట్టించుకుని కారణాల కోసం గుచ్చి గుచ్చి అడగలేదు. అట్లా అడగదలుచుకోలేదు కూడా!

తర్వాత ఆలోచిస్తే అది నాలో రేగిన జెలసీయో న్యూనతా భావమో ఎంతకూ తేల్చుకోలేక పోయాను!

ఆ రోజు శలవులు ప్రకటిస్తున్నారనగానే కాలేజీ అంతా 'గప్చు' మంది!

జమున నల్లుల మందు త్రాగిందట.

ఒక్క క్షణం నా గుండె ఆగినా తిరిగి మామూలుగా కొట్టుకోవడం మొదలు పెట్టింది.

జమున ఆత్మహత్యకు కారణం ఎవరికీ అర్థం కాలేదు. ఒక్క నాకు తప్ప!

అందరిలో కలిగిన అలజడీ, అశాంతీ నాలో కలుగలేదు! అందరూ విషాదంగా.. విభ్రాంతిగా మాట్లాడుకుని బాధపడు





తుంటే నేను నిర్లిప్తంగా ఉండిపోయాను.

అట్లా నా మనసు తాత్కాలికంగా శాంతించిందా ? అట్లా అని నేను తర్వాత చాలా రోజులు ఆలోచించాను!

ఆ మధ్యాహ్నం అందరం జమున ఇంటికి పోయాం ! వాళ్ళది చాలా చిన్న పెంకుటిల్లు, తల్లీ తండ్రీ.. ఓ తమ్ముడూ దారుణంగా ఏడుస్తున్నారు. వాళ్ళ మొహాల్లోని దైన్యాన్నీ.. ఆ వాతావరణంలోని పేదరికాన్నీ చూసి నేను రెచ్చిపోయాను. నాలో నాకు తెలీకుండానే ఓ రకమైన కసీ, కశా ఏర్పడ్డాయి !!

జమున నేను సెలక్టు చేసిన స్నఫ్ కలర్ జరీ బోర్డరు చీర కట్టుకునుందా సమయంలో. దాని మొహం నల్లగా మారినా నాకు ప్రశాంతంగా కనిపించింది. అది కళ్ళు మూసుకుని పడి ఉన్నా ఆ కళ్ళు నన్నే గుచ్చి చూస్తున్నట్లనిపించింది. దాని పెదిమలు, వాటి చివర్లు కొంచెం వంకర్లు తిరిగాయి అవి ఎవరినో ప్రశ్నిస్తున్నట్లనిపించాయి. శవం ముందు నిలబడలేక త్వరగా తిరిగి వచ్చేశాను.

"ఏమ్మా ! అపుడే వచ్చావేం?" మామయ్య ఆప్యాయంగా పలకరించాడు. మామయ్యను చూడగానే నాలో ఎందుకో గబ గబ కన్నీరు పొంగినట్లయింది. అతి కష్టం మీద నిభాయించుకున్నాను.

"ఏం లేదు మామయ్యా! తల నొప్పిగా ...ఉంటేనూ !" అబద్ధ మాడి చక చక మేడ మెట్లెక్కి నా గదిలోకి వచ్చి మంచంమీద వాలి పోయాను.

సాయంత్రమయిందాకా అట్లాగే పడుకున్నాను.

నేను లేచే సరికి తల భారంగా ఉంది. పక్కన సోఫా మీద కూర్చుని మామయ్య నా వంక చూస్తున్నాడు.

"ఏమ్మా ! ఏమయింది భోజనమైనా చేయకుండా పడుకున్నావ్?''

"ఏం లేదు మామయ్యా తల నొప్పిగా ఉంటేనూ!" ఇప్పుడు కాస్త తగ్గిపోయింది.

వేడి వేడి కాఫీ తాగిన తర్వాత మనసుకు కొంచెం హాయిగా అనిపించింది.

రైతు లెవరోవస్తే వాళ్ళతో మాట్లాడ్డానికి మామయ్య క్రిందికి వెళ్ళిపోయాడు!

నేను కిటికీలో నుండి పున్నాగ చెట్టు మీది రంగు పిట్టల్ని చూస్తూ నుంచున్నాను !

వెనక అలికిడికి ఓరగా తల త్రిప్పి చూశాను.

బావ!

నేననుకుంటూనే ఉన్నాను.

మాట్లాడకుండా వచ్చి సోఫాలో కూలబడ్డాడు.

బావ బహూశా పశ్చాత్తాప పడుతూ ఉండవచ్చు !

బావ, జమునల రహస్యం తెలిసిన వ్యక్తిని బహుశానేనొక్కదాన్నే కావచ్చు!

''సంధ్యా !''

నేను నెమ్మదిగా కిటికీ దగ్గిర నుండి వెనక్కి తిరిగి వచ్చాను.

బావలో నాకు పెద్దగా విచారం కనిపించలేదు. అందుకు కొంచెం ఆశ్చర్యపోయాను !

ముందు నేను మాట్లాడాలా? తాను మాట్లాడతాడా? అన్న సందిగ్ధంలో ఊగిసలాడాను !

"కూర్చో !''

నేను నిశ్శబ్దంగా కూర్చున్నాను.

''మీ స్నేహితురాలి దగ్గరకు పోయి వచ్చావా?''

"ఎక్కడికి ? అది పోయిన ఇంకో లోకంలోకా ?" కసిగానే అన్నాను నేను.

"అంత దూరం కాదు. ఇంటివరకూ!"

సిగరెట్ వెలిగించాడు బావ. నేనెట్లాగూ ఆవేశం పట్టలేక అల్లరి చేస్తానేమోనని దాని కోసం బావ తయారుగా ఉన్నట్లు పసిగట్టి నేను నిగ్రహించుకుని ఊరుకుండిపోయాను.



కొద్ది సేపటికి తానే అన్నాడు.

"చూడు సంధ్యా! ఈ విషయం జమున నీతో ఎప్పుడూ చెప్పలేదు గదూ?"

"ఏ విషయం?"

"అదే...మా ఇద్దరికీ ఉన్న సంబంధం గురించి! కానీ చూడు సంధ్యా...మనిషి పేదరికాన్ని నేను అసహ్యించుకోను. ఆ మనిషిని అసహ్యించుకుంటాను. నీతో అన్ని నీతులూ, కబుర్లూ చెప్పే జమున ఆ మాటలన్నీ కేవలం మాటలేనని నాముందు రుజువు చేసింది! డర్టీ ఫెలోస్. నీతిగా ఉండొద్దని ఎవడన్నాడు? ఉండమను! కానీ అవినీతిపరుల్ని పనిగట్టుకుని ఎందుకు విమర్శించాలి? పైగా నేను ఎప్పుడో ఈ విషయం నీతో చెప్పమన్నాను. నువుబాధపడతావనీ ... చెప్పననీ దాచేసింది! అంటే దాని బుర్రలో నన్ను 'వల'లో వేసుకోవాలనే ఆలోచన బాగా పాతుకుపోయి ఉందని తెలుస్తూనే ఉందిగదా?"

"ఇవన్నీ నాకెందుకు చెప్పడం?"

"ఎందుకంటే రేపు నువ్వు నా కాబోయే భార్యవి కాబట్టి!"

నేను చివ్వున తలెత్తి చూశాను.

నా ఒళ్ళు భగ భగ మండి పోయింది.

"అట్లా అని ఎవరన్నారు?"

"అనడం కాదు! అయినా ఈ విషయం నీకు తెలివని నేను అనుకోలేను! నాన్న దానికి అన్ని ఏర్పాట్లూ చేస్తూనే ఉన్నాడు. కానీ ఒక్క విషయం గుర్తుంచుకో! నిన్ను చేసుకోవాలని నేనేం తాపత్రయపడిపోవడంలేదు! నిన్ను నామెడకు బలవంతంగా కడుతున్నారు"

"నిన్ను చేసుకోడానికి మా మయ్యతోనో, మరెవరితోనో కలసి కుట్ర పన్నాల్సిన 'ఖర్మ' నాకేం పట్టలేదు!"

"చూస్తానుగా! అందుకే ముందే చెబుతున్నాను. ఆపైన నీ ఇష్టం. దానికి మూడో నెల కడుపొచ్చింది. పెళ్ళి చేసుకుందాం అని ఒకటే గోల! అట్లాంటి దాన్ని నా మెడకు తగిలించుకుని నా బ్రతుకంతా దాంతో ఈడ్వలేను!"

నాకేం తక్కువని దాన్ని కట్టుకోవాలి! అందుకే ఓ రెండొందలు పారేసి ఏ ప్రైవేట్ నర్సింగ్ హోంలోనో అబార్షన్ చేయించుకోమన్నాను. విన్లేదు. సరిగదా ప్రాణాలు తీసుకుంది. నేనేం చెయ్యను? ఐ డోంట్ కేర్!"

బావ విసురుగా లేచి బయటకు వెళ్ళిపోయాడు.

నేను ఆలోచిస్తూ కూర్చున్నాను.

చీకటి పడింది!




చీకటి పడింది! చల్లటి గాలి వీస్తోంది.

ఆకాశంలో చుక్కలు 'తళుక్కు'మని నల్లటి పరదాలను తోసుకుని నిక్కి చూస్తున్నాయి.

సంధ్య చెప్పడం ఆపుచేసింది!

"అరె! చాలా టైమయింది! మీరు చెప్పే కథ వింటూ కూర్చుండిపోయాను."

"ఏం? విసుగ్గా ఉందా?"

"అబ్బెబ్బె! కాలం తెలిసిరాలేదు! అంతగా లీనమైపోయాను"

"అంటే..?" సంధ్య చిన్నగా నవ్వింది.

"ఏదో నవల చదువుతున్నట్లని పించింది !"

"అన్నట్లు మీ ఇంటి దగ్గిర ఎదురు చూస్తుండవచ్చు" అని ఆగి "డ్రైవర్! కారు బయటకు తియ్" అని కేకేసింది గట్టిగా.

చైతన్యకు కమల గుర్తుకు వచ్చింది. కమల కళ్ళలోని, మొహంలోని భావాలు గుర్తుకు వచ్చాయి. వాతావరణమంతా క్షణకాలం అదోలా మారిపోయినట్లని పించింది.

"కారెందుకు ?" చైతన్య హఠాత్తుగా అన్నాడు.

"ఛలేవారే ! రిక్షాలో పోతారా?" సంధ్య నవ్వింది.

చైతన్య కారెక్కిన తర్వాత కారు రోడ్డుమీద జారి పోతున్నప్పుడు తానా 'చివరి మాట' ఎందుకన్నానా ? అని చాలాసేపు మథన పడిపోయాడు !

"ఇక్కడ ఆపెయ్!" ఇల్లింకా పాతిక గజాల దూరంలో ఉండనగా అప్రయ త్నంగా అన్నాడు చైతన్య.

డ్రైవరు కారాపాడు.

చైతన్య దిగి నెమ్మదిగా ఇంటి దగ్గ రకు నడిచి తలుపు మెల్లిగా తట్టాడు.

తలుపు ఓరగా వేసుంది. లోపల కమల బెడ్ మీద పడుకుని నవలేదో చదువుకుంటోంది.

చైతన్య బట్టలు విప్పి మొహం కాళ్ళూ కడుక్కున్నాడు.

"రండి భోజనం వడ్డించాను!"

కమల మెల్లిగా పిలిచింది.

కమల ఏమైనా అడుగుతుందేమోనని చైతన్య చాలాసేపు ఎదురు చూశాడు గానీ కమలేం మాట్లాడలేదు !

పక్కమీద పడుకుని ఇంటి కప్పుకేసి చూస్తూ ఆలోచిస్తుంటే కమల మెల్లిగా వచ్చి పక్కనే పడుకుంది.

కమల తలలోని గులాబీల నుండి సువాసన మత్తుగా వస్తోంది.

"కమలా"

"ఊఁ"

ఏం మాట్లాడాలో చైతన్యకు తోచ లేదు.

కమల ఏమయినా మాట్లాడితే తాను చెప్పాలనుకున్నవో... తనలో దాగి ఉన్న భావాలో బయటపడి మనస్సుకు కాస్త 'ప్రశాంతత' చిక్కేది.

కమల మౌనంగా ఉండడం దుర్భ రంగా ఉంది. ఆ మౌనాన్నీ, నిస్తబ్దతనీ ఎంతోసేపు తాను భరించలేడు ! తనలో తనకు తెలియకుండా ఏదో 'గిల్టీ కాంషస్ నెస్' దోవ చూసుకుని ప్రవేశించింది. అది తనని ఊరికే ఉండనీయదు.

తానేదో పొరపాటుగా ఆలోచిస్తు న్నాడు. అట్లా అని తన అంతరాత్మకు తెలుసు ! అది నిర్మలంగా ఉండీ... పూర్తిగా పరిశుభ్రం కావాలంటే దానికి ఏదయినా శిక్ష పడాలి.

లేదా... లేదా... ఘర్షణ కావాలి ! పొంగు చల్లారాలి ...కానీ... ఎట్లా? ఎట్లా?

చైతన్య అరచేత్తో నుదురు రుద్దు కున్నాడు.

"అమృతాంజనం రాసేదా ?"

కమల చాలా శాంతంగా అంది.

"ఆఁ...ఎందుకులెద్దూ ! అదే పోతుంది ! నీకనవసరంగా శ్రమ!"

"శ్రమేముంది...ఉండండి...!"

కమల అమృతాంజనం తెచ్చి నుదుటి మీద రాయబోయింది.

''నాకేం అక్కర్లేదు. అయ్!''

చాలా కర్కశంగా ... కఠినంగా చైతన్య ఆ మాటలన్నాడు.

అట్లా అన్న తర్వాత చైతన్య మనసు కాస్త నిలదొక్కుకుంది. ఓసారి గుండె గబగబా కొట్టుకుంది.

''నేనేమైపోతే ఎవరికెందుకు ? ఛీ... ఛీ...!''

చైతన్య గొణిగాడు.

గొణిగి కమల మొహంలోకి చూశాడు.

కమల మొహంలో మార్పేమీ లేదు. ఎప్పటిలాగే ప్రశాంతంగా ఉంది. పెదిమల చివర్లను విప్పుకుని బయటకు వచ్చి తొంగి చూసిన చిరునవ్వు మాత్రం వెంటనే మాయమైపోయింది!

''అన్నట్లు మధ్యాహ్నం హాస్పిటల్‌కు మీకోసం మనిషిని పంపిస్తే మీరులేరు!''

''అవును లేను. ఉన్నానని నేనంటున్నానా? అయినా నీకెందుకూ?'' 'ఖస్సు' మన్నాడు చైతన్య!

''మీరు భోజనానికి రావడం ఆలస్యం అయ్యేసరికి అట్లా పంపించాను.''

''ఏం? ఒక్క రోజు తినకపోతే ఏమౌతాను? అర్జంటు కేసొకటి ఉంటే అటెండవడానికి వెళ్ళానులే!''

కమల ఓ నిమిషం మౌనంగా ఉండి తర్వాత నెమ్మదిగా అంది. ''మరి... కారుమీదరాక నడిచే వచ్చారేం?''

చైతన్య నిరుత్తరుడయ్యాడు. అంతలోనే తేరుకున్నాడు.

అదే...అదే తనక్కావలసింది. ఆ కవ్వింపే తనక్కావాలి! అట్లాంటి కవ్వింపే తనలోని అపరాధ భావనని పూర్తిగా కడిగి, ప్రక్షాళనం చేసిపారేస్తుంది!

కానీ...కానీ అదింత కర్కశంగా ఉందేం?

ఇంత కఠినంగా ఉంటుందని ముందు తానెందుకూహించలేక పోయాడు!

దీన్ని భరించి ఎదురు నిలిచే శక్తి తనకుందా ? లేదా ? అని ఎందుకాలోచించలేకపోయాడు?!

''అవునూ...కార్లో వస్తేనేం ? నడిచొస్తేనేం? అద్సరే...కార్లోనే వచ్చాను... అనవసరంగా ఇంటిదాకా ఎందుకని ఆ టర్నింగ్ దగ్గిర దిగి వచ్చాను! సరా... ఇప్పుడు నీమనసు శాంతించిందా ?''

చైతన్య ఆగాడు.

కమల ఏమయినా అంటుందేమోనని చెవులు రిక్కించి చూశాడు. కమల మాత్రం ఏమీ మాట్లాడకుండా క్రింది పెదవిని పంటితో నొక్కుతూ ఊరికే పైకప్పువంక చూస్తోంది!

అపుడు పక్కకు ఒత్తిగిల్లి కమల మొహంలోకి చూడడానికి భయం వేసింది!

ఆ మొహంలో తాను భరించలేని భావాలు ఏమయినా కనబడితే- ?

''లైటార్పెయ్! నిద్రొస్తోంది!''

కమల ట్యూబ్‌లైటు ఆపుచేసి, బెడ్‌లైటు వెలిగించింది!

ఆ సన్నని కాంతిలో, చైతన్య శ్వాస విడిచే శబ్దం తప్ప అంతా నిశ్శబ్దంగా ఉంది!

మెత్తటి కమల చేతి స్పర్శకు చైతన్య ఉలిక్కిపడ్డాడు?

"ఉదయం అడిగింది మీకు గుర్తుందా ?"

"ఏమిటి ?"

"ఆడవాళ్ళెందుకు 'మందు'లకు అలవాటు పడతారని ?"

"ఊఁ"

"అదలా ఉంచండి" మీమగాళ్ళు ఊరికే. జావ అయిపోయి కస్సు బుస్సు మంటా రేం?" కారణం ఏమిటి కావచ్చంటారు?"

"ఇపుడెవరయ్యారట్లా ?"

"మీరు కోరి నాతో తగూ పెట్టుకోవా లనుకుంటున్నారు. అది ప్రస్తుతానికి బాగానే ఉండవచ్చు మీకు! నేనా సంగతి సరిగా అర్థం చేసుకోకపోతే తర్వాత మాత్రం మనిద్దరం బాధపడాల్సి వస్తుంది. మీకు 'మంచి' అనిపించిన దాన్ని వెంటనే చేసేయండి. కానీ చేసిన తర్వాత దాన్ని గురించి వెంపర్లాడకండి. చేసేముందే దాన్ని గురించి ఒకటి రెండు సార్లు ఆలో చించండి. ఫలితం చేదుగా ఉన్నా మింగాలి! అంతే. కానీ ఆ చేదును ఇంకె వరికైనా పంచుతానంటే మాత్రం ఎవరూ ఒప్పుకోరు."

కమల అంతకు ముందెప్పుడూ తనతో అట్లా మాట్లాడలేదు. కమల మాట్లాడిన మాటల్నే మననం చేసుకుంటూ కండ్లు మూసుకున్నాడు చైతన్య.

* * *

చైతన్య కమల మొహంలోకి చూశాడు.

కమల చాలా ప్రశాంతంగా ఉంది.

ముందుకి ఒంగి ఓ సారి కమల మొహాన్ని చేతుల్లోకి తీసుకున్నాడు.

"వదలండి!"

చైతన్య వదిలేశాడు.

'కమల తనకు దూరం కాకూడదు

ఈ ఆలోచన రాత్రి పడుకున్న తర్వాత ఎందుకో తనకు తెలీకుండానే మనసులో ఎన్నో సార్లు మెదిలింది.

ఏనాడూ రాని ఆలోచన అట్లా మనసు లోకి ఎందుకు వచ్చిందా? అని ఎంత గింజుకున్నా అర్థం కాలేదు.

చైతన్య వేపు నింపాదిగా చూసింది కమల.

కమల మొహంలో 'మధ్యాహ్నం భోజ నానికి వస్తారా ?' అన్న భావాన్ని చదివి జవాబిచ్చాడు.

"తప్పకుండా వస్తానుగా. 'ప్రభాత్'లో మంచి హిందీ సినిమా వచ్చింది. సాయంత్రం వెళదాం... రెడీగా ఉండు" అని చెప్పి చైతన్య బయట పడ్డాడు.

హాస్పిటల్‌లో కొద్దిసేపు పేషంట్లను చూసి ఎవరూ లేనపుడు ఏదో ఆలోచిస్తూ కూర్చునేసరికి పదకొండయింది.

దాదాపు పేషంట్లందరూ వెళ్ళి పోయారు. చైతన్య ఊరికే బయట రోడ్డు మీద పోతున్న జనాన్ని చూస్తూ అలాగే కూర్చున్నాడు.

కారు శబ్దంగాని వినిపిస్తుందేమోనని ఒకటి రెండు సార్లు ఆలకించాడు.

తనకు సంధ్యను చూడాలనిపిస్తోంది.

సంధ్య మాటలు పదే పదే వినాలని పిస్తోంది.

అవును !

"ఎందుకు?" తనను తానే ప్రశ్నించు కున్నాడు చైతన్య !

"నిజమే ! ఎందుకు?" దానికి జవాబు దొరకలేదు.

కాఫీ తెప్పించుకుని తాగి నుదురు తుడుచుకుని ఆలోచిస్తూ కూర్చున్నాడు.

భోజనం చేసి వచ్చేసరికి మూడయింది.

ఇంటినుండి తిరిగి వచ్చేసరికి డిస్పె న్సరీ పక్కనే పార్కు చేసి ఉన్నకారు !

"హలో !"

సంధ్య కారు డోరు తెరిచి పలకరిం చింది. చైతన్య లోనికి రమ్మని మర్యాదగా ఆహ్వానించాడు.





"ఆస్పత్రి వాసనంటే నాకు అలర్జీ... రండి!"

చైతన్య మారు మాట్లాడకుండా కారులోకి ఎక్కాడు. కారు 'రయ్యి' మని ముందుకు కదిలింది!

"ఎక్కడికి?"

"భలేవారే! మీకేమయినా పనుంటే చెప్పండి! అన్నట్లు అర్జంటు కేసులేవయినా చూడాల్సినవున్నాయా?"



"లేవుకానీ...రావచ్చు గదా ! ?"

"అయితే ముందు వాటి సంగతి చూడండి!" సంధ్య కారును స్లో చేసింది.

"నో ... నో ... పోనియ్యండి!" చైతన్య ఒక్కసారే అన్నాడు.

కారు తారు రోడ్డుమీద దూసుకు పోతోంది.

చల్లటి గాలి కిటికీలో నుండి లోపలికి దూసుకు వచ్చి ప్రాణానికి హాయిగా అనిపించింది !

"నిన్న నేను చెప్పే కథ పూర్తిగా వినకుండా మధ్యలోనే వచ్చేశారు మీరు!"

నిజమే ! నిన్న సంధ్య చెప్పే కథ మధ్యలోనే ఆగిపోయింది. సంధ్య గురించీ...సంధ్య బావ గురించీ రాత్రి చాలా సేపు ఆలోచించాడు కూడా తను !

"పత్రికలో సీరియల్ కథ మధ్యలో ఆగిపోదూ ? అట్లా ఆగింది గదా అని సద్దుకుని ఊరుకున్నాను!"

"అంటే ఏమిటి మీ ఉద్దేశం? మిగిలిన భాగం వచ్చే వారం వింటాననా?"

సంధ్య అట్లా నిష్ఠూరంగా అన్నపుడు ఆమె కళ్ళలో కనిపించిన చిరు కోపం, అలక చైతన్యను ఉత్తేజ పరిచాయి! ఆ చూపుల వెనక బలమైన శక్తి...తనకు తెలియకుండానే అది తనని చాలా వేగంగా బలంగా ఆకర్షిస్తోంది ! లాక్కుంటోంది ! తానంతా గమనిస్తున్నాడు. తాను స్పృహలోనే ఉన్నాడు... తనకంతా తెలుసు ! ఈ సమాజ నియమాలు..,నైతిక విలువలూ....బంధాలూ....అన్నీ తనకు తెలుసు !

అయినా సంధ్య ఎదురుగా ఉన్నపుడు తాను తాత్కాలికంగా వాటిని మరచి పోతున్నాడు.

పోర్టికోలో కారాగింది.

"రండి!"

ఆమె అలా ఆహ్వానించకపోయినా చక చక మెట్లెక్కి సరాసరి లోపలికి పోవడానికి చైతన్య సిద్ధంగా ఉన్నాడు !

చైతన్య సోఫాలో కూర్చున్నాడు.

గది చల్లగా ఉంది !

"ఈ షర్బత్ తాగండి !"

చైతన్య మౌనంగా నిమ్మరసం తాగుతూ కూర్చున్నాడు.

"ఏమిటో అంత దీర్ఘంగా ఆలోచిస్తున్నారు?"

"ఏమీలేదు ! వారపత్రికయితే వచ్చే వారం మీ సీరియల్ చదవచ్చు ! మరి కొంపదీసి మాస పత్రికయితే ఎట్లాగా అని!"

చైతన్య మాటలకు సంధ్య వీణా తంత్రులు మ్రోగినట్లు నవ్వింది.

"యూ సిల్లీ!"

"ఇంట్లో ఎవరూ ఉన్నట్లు లేరు!"

"నాకర్లా ? పనంతా అయిపోయింది కాబట్టి వంటమనిషి నిద్రపోతోంది.... 'ఆయా' 'డాలీ'ని కాన్వెంటుకు తీసుకు పోయింది. డ్రయివర్ ట్రాక్టర్ ఏదో ట్రబులిస్తే చూస్తున్నాడు. మిగతావాళ్ళు తోటలో ఉండి ఉంటారు!"

చైతన్య మాట్లాడకుండా సంధ్యను చూస్తూ కూర్చున్నాడు.

ఆకు పచ్చటి చీరలో సంధ్య మెరిసి పోతోంది. మెడలో పొడుగ్గా వేలాడుతున్న లాకెట్ అటూ ఇటూ ఊగుతోంది. తానట్లా రెప్ప వేయకుండా ఆవిడ అందాన్ని చూడడం తప్పనే విషయం అసలు ఆలోచనలోకి రావడంలేదు !

"చెప్పండి!"

"ఏమిటి? నేనా!" చైతన్య తడబడ్డాడు




"అదేనండీ..నేనెక్కడిదాకా చెప్పాను? ఆ..ఆల్ రైట్..!"

"అన్నట్లు ఆ పెట్టె ఏదీ?" చైతన్య టేబిలుమీద చూశాడు! నగిషీలు చెక్కిన దంతపు పెట్టె అట్లాగే కదలకుండా ఉంది. ఓ క్షణకాలం దాన్లో ఏముందో చూడాలని కలిగిన ఉత్సుకతనూ....కోరికనూ అతి బలవంతంగా అణుచుకున్నాడు చైతన్య!

"ఉండండి మరీ! కథ పూర్తిగా చెప్పనీయండి! ఊఁ...ఆ రాత్రి...."




రాత్రి చిక్కగా ఉంది!

అత్తయ్య ఎందుకో మొహమంతా మాడ్చుకుని మటమటలాడుతూ వంటింట్లో కూర్చుంది.

అంతకు ముందే మామయ్య అత్తయ్యతో తీవ్రంగా ఘర్షణ పడ్డాడు!

మామయ్యలో అంత కోపాన్ని అంతకు ముందు నేనెప్పుడూ చూడలేదు!

బావ సిగరెట్ మీద సిగరెట్ కాలుస్తూ నిర్లక్ష్యంగా పొగ పైకి ఊదుతూ వరండాలో కూర్చున్నాడు.

మామయ్య తన గదిలో నిశ్శబ్దంగా కూర్చున్నాడు.

నేను లోపలికి పోయాను!

"కూర్చో!"

నేను మౌనంగా కూర్చున్నాను.

మామయ్య సూటిగా అసలు విషయంలోకి వచ్చేశాడు!

"చూడమ్మాయ్! నిన్ను నా కూతురిలా పెంచాను..నా స్వంత కొడుకునీ..నిన్నూ నా రెండు కళ్ళలా చూసుకున్నాను. అదెంత పొరపాటో అని ఇప్పుడాలోచిస్తున్నాను. నాకో చిన్న సహాయం చేయగలవా?

నా కళ్ళు చెమ్మగిల్లాయి. నేను మామయ్యకు సహాయం చేయడమా? మామయ్య అట్లా అడక్కుండా నిప్పులో దూకమని ఒక్కమాట చెబితే నేనట్లా చేయనూ?

"చెప్పు మామయ్యా!" గొంతు పెగల్చుకుని అన్నాను.

"నాకు తెలుసు! నువు నా మాట కాదనవు! వాడెంతగా చెడిపోయాడో నీకూ, నాకూ తెలుసు! వాడే దశలో ఉన్నాడో వాడికీ మీ అత్తయ్యకూ మాత్రం తెలీదు! వాళ్ళకు తెలియకపోవడం వల్ల మనకేం ఇబ్బంది లేదు కదాని మనం చూస్తూ ఊరుకోలేం కదా? ప్రకృతిలో దాదాపు అన్ని జబ్బులకూ మందులు కనిపెట్టారుగానీ...మూర్ఖత్వానికి మందెవరూ ఇంతవరకు కనిపెట్టలేదు! సరే! మూర్ఖుల సంగతి వదిలేసి అసలు విషయానికి వద్దాం! నాకు ఒంట్లో ఆరోగ్యం, ఓపికా సన్నగిల్లిపోతోంది. అందుకే 'వీలునామా' ఓటి తయారుచేసి ఉంచాను. దానికి ముందు నీకూ, బావకూ పెళ్ళి చేయాలి!"

నేను విలవిల్లాడి పోయాను!

నిప్పులో దూకడం కన్నా ఇది చాలా దారుణమైన విషయం!

అయితే మామయ్య కళ్ళలోని ఆర్ద్రత నా గొంతును నొక్కేసింది! ఏమీ మాట్లాడకుండా గుడ్లప్పగించి చూస్తూ

కూర్చుండి పోయాను !

"నీ ఆలోచనేమిటో నాకు తెలుసు నిన్ను వాడు సుఖంగా బ్రతకనీయడు. నీ జీవితాన్ని నరకంగా తయారు చేస్తాడు; మీ అత్తయ్య నిన్ను తన ప్రథమ శత్రువులానే చూస్తుంది! అదీ నాకు తెలుసు !! నేను కండ్లు మూసిన మరు క్షణం నుండే వాళ్ళు నీ వెంట బడతారు. అయినా అన్నీ తెలిసే నేనీపని చేద్దామను కుంటున్నాను!"

నేను ఏమీ అర్థంగాక అయోమయంగా



మామయ్య మాటలు వింటూ కూర్చున్నాను!

"అందుకనే వీలునామాలో ఒకటి రెండు షరతులు విధించాను. అందులో ముఖ్యమయింది ... ఈ ఆస్తికంతటికీ వారసురాలివి నువ్వే! దీని మీద సర్వాధికారాలూ నీవిమాత్రమే! అయితే వాళ్ళిద్దరి ఖర్చుల నిమిత్తం కొంత ఆదాయం అందే ఏర్పాటు చేశాను! దాన్ని వాళ్ళు స్వేచ్ఛగా తమ ఇష్టం వచ్చినట్లు ఉపయోగించుకోవచ్చు! అయితే అది వాడు నిన్ను విడిచిపెట్టకుండా 'మంచి'గా నీతో ఉన్నంతవరకే! ఎపుడయితే వాడు నిన్ను విడిచేయాలనీ, విడాకులివ్వాలనీ ప్రయత్నిస్తాడో.. అపుడు వాడికి ఒక్క చిల్లిగవ్వ కూడా రాదు! మీ అత్తయ్యకూ రాదు. కేవలం కట్టుబట్టలతో బజార్న పడాల్సిందే! అంటే నీతో సఖ్యంగా సంసారం చేసినంత వరకు ఎవరికీ ఎలాంటి చిక్కూ రాదన్నమాట! నిన్ను కాదని నిన్ను వదిలేయాలని చూసే మాత్రం వాళ్ళకి సర్వనాశనం తప్పదు!"

నేను నివ్వెరపోయాను!

మామయ్య నా భవిష్యత్తు గురించీ.. నా భద్రత గురించే కాదు.. తాను సంపాదించిన ఈ ఆస్తిపాస్తుల భద్రత గురించి కూడా చాలా కట్టుదిట్టమైన ఏర్పాట్లు చేస్తున్నాడన్నమాట!

దానితోబాటు మామయ్య నామీద నేను మోయలేని బరువుని కూడా జాగ్రత్తగా మోపుతున్నాడు. నేనీ బరువుని చివరి కంటా మోయగలనో లేదో అని కూడా మామయ్య ఆలోచించ దలుచుకోలేదని పిస్తోంది.

తర్వాత నాకు తెలీకుండానే నాలో ఓ ఆలోచన కలిగింది. అది బహుశా తాత్కాలికంగా నాలో కలిగిన ప్రతీకార జ్వాల నుండి పుట్టింది కావచ్చు.

నా చిన్నతనం నుండీ దాదాపు 'అనాథ'గా పెరిగిన నాకు కేవలం మామయ్య మాత్రమే ప్రేమంటే, మమకారమంటే, ఆత్మీయతంటే ఏమిటో రుచి చూపించాడు! అలాంటి మామయ్య లేకుండా పోయిన తర్వాత, మిగిలిన నా జీవితాన్ని నేనెట్లా గడిపితేనేం?

ఒకవేళ ఇట్లాంటి ఏర్పాటేగాని లేక పోతే నా బతుకేమవుతుంది? నేను ఎలాంటి హీనమైన, నీచమైన జీవితాన్ని గడపాల్సి వసుంది?!

నేనా క్షణంలోనే మామయ్య సంతోష పడేలా.. తృప్తిపడేలా నా అంగీకారాన్ని తెలియజేశాను!

తర్వాత లేచి నెమ్మదిగా గది బయటకు వచ్చాను! బావ బయట కూర్చుని నాకేసి 'కసి'గా చూస్తున్నాడు. ఇంతకు ముందులా నేను బావని చూసి పెద్దగా భయపడడంగానీ, ఒదిగి ఉండాల్సిన అవసరంగానీ కనిపించలేదు!

"సంధ్యా!"

బావ మామూలుగా పిలిచినా, ఆ పిలుపు వెనుక దాగిఉన్న కర్కశత్వం, నా మీది కసీ ఇట్టే అర్థమయిపోయాయి.

"ఏమిటి?"

"నేనంతా విన్నాను. మీ ఏర్పాట్లు చాలా బావున్నాయి!

"అలాగా!"

"మరి నేను చేసే 'ఏర్పాటేమిటో' కూడా నువ్వు వింటే బావుంటుందనుకుంటాను !"

నేను ఏమీ మాట్లాడకుండా మౌనంగా తల తిప్పి చూశాను.

"నేను నిన్ను ఏనాడూ విడిచిపెట్టను. జీవితాంతం మనం తప్పకుండా భార్యా భర్తల్లాగే ఉండి తీరాలి. మీ 'మామయ్య' చేసిన ఏర్పాట్ల గురించి నీకు కొద్దిగా మాత్రమే తెలుసు. డిటెయిల్‌గా నువ్వు చదవలేదనుకుంటాను. దాన్ని నేనెప్పుడో చదివాను. అందులో 'క్లాజు-బి' అని ఒకటి ఇరికించాడు. దానిలో మనకు సంతానం కలిగిందంటే ఆ బిడ్డకూ...మన సారీ 'నీ' ఆస్తి మీద అధికారం ఏర్పడుతుంది. తద్వారా ఆటోమాటిక్‌గా, 'గార్డియన్' హోదాలో నాకూ ఆ వారసత్వంలో 'భాగం' వస్తుంది. అంటే నీకు 'తప్పకుండా' సంతానం కలిగి తీరాలన్నమాట! చూద్దాం."

"సరేలే ! పెళ్ళయితే అవన్నీ. నిన్ను ఎట్లా అదుపు చేసి దూరంగా ఉంచాలో నాకు బాగా తెలుసు !" అట్లా నాలోని కసినంతా బయటకు వెళ్ళగక్కి అక్కడి నుండి విసవిసా నడిచి వెళ్ళిపోయాను.

పెళ్ళి చాలా నిరాడంబరంగా...నేననుకున్నట్లుగా జరిగి పోయింది. పెళ్ళయినందుకు అత్తయ్య సంతోషించలేదు. అట్లా అని ఆ మరుసటి రాత్రి మామయ్య చనిపోయినప్పుడూ విచారించలేదు. ఓసారి నా వంక ఓ చూపు చూసి ఊరుకుంది.




సంధ్య చెప్పడం ఆపుచేసింది. అప్పటికి బాగా సాయంత్రమయింది. తోటలో గులాబీ మొక్కల మీద పిట్టలు కిచ కిచలాడుతున్నాయి.

"మీరు చెబుతున్న విషయాలు 'కథ' కన్నా చాలా చాలా ఆసక్తికరంగా ఉన్నాయి. నా కసలు టైమ్ తెలియటం లేదు"

సంధ్య బదులేమీ చెప్పకుండా నవ్వింది!

"మిమ్మల్ని ఇంకా ఇట్లాగే సస్పెన్సులో పెట్టడం నాకేం బాగనిపించడం లేదు! ఆ పెట్టె తెరిచి దాన్లో ఏముందో చూడండి!"

చైతన్య ఆ పెట్టెను ఆత్రంగా అందుకుని తెరిచి దానిలో ఏముందో చూద్దామని పడిన ఆతృతను బలవంతంగా అణుచుకున్నాడు. అట్లా ఆత్రపడి తన 'బలహీనతను' ఆవిడ ముందు ప్రదర్శించడం ఎంత మాత్రమూ ఇష్టంలేదు!

తాపీగా ముందుకి ఒంగి, ఆ దంతపు పెట్టెను ఓ సారి చేతిలోకి తీసుకున్నాడు చైతన్య! ఓ సారి అటూ ఇటూ త్రిప్పి చూసి చేతితో బరువు బేరీజు వేసి నెమ్మదిగా దాని మూత తెరిచాడు.

చూసి అయోమయంగా సంధ్యకేసి తిరిగాడు.

సంధ్య సోఫాలో వెనక్కి వాలి, కండ్లు మూసుకుని పడుకుంది.

ఆవిడ కండ్లు మంచినీటి సరస్సులో నిశ్చలంగా ఉన్న చేప పిల్లల్లా కనిపించాయి. చైతన్య మౌనంగా ఆ పెట్టెను టీపాయ్ మీద ఉంచేశాడు.

"చూశారుగా దానిలో ఏముందో? నా మెడకి కట్టిన ఆ ఉరితాడే నా బ్రతుకునో శాపపు బ్రతుకు క్రింద మార్చేసింది! ఆ మూడు ముళ్ళ పసుపు తాడే నన్ను బానిసనూ...బందీని చేసింది.





ఆ తాడును త్రెంచుకో లేకా... దాన్ని నా జీవితానికి కావలసినట్లు మలుచుకో లేకా సతమతమయి పోయాను! ఈ బంధానికి చిక్కకుండా దూరంగా పారిపోదామని విశ్వప్రయత్నం చేశాను! కానీ ఓడిపోయాను!'

సంధ్య ఆవేశాన్ని అణుచుకోవడానికా అన్నట్లు ఓ నిమిషం మౌనంగా ఊరుకుంది.

చైతన్య దంతపు పెట్టెలో మెరుస్తున్న మంగళసూత్రాలవంకే చూస్తూ కూర్చున్నాడు.

"అరె! చాలా రాత్రయినట్లుంది! మీరు వెళతారా?"

చైతన్యకు, ఇంకా అట్లాగే సంధ్య ముందు కూర్చుని ఆమె చెప్పే మాటలు వినాలనుంది. ఆ మాటలు చెబుతున్నప్పుడు అందంగా అటు ఇటు కదిలే సంధ్య పెదిమలను చూడాలనీ ఉంది.

అయినా లేచి నిలబడ్డాడు.

"అన్నట్లు రేపటి మీ ప్రోగ్రామ్ ఏమిటి?"

"బావుంది! హాస్పిటలే నాకున్న అన్ని ప్రోగ్రాములూనూ"

సంధ్య మెత్తగా నవ్వింది.

"సరేలెండి. కారు పంపిస్తాను రండి!"

"అలాగే!"

"ఎక్కడికని అడగరేం?"

చైతన్య బిత్తరపోయి.. క్షణం ఆలోచించి ఎటూ తేల్చుకోలేక అడిగాడు "ఎక్కడికి?"

"అదే సస్పెన్సు! రేపు నేను చెప్పిందాకా దాన్ని గురించే ఆలోచిస్తూ ఉండండి! గుడ్ నైట్."

చైతన్య బయటకు వచ్చాడు!




"ఏమిటి ఆలోచిస్తున్నావ్?"

"నేనా!? అబ్బే..నేనేం ఆలోచిస్తాను!"

చైతన్య మాట్లాడకుండా కమల మొహంవంక చూస్తూ కూర్చున్నాడు.

కమల ఏదో ఆలోచిస్తోంది. తనకా విషయం తెలుసు. ఏం ఆలోచిస్తోందో కూడా లీలగా తాను పసికట్టగలడు. అయినా తనా విషయం బయటకంటే కమల అసలు ఒప్పుకోదు. అట్లా ఒప్పుకోలేకపోవడం కమలలోని బలహీనతకాదు. అట్లా అడగడం తనలోని బలహీనత!!

"ఇవ్వాళ సాయంత్రం కూడా మీరు హాస్పిటల్లో లేరు!"

"అవును!"

కమల మళ్ళా మౌనంగా ఊరుకుంది. ఆమె పెదిమల చివర్లు ఓసారి చిన్నగా వంకర తిరిగి మళ్ళీ మామూలుగా మారిపోయాయి. "నాకు తెలుసు మీరెక్కడికి పోయారో..?" అన్న దానిలోని భావాన్ని చైతన్య ఇట్టే గ్రహించాడు. అది గ్రహించిన తర్వాత చైతన్య తనలో కలిగిన ఆవేశాన్ని అతి కష్టం మీద నిగ్రహించుకున్నాడు.

"చదువుకుంటారా ? లైటు తీసేదా?"

"సరేగానీ.. అట్లా కూర్చో!"

"ఎందుకో!?"

చైతన్య అనవసరంగా ఖస్సు మన్నాడు. "అయితే అట్లాగే నిలబడి ఉండు. కూర్చోమంటే కూడా తప్పయి పోతే ఎట్లా?"

కమల చైతన్యలో హఠాత్తుగా పొంగిన ఆవేశాన్ని విప్పారిన కళ్ళతో ఆశ్చర్యంగా చూసింది. చైతన్య తాను ఎరిగిన నాటినుండీ అంత అనవసరంగా.. అసందర్భంగా ఏనాడూ అట్లా ఉద్రేక పడలేదు!

క్షణం ఆగి కమల గలగల నవ్వింది.

చైతన్య తన కోపాన్ని మరిచిపోయి నవ్వుతున్న కమల వంకే చూస్తుండి పోయాడు! కమల తన నవ్వును ఆపిన తర్వాతగానీ తాను ఉద్రేకపడిన విషయం చైతన్యకు గుర్తు రాలేదు.

"మంచిది.. కూర్చున్నాను ... చెప్పండిక!"

తానేం చెప్పాలి? అసలేం చెప్పాలను కున్నాడు!?

"అహ.. ఏమీలేదు. 'ఆ డ్రగ్ ఎడిక్ట్' పేషంటు రాను రాను నాకో తల నొప్పిలా తయారయింది!"

"ఏమిటి ? తలనొప్పిగానా?" కమల ఆశ్చర్యంగా, విచిత్రంగా చైతన్య వంక చూసింది.

"అఫ్‌కోర్స్.. అంతేననుకో!"

"బావుంది, డాక్టర్లకూ, లాయర్లకూ డబ్బున్న శాశ్వతమైన పేషంట్లూ... క్లయింట్లూ ఉండాలనీ, వాళ్ళే తమకు మహారాజ పోషకులనీ అందరూ అంటూ ఉంటారు"





చైతన్య తల విదిలించాడు.

కమల మౌనంగా పెద్ద లైటు ఆర్పే సింది. వచ్చి మాట్లాడకుండా చైతన్య పక్కలో పడుకుంది.

చైతన్య బెడ్‌లైటు దగ్గిర గంతులు వేస్తున్న చిన్న చిన్నపురుగులనే చూస్తూ పడుకున్నాడు.

"డ్రగ్స్‌కి ఎడిక్ట్ కావడం ప్రమాదమే! అయితే అట్లాంటి ఎడిక్ట్‌లకు ఎడిక్ట్ కావడం ఇంకా ప్రమాదం"

చైతన్య బిత్తరపోయాడు. ఏమీ మాట్లాడకుండా మౌనంగా పడుకున్నాడు. మనసునిండా సంధ్యను గురించిన ఆలో చనలే ఈగల్లా ముసురుకుంటున్నాయి.




"ఇప్పుడు చెప్పండి!"

"ఏమిటి?"

"భలేవారే! రాత్రంతా తల బద్దలు కొట్టుకున్నా మీరు చెబుతానన్నదేమిటో అర్థం కాలేదు!"

"అయితే ముందు కారెక్కండి!"

"ఎక్కడికి ?"

"ముందెక్కితే చెబుతాను"

చైతన్య మారుమాట్లాడకుండా కారెక్కాడు.

కారు నెమ్మదిగా తారురోడ్డు మీద పోతోంది. సిటీ దాటి చాలా దూరం వచ్చేసింది.



"ఇదెక్కడికి?" చైతన్య రెండు వేపులా ఉన్న పచ్చని పొలాల వంక చూస్తూ అడిగాడు.

"గుడికి వెళదాం"

"ఎందుకు?"

సంధ్య విచిత్రంగా చైతన్యను చూసింది. "గుడికి ఎవరేనా ఎందుకు వెళతారు ! చూడ్డానికి !"

అపుడు చూశాడు చైతన్య కార్లోని టిఫిన్ క్యారియర్ని, దిండ్లనూ, పళ్ళ బుట్టనూ.. ఇతర సరంజామాను.

కారు నెమ్మదిగా రాజహంసలా నున్నటి తారు రోడ్డుమీద దూసుకు పోతోంది. చుట్టూ పచ్చని పొలాల మధ్య తలలు నిక్కించి చూస్తున్న తాటి చెట్లు మనోహరంగా ఉన్నాయి.

దూరంగా చిన్న చిన్న రాళ్ళ గుట్టల మీద పశువులు కాసే కుర్రవాళ్ళు పాటలు పాడుకుంటున్నారు!

"ఆ గుడి నేనింతకు ముందోసారి చూశాను. చాలా అద్భుతమైన శిల్పాలవి! ఆ శిల్పాలను ఎవరు చెక్కారోగానీ ఆ శిల్పికి కోల మొహాలంటే ఇష్టం కాబోలు!"

"ఏం?" సంధ్య కారు డ్రయివ్ చేస్తూనే అంది.

"ప్రతి బొమ్మ మొహమూ ఒకే విధంగా కోలగా ఉంటే అలాగే అనిపిస్తోంది"

పెళ్ళయిన కొత్తలో కమల ఓ సారి చైతన్యను గుడికి తీసికెళ్ళమంది! ఏదో ఒక పని తగలడం వల్ల ఎంతకాలం గడచినా అది కుదరనేలేదు.

సంధ్య కారుని సూటిగా గుడి దగ్గరకు కాకుండా చెరువు కట్టమీద 'ట్రావెలర్స్ బంగళా' దగ్గరకు తీసుకుపోయింది.

చైతన్య విశాలమైన...అగాధమైన చెరువులోకి చూస్తూ నుంచున్నాడు. అక్కడక్కడ చేప పిల్లలు 'ఛంగు'మని పైకెగిరి తిరిగి అడుక్కి వెళ్ళిపోతున్నాయి.

చిన్న చిన్న రేకు డబ్బాలు మొలలకు కట్టుకున్న జాలరులు నీటిమీద సర్కసు ఫీట్లు చేస్తూ వలలతో చేపలు పడుతున్నారు.

ఏ మహానుభావుడో నిర్మించిన ఈ చెరువు ఎన్నో వేల మంది కడుపు నింపుతోంది. ఏం ఆశించి ఆ మహానుభావుడు దీన్ని నిర్మించాడో!?

"రండి"

గదిలోకి నడిచాడు చైతన్య.

అద్దం ముందు నుంచుని తలవెంట్రుకలు సరిజేసుకుంటోంది సంధ్య!

వెనకనుండి తెల్లని శంఖం లాంటి మెడా...జాకెటు కింద నిగ నిగ లాడుతూ మెరుస్తున్న నడుమూ...

అలానే చూస్తూ నుంచుండి పోయాడు చైతన్య!

అలా చూడడం సభ్యత కాదన్న విషయాన్ని కూడా పూర్తిగా మర్చిపోయాడు!

"ఏమిటి చూస్తున్నారు?" సంధ్య వెనక్కి తిరిగి అంది.

"అబ్బె...ఏం లేదు. ఆ గుడి నుండి ఎవరేనా ఓ విగ్రహాన్ని తెచ్చి ఇక్కడ ఉంచారా ఏమిటీ అనిపించి చూస్తున్నాను''

చటుక్కున అని తర్వాత నాలిక కరుచుకున్నాడు చైతన్య!

సంధ్య చిన్నగా నవ్వింది.

"గుడికి పోదాం పదండి!''

ఎత్తయిన చెరువు కట్టమీద నుండి కిందికి దిగుతుంటే గాలిలో తేలిపోతున్నట్టుంది. కట్ట కిందున్న ఊడలు దించిన మర్రి చెట్టు కింద కొందరు యాత్రికులు కబుర్లు చెప్పుకుంటున్నారు. కొందరు పిల్లలు కాలవలోకి దూకి కేరింతలు కొడుతున్నారు.

పక్కనే ఉన్న అడవిలో నుండి పిట్టలు చిత్రంగా శబ్దం చేస్తున్నాయి. పగి




లిన గురివింద కాయలనిండా ఎఱ్ఱని ముత్యాల్లా గురివింద గింజలు ఒక్కొటి రాలి ఎండిన ఆకుల మీద టప్ టప్ మని పడుతున్నాయి.

"ఇక్కడ పులులున్నాయట !''

"నిజం!'' చైతన్య మాటలకు సంధ్య కండ్లు విశాలంగా తెరిచి చూసింది.

"దక్షిణ భారత దేశంలో ఈ గుడికి, శిల్పాలకూ ఓ ప్రత్యేకత వుంది. నల్లటి రాళ్ళలో మనకు ఆనాటి సంస్కృతీ, అందాలు సోయగం... అన్నీ కని పించేట్లు అద్దం పట్టినట్లు చూపారు మహానుభావులు. అవి ఆనాటి శిల్పుల రసజ్ఞతకూ, కళానైపుణ్యానికీ ప్రతీకలు.

చైతన్య మాటలు ముగించకముందే గుడి దగ్గరకు చేరుకున్నారు. గుడిలో ఎవరో యాత్రికులు పూజలు చేస్తు న్నారు. మెట్లమీద కొబ్బరి తింటూ ఇద్దరు నవ దంపతులు కబుర్లు చెప్పు కుంటున్నారు!

"రండి...రండి'' పూజారి ఇద్దర్నీ మంటపంలోనికి ఆహ్వానించాడు. సంధ్య విభ్రమంగా స్తంబాలనీ వాటి మీద లయ విన్యాసం చేస్తున్న శిల్పాలనీ చూస్తోంది.

"ఇంతకు ముందెప్పుడూ మీరిక్కడికి రాలేదనుకుంటాను'' చైతన్యను చూస్తూ పిలక సవరించుకుంటూ అన్నాడు పూజారి.

"రాలేదు''

పూజారి పూజ చేయించాడు. గర్భగుడి ద్వారం పక్కనే ఉన్న చిన్న నల్లరాతి స్తంభాన్ని మీటి సరిగమలు పలికించాడు.

బయట ఏనుగుల మీద స్వారీ చేసే సింహాలనూ ప్రత్యేకించి నాగకన్యనూ... వనవిహారి కాలిలో గుచ్చుకున్న ముల్లును తీస్తున్న కోతి బొమ్మనూ చూస్తూ చాలా సేపు నుంచుండి పోయింది సంధ్య. పచ్చని పొలాల మీద నుండి సాయం కాలపు పిల్ల తెమ్మెర తేలుతూ వచ్చి గిలిగింతలు పెడుతోంది.

ఆలయం ఎదురుగానే సందికి ఆవల స్తంభాలు కూలిపోతున్న శిథిలాలయం ఒకటి ఉంది. అక్కడా శిల్ప సంపదకు కొదవలేదు. అక్కడ ఎవరో ఇద్దరు పులి జూదం ఆడుకుంటున్నారు.

"ఇక్కడ కూర్చుందామా ?''

సంధ్య పక్కనే విరిగిన రాతి స్తంభం మీద చతికిల బడ్డాడు చైతన్య. శిల్ప సుందరి ప్రాణం పోసుకుని తన పక్కన కూర్చున్నదన్న భావం అనుకోకుండా చైతన్య మదిలో మెదిలింది. సంధ్య ఒంట్లోని రక్తపు వేడి తనను తాకు తున్నట్లు ఉక్కిరి బిక్కిరయ్యాడు చైతన్య.

"అసలు విషయం చెప్పకుండా మధ్య లోనే వదిలేశాను''

"ఏమిటో ?" చైతన్య కుతూహలంగా అడిగాడు.

"అదే......నా సీరియల్ కథలోని తర్వాతి భాగం!" అట్లా అని సంధ్య నవ్వింది.

సంధ్య నవ్వు పొలాల మీద నుండి వస్తున్న పిల్ల తెమ్మెరలను సవాలు చేసి, క్షణకాలం వాటిని ఉక్కిరి బిక్కిరి చేసి నట్లనిపించింది.

''చెప్పండయితే"

"ఒక్క షరతు''

''ఏమిటది ?''

"నా పక్కన కూర్చుని నన్ను 'అండీ' అని మన్నిస్తుంటే నా ఒళ్ళంతా తేళ్ళు,

జైళ్లలూ వ్రాసుతున్నట్లుంది"

చైతన్య ముడుచుకున్న సంధ్య మొహంలోకి చూసి నవ్వాడు.

"సరే...సంధ్యా"

అట్లా ఏక వచనంలో సంబోధించిన తర్వాత ఓ క్షణ కాలం ఊపిరాడకుండా ఉక్కిరి బిక్కిరయిపోయాడు చైతన్య! ఆ ఒక్క సంబోధన మానసికంగా తనను



సంధ్యకు చాలా చేరువగా...ఇముడ్చుకోలేనంత దగ్గిరగా తీసుకు వచ్చినట్లనిపించింది.

"ఊఁ..." సంధ్య క్షణకాలం కళ్ళు మూసుకుంది. మూసుకున్న కళ్ళు చెరువులో తళుక్కుమని గిరికీలు కొట్టే చందమామ చేపల్ని గుర్తుకు తెచ్చాయి.

ఓ పాలపిట్ట ఇంద్రధనుస్సులాంటి తన రెక్కల్ని గాలిలో తాటించి ఎగురుకుంటూ పోయింది.

* * *

పెళ్లయిన తర్వాత బావ నాకు దగ్గరగా రావాలని ఎన్నోసార్లు ప్రయత్నం చేశాడు.

ఆ దినం మాకు 'శోభనం' ఏర్పాటు చేశారు.

అత్తయ్య హడావుడి పడుతూ రకరకాల ఏర్పాట్లు చేస్తోంది. ఆవిడ పనంతా కంగారంతా... హడావుడంతా ఎందుకో ఒక్క నాకూబావకూ మాత్రమే తెలుసు.

ఎంత త్వరగా నేను బావకి లొంగిపోయి నా కడుపున ఓ కాయ కాస్తే అంత తొందరగా ఈ బంధాల్నుండి బయటపడవచ్చని ఆవిడగారి తపన.

ఆవిడ్ని చూసినప్పుడల్లా నాలో అనుకోకుండా కసి కూడా మొదలయ్యేది. నాకు తెలీకుండానే నేను ముని పంటితో నా పెదమల్ని కొరుక్కునే దాన్ని.

గది చాలా అందంగా అలంకరించింది. మంచం..దానిమీద మల్లెలు, సన్నజాజులు మరువం...చుట్టూ అగరువత్తులు పూల దండలు......ఓహ్! చైతన్యా! అపుడు నాకెలాగ అనిపించిందో తెలుసా ? ఆ అలంకరణ చూస్తుంటే జాతరనాడు, మేకపిల్ల మెడకు వేపాకు దండలు, మొహాని కింత పసుపు, సాంబ్రాణీ ధూపం వేసి అమ్మవారి ముందుకు నరకడానికి తీసుకుపోతున్నట్లనిపించింది. అత్తయ్యేమో మేకపోతును పట్టుకుని ఓ చేతిలో కత్తందుకుని చుట్టూ ఉన్న వాళ్ళతో కులాసా కబుర్లు చెబుతూ నవ్వుతూ నడిచే తలారిలా అనిపించింది!

నేను గదిలోకి అడుగుపెట్టాను!

బావ సిగరెట్ త్రాగుతూ కిటికీ దగ్గిర నిలబడి ఉన్నాడు..

బయటకు చూస్తున్నవాడల్లా నా అడుగుల చప్పుడు విని వెనక్కి తిరిగాడు.

బావ మొహం చాలా ప్రశాంతంగా ఉంది. అలాంటి ప్రశాంతతా, మృదుత్వం నేనీమధ్య ఎప్పుడూ చూడలేదు. నన్ను చూడగానే సిగరెట్ బయటకు విసిరేసి, నెమ్మదిగా నా దగ్గరకు వచ్చాడు.

"రా సంధ్యా!...అట్లా కూర్చో!"

నేను బావనే గమనిస్తున్నాను. అతనిలో కలిగిన ఈ హఠాత్పరిణామాన్ని ఎట్లా అంచనా వేయాలా...అని ఆలోచిస్తూ నుంచున్నాను. బావ గొంతు సవరించుకుని సాధ్యమయినంత మార్దవంగా... నెమ్మదిగా అన్నాడు.

"సంధ్యా !" గొంతును అదుపులో పెట్టుకుంటూ అన్నాడు–

"మనకు ఇష్టమున్నా లేకపోయినా కొన్ని కొన్ని విషయాల్లో...మన పెద్దవాళ్ళ ఆలోచనలకు తల వంచక తప్పదనుకుంటాను. వాళ్ళ ఆత్మకు 'శాంతి' కలగాలంటే మనం వాళ్ళకిచ్చిన వాగ్దానాల్ని నిలబెట్టి తీరాలి" బావ భారంగానిట్టూర్చాడు. "ఇది నా అభిప్రాయం మాత్రమే! దీంతో నువ్వు ఏకీభవిస్తావనుకుంటాను"

బావ నెమ్మదిగా నా పక్కకు వచ్చి

కూర్చొని నా భుజం మీద చేయి వేశాడు! నేను తల పక్కకు తిప్పి చూస్తే ఆ చేతి వేళ్ళు నా తెల్లని బ్లౌజుమీద జలగల్లా కనిపించాయి! నా ఒళ్ళంతా చీదరగా అనిపించింది. మనసంతా అసహ్యంతో... జుగుప్సతో నిండిపోయింది.

నేను నెమ్మదిగానే ఆ చేయిని తీసి వేశాను!

"అలాగే బావా! మన కిష్టం ఉన్నా లేక పోయినా అలా చేయాలన్నావ్! బావుంది. మామయ్య పోతున్నపుడు ఆయన పడ్డ వ్యధా, నీ గురించి అనుభవించిన క్షోభా...నేనయితే మాటల్లో చెప్పలేను! నీవుగాని మామయ్యకు ఏదైనా వాగ్దానం చేసుంటే దాన్ని తప్పకుండా నిలబెట్టి తీరాలి. దానికి నా సహకారం ఎప్పుడూ ఉంటుంది"

"అంటే నీ ఉద్దేశం ఏమిటి?"

బావ గొంతులోని ఇందాకటి మార్దవం వేటగాడు పేల్చిన గుండుకు బెదిరిన లేడి పిల్లలా ఎక్కడికో ఎగిరిపోయింది.

"ఏముందీ...నీలో మార్పు రావాలి! మామయ్య నీలో ఎలాంటి మార్పు కోరుకున్నాడో అలాంటి మార్పు రావాలి"

నేను దృఢంగానే అన్నాను.

బావ అంతసేపటి దాకా అమాయకంగా చూసిన చూపులు ఇప్పుడతనిలో మచ్చుకి కూడా కనిపించడం లేదు.

బావలో అప్పుడు నాకు బలవంతంగా ప్రాణం తీసుకున్న జమునా...వీలునామా వ్యవహారం, తర్వాత క్రూరంగా మాట్లాడిన బావా కనిపించాయి. ఫలితంగా నాలో కసీ, కోపం మరి కాస్త ఎక్కువయ్యాయి.

''మనం ఇప్పుడు భార్యా భర్తలం! ఆ విషయం మర్చిపోకు. నేను నీమెడలో తాళి కట్టినవాణ్ని...జాగ్రత్త! అది కట్టిన్నాడే నీ మీద నాకు సర్వ హక్కులూ ఏర్పడ్డాయి. ఇక ముందు నీకు 'స్వంతం' అనేది ఏదీ లేదు. మంచయినా, చెడైనా అది కేవలం నాతోనే! అర్థమయిందా?''

బావ విలాసంగా కాళ్ళూపుతూ మళ్ళా సిగరెట్ వెలిగించాడు.

ఆ క్షణంలో నా మెడలోని ఆ మంగళసూత్రం ఓ పెద్ద ఇనుప రాయికి రెండు కొండ చిలువల్ని కట్టి వ్రేలాడదీసినట్లనిపించింది.

రెండు చేతులతోనూ ఆ బరువును 'పుటుక్కు'మని త్రెంపి బావ మీదికి విసిరికొడదామనుకున్నాను.

అపుడు నాలో కలిగిన ఆవేశం, కసీ, క్రోధాన్ని మాటల్లో వర్ణించి చెప్పలేను. అపుడు దాన్ని నేనెలాగ నిగ్రహించుకున్నానో కూడా నా కర్థం కాలేదు. అయితే ఒకటి మాత్రం నిజం. చిన్నతనం నుండీ ఒంటరిగా పెరగడం వల్లనేమో అదో తెగింపూ, మానసిక శక్తీ నాకు అలవడింది. దాన్నే నిగ్రహశక్తన్నా ఫర్వాలేదు. ఆ నిగ్రహశక్తి బావ మీదికి నేనేనాడు తిరగబడి రభసా చేయకుండా ఆపు చేసింది. నేను జాగ్రత్తగా ఆలోచించుకునేలా చేసింది.

ఊరికే అల్లరి చేయడం వల్ల నష్టం నాకే.

నేను నష్టపోవడమే గాక బావకు దాని వల్ల మరింత లాభం! తద్వారా 'గుంట నక్క'లాంటి అత్తయ్యకూనూ! అది జరగడానికి ససేమిరా వీల్లేదు.

ఇంతేగాక...

ముల్లును ముల్లుతోనే తీయడం మంచిది గదా! బావ నాలోని బలహీనతను ఆధారం

 

చేసుకుని నన్ను బెదిరించి లొంగ దీసుకోవాలనుకుంటున్నాడు. అది నాలోని బలహీనత కాదని బావకు అర్థమయితే చాలు.

బావ బలహీనత నాకు బాగా తెలుసు. అందుకే మామయ్య అలా నన్ను, బావనూ కలిపి ఓ ఉచ్చులో అతి జాగ్రత్తగా బిగించి మరీ వెళ్ళిపోయాడు.

"మంచిది బావగారూ! ఇప్పుడు మీరు త్త బావగారే కాదు. నా భర్తగారు కూడాను! నేను తప్పకుండా మీ కష్ట సుఖాల్లో భాగం పంచుకుంటాను. కాదని నేనన్నా నామెడలో ఈ తళ తళ మెరిసే 'మంగళ సూత్రం' ఈ సమాజం...మీ అమ్మగారూ...వీరం దరూ ఒప్పుకుంటారా?"

బావ చాలా హాయిగా, ఆనందంగా నవ్వాడు! ఆ నవ్వులో బావలోని సంతోషంకన్నా నా లొంగుబాటుమీది విజయ రేఖలే ఎక్కువగా కనిపించాయి.

"రయిట్!" క్లుప్తంగానే తన సమ్మతినీ, విజయగర్వాన్నీ పలికించి కాళ్ళు బారజాపి టీపాయ్ మీద పెట్టి సుతారంగా సజ్జెలో నుండి ఓ మల్లెపూవు అందుకుని వాసన చూస్తూ కూర్చుండి పోయాడు.

"అంతవరకు బాగానే ఉందిగానీ భర్తగారూ! 'నా' విషయంలో మాత్రం మీ ప్రమేయం ఏ మాత్రం అక్కర్లేదు మరి?"

"అంటే?"

"అహాఁ...అంటే ఏముంది? నేను మీ బానిసను. ఎందుకంటే వేటగాడు లేడి పిల్లకు ఉచ్చువేసి బిగదీసినట్లు దీన్ని మీరు నా మెడకు తగిలించారు. నేనేం కాదనడంలేదు. అంతవరకూ బాగానే ఉంది. నా మీదా, నా కష్టసుఖాలమీదా మీకు సంపూర్ణాధికారం ఉంది. కానీ..."

"కానీ..." బావ అసహనంగా పూవును నేలకేసి కొట్టాడు.

"కానీ మామయ్య రాసిన వీలునామా ఓటుందిగా! దాని ప్రకారం ఈ ఆస్తిలో, ఆదాయంలో మీకేం వాటా లేదు మరి!"

"నీదయినపుడు అది 'నాది' కాదా?" బావ చాలా కర్కశంగా అన్నాడు.

"నిజమేనండీ! కానీ దాన్ని నేను మన పెళ్ళికన్న ముందే సంపాదించుకున్నాను. కాబట్టి అది నా బానిసత్వానికి ముందటి సంపాదన. అది అప్పటి నా స్వంతం! దానిమీద మీకెలాంటి అధికారమూ లేదు. ఉండదు! ఇపుడుగాని నేనేమైనా సంపాదిస్తే మీరు తప్పకుండా దాన్ని యథేచ్ఛగా అనుభవించవచ్చు. నేనేం కాదన్నానా?"

బావ కళ్ళు అగ్నిగోళాలయ్యాయి. బావ కూడా వివేకం గలవాడే. ఏదయినా జటిలమైన సమస్య వచ్చినపుడు దాన్ని మరీ జటిలం చేయకుండా చాలా సరళంగా సులువుగా సర్దుకురాగల నేర్పుగలవాడే!

"సరేలే! నాకు నీ వెధవ ఆస్తి ఎందుకు? నీ శరీరంమీద కావలసినన్ని హక్కులున్నాయిగా! నాకు కావాల్సింది నీ శరీరమే!"

పండ్లతో పెదిమలను నొక్కిపట్టి అతి బలవంతంగా నా ఆవేశాన్ని నిగ్రహించుకున్నాను.

"కాదనను మహానుభావా! నా శరీరం మీద మీకు హక్కు లేదని ఎవరన్నారు? నా శరీరంలోని ఎముకలూ ...రక్తం...జీవ కణాలూ...మాంసం అన్నీ మీవే! ఈ పందపౌండ్ల చెత్తమీద మీకు సర్వాధికారం ఉంది. మీరు నోరు తెరిచి 'కావాలీ' అని అడగండి. ఇదిగో ఈ చేయికోసి మీకిస్తా.

కానీ నా శరీరం మీద నాకు 'అధికారం' లేదే!"

"నాన్సెన్స్ పిచ్చిగాని పట్టిందా ?" బావ లేచి ఓ అడుగు ముందుకు వేశాడు.

"వినండి మరి! నా శరీరం మీదయినా దాన్లో 'ప్రాణం' ఉంది! ఆ ప్రాణం ఉన్నంతవరకూ నామనసునది ప్రాణాల్తో నిలుపుతుంది! నా మనసు నా శరీరంమీద రాజు! దానికిష్టంలేకుండానేనేమీచేయలేను"

"దానికేం సంబంధం ?"

"అక్కడే ఉంది బావా! నువుగానీ నా ఈ ఆధీనంలో లేని శరీరాన్ని గానీ అనుభవిస్తే ఏమవుతుందో తెలుసా?"

"ఏమిటి?"

"పుటుక్కుమని మనస్సు తిరగబడుతుంది. మరి దాన్ని కాపాడే ప్రాణమే మీ ప్రాణం తీసుకుంటుంది. వెరీ సింపుల్ !"

బావ చాలా తీక్షణంగా నన్ను గుచ్చి గుచ్చి చూస్తున్నాడు. నేను ఏమాత్రం లక్ష్య పెట్టకుండా సోఫాలో కూర్చుని పైకి చూస్తున్నాను. 'దీనికి ఇంత తెలివి ఎలా వచ్చిందా ఎట్లా దీన్ని లొంగ దీయాలా ?' అని బావ ఆలోచిస్తున్నాడని నాకు తెలుసు.

"యూ క్రుకెడ్" బావ చాలా నెమ్మదిగా అన్నాడు. అని నిశ్శబ్దంగా అటు కిటికీలోనుండి బయటకు తోటలోకి చూస్తూ నించున్నాడు. బావ తన కోపాన్ని అట్లా కంట్రోలు చేసుకుంటున్నాడని నాకు తెలుసు.

"చూడు బావా ! నాతో చవకబారు ప్రయత్నాలేమీ చేయకు. నా పట్టుదలా, నా ఆత్మవిశ్వాసం నీకింకా అనుభవంలోకి రాలేదు. నా మీదేదైనా దౌర్జన్య పద్ధతులు వుపయోగించి లొంగదీసుకుందామనుకుంటున్నావేమో? బి కేర్‌ఫుల్ ! ఇంకా చాలా క్రుకెడ్‌గా, మహామొరటుగా నీకు చెబుతా. నేనేం చెప్పడానికి సిగ్గుపడను. నువు నన్ను బలవంతంగా అనుభవించి నాకో సంతానాన్ని కలిగించాలని ప్రయత్నిస్తావేమో! కాని చూడూ... ప్రపంచంలో నాకు తెలిసినన్ని, వీలయినన్ని 'అబార్షన్' పద్ధతులూపయోగించి ఆ పిండాన్ని నాశనం చేస్తాను. నాకు ఇష్టం లేకుండా అసహ్యకరమైన నీ రూపం నాలో పెరగడానికి వీల్లేదు. నీ రక్తం నా శరీరాన్ని తాకడానికి వీల్లేదు. నీ శ్వాసంటేనే నాకసహ్యం! నీ నీడను కూడా నేను సహించను! అంతకూ సాధ్యం కాకపోతే ఛస్తాను! ఎట్లానో తెలుసా? విషం మింగి...ఉరి పెట్టుకుని కాదు! జపాన్‌లో వాళ్ళు 'హరా కిరి' చేసుకుంటారే...అట్లా. నీకు దాన్ని గురించి సరిగా తెలీకపోతే వివరంగా చెబుతా ! మొండికత్తి తెచ్చి నా కడుపులో దించుకుని అట్లా విలవిల్లాడుతూ ప్రాణం విడుస్తా...చూడుమరి!"

బావ దెబ్బతిన్నట్లు నాకేసి చూశాడు. నేను ఆవేశాన్ని, ఎగశ్వాసనూ నిగ్రహించుకుంటూ కూర్చున్నాను.




సంధ్య చెప్పడం ఆపింది.

అప్పటికి చీకటి పడింది.

చల్లటిగాలి పొలాలమీద నుండి వచ్చి

గిలిగింతలు పెడుతోంది! సంధ్య చల్ల గాలి తగలకుండా పమిట చెవుల చుట్టూ చుట్టుకుంది.

గుడిలో చివరి భక్తుడు కాబోలు గంట గణ గణ మ్రోగించి వెళ్ళిపోతున్నాడు.

జూదం ఆడుకుంటున్న వాళ్ళు ఆట ఆపుచేసి గ్రామానికేసి వెళ్ళిపోయారు!

విరిగిన శిల్పాలు ... శిథిలమైన ఆకృతులు తమ మీదికి దాడి చేస్తున్న చీకటి వంక నిస్సహాయంగా చూస్తూ పడున్నాయి!

వివిధ భంగిమల్లోని ఆ శిల్ప సుందరీ మణులంతా తమ వంకే చూస్తున్నట్లనిపించింది చైతన్యకు! మనసులో ఏదో చెప్ప లేని ఉద్వేగం...నరనరానా అర్థంకాని ఆందోళన. చుట్టూ ఉన్న యుగయుగాల అందాన్ని తమలో ఇముడ్చుకున్న శిల్పాలూ, వాటి కళ్ళలోని నిర్లిప్తతా అందుకు కారణం కావచ్చు! చుట్టూ ఉన్న ప్రశాంత ప్రకృతీ...తన పక్కనే ఉన్న ఆ శిల్పాలను కవ్వించగల సజీవ శిల్ప సుందరీ, ఆమె అర్ధాంతరంగా వది లేసిన జీవితం తాలూకు భయంకరాను భూతులూ...

చైతన్య తల విదిలించి చటుక్కున లేచి నుంచున్నాడు!

"చాలా చీకటి పడిందే!"

సంధ్య మౌనంగా లేచింది.

గుడి చప్టా మీదుగా సంధ్య నడు స్తూంటే పైనుండి వంగి చూస్తున్న శిల్ప సుందరులనూ...సంధ్యనూ మార్చి మార్చి చూసుకుంటూ నడుస్తున్నాడు చైతన్య!

"అబ్బా చలి!"

"అవును ... చుట్టూ అడివిగదా ఇక్కడ కాస్త యెక్కువే!" చైతన్య నెమ్మదిగా అన్నాడు.

అడివిలో చీకటి వింతవింత ఆకారాలను సృష్టిస్తోంది!

గింగురుమని వేలకొలది కీచురాళ్ళు ఎడతెగకుండా సంగీతం పాడుతున్నాయి.

ముళ్ళ చెట్ల మీద ఎగురుతున్న మిణు గురు పురుగులు ఆకాశంలోని చుక్కలతో పోటీ పడుతున్నాయి!

చైతన్య అంతమైన... అనంతమైన ఆ దృశ్యాలకు చలించిపోయాడు!

"పైన చుక్కలు... చుట్టూ ఈ చుక్కలు. ఓహ్! చుక్కల సముద్రంలో తేలుతున్నట్లుంది!" చైతన్య తన్మ యంగా అన్నాడు.

సంధ్య మౌనంగా నవ్వి ఊరుకుంది!

గెస్ట్‌హౌస్ చేరుకున్నారు. గదిలోకి వెళ్ళగానే సంధ్య 'రివ్వు'న వస్తున్న చెరువు మీది ఈదురు గాలిని తట్టుకోవ డానికి వెంటనే తలుపులు మూసేసింది. కారియర్ విప్పి చక చక విస్తళ్ళలో వంటకాలు సర్దింది. చైతన్య చిత్రంగా కదులుతున్న సంధ్య గులాబీ రంగు వేళ్ళవంక చూస్తూ నుంచున్నాడు.

"కానీ...ఇప్పటికే ఆలస్యమయింది!"

చైతన్య భోజనం అయిందనిపించాడు! కిటికీలో నుండి చల్లటి గాలి ... చెరువు మీద నుండి తేలి వస్తున్న చలి శరీరాన్ని వణికించేస్తోంది!

"అరె... వాచర్‌తో ఇంకో మంచం వేయమని చెప్పడం మర్చిపోయాం! ఇప్పుడెట్లా!"

చైతన్య కళ్ళెత్తి సంధ్య వంక చూశాడు. కొంటెతనం ఆమెలో ఏ కోశానా కనిపించలేదు!

"పోనీ...నేను టేబిలు మీద పడు కుంటాను!"

"ఇంకా నయం! చలికి గడ్డ కట్టుకుని పోతారు!"

"మరి... ?" చైతన్యలో అలజడి తారస్థాయిని చేరుకుంది. మంచం మీద కూర్చుని సంధ్య కాళ్ళాడిస్తోంది. అపుడు చూశాడు సంధ్య కళ్ళలో మెరిసే! కవ్వింపు!

"ప్లీజ్... కం అండ్ షేర్ దిస్"

చైతన్య మెల్లిగా సంధ్య పక్కన కూర్చున్నాడు. సంధ్య పెదిమలు మెల్లిగా అదురుతున్నాయి. కళ్ళలో ఆర్ద్రత, బుగ్గలలో మెరుపుల ఆహ్వానం. చైతన్య ముందుకు ఒంగి మెల్లిగా పెదిమలను ముద్దుపెట్టుకున్నాడు.

సంధ్య మందహాసం చేసింది!

ఆ నవ్వు కొండల్నీ, అడవుల్నీ, ప్రకృతినీ, సమస్తాన్ని వెన్నెలలో ముంచి హోరెత్తించినట్లు ప్రమాన్పడిపోయాడు చైతన్య!

సంధ్య రెండు చేతులూ చైతన్య మెడ చుట్టూ వేసి మీదికి లాక్కుంది.

"ఐ లవ్ యూ!"

సంధ్య శంఖం లాంటి మెడను ముద్దుపెట్టుకుని గట్టిగా ఊపిరి తీసుకున్నాడు చైతన్య.

"ఐ టూ... ఐ టూ... !!"

* * *

"సారీ" చైతన్య నెమ్మదిగా అన్నాడు.

"ఎందుకు ?" సంధ్య ప్రశ్ననిండా కొంటెతనం... !

అపుడు సంధ్యను చూసి చైతన్య తిరిగి నెమ్మదిగా నిగ్రహం కోల్పోవడం మొదలు పెట్టాడు.

"ఎవరూ ఎవరికీ క్షమార్పణలు చెప్పుకోవలసిన అవసరం లేదు !"

సంధ్య సుతారంగా చైతన్య చేయందుకుని పక్కమీదికి లాగింది. చైతన్య మెరుస్తున్న సంధ్య పెదిమలనే చూస్తూ కూర్చున్నాడు.

"నాకిపుడు చాలా హాయిగా ఉంది!"

"ఊఁ !"

"ఆఁ..! ఇట్లా నీవు నా పక్కనుంటే నేనా 'డ్రగ్స్' జోలికి పోనసుకుంటూ !"

"అంటే..?" చైతన్య అర్థంగాక తెల్లబోయాడు.

"అంటే ఏముంది.. మీ పేషెంటు బాగుపడాలంటే మీ రెపుడూ ఇట్లాగే నా పక్కనుండాలి"- సంధ్య పలికిన పలుకుల్లో ఇంతకు ముందెప్పుడూ కనిపించని అధికారం లీలగా చైతన్యకు వినిపించింది. అనుకోకుండా చైతన్య నుదుటి మీద చెమట పట్టింది., ఓ సారి శ్వాస బలంగా విడిచి ఉక్కిరి బిక్కిరయ్యాడు !

"అదెట్లా సాధ్యం !? నాకు పెళ్ళయింది.."

"కాలేదని ఎవరన్నారు ? పెళ్ళంటే అది కేవలం ఒక ఆచారం! స్త్రీ పురుషులు స్వేచ్ఛగా తమ కోరికలుతీర్చుకో వడానికి ఒక లైసెన్సు ! నేను మాత్రం ఆ లైసెన్సు లేకుండానే బ్రతకాలంటాను. ఎందుకంటే ఈ నీతి నియమాలూ, కట్టుబాట్లూ కేవలం మనం కల్పించినవి. కానీ అవే మనకు అడ్డం రాకూడదు గదా !?"

"అడ్డం కాదు.! సమాజం సాఫీగా నడవడానికి ఏర్పాటు చేసిన కొన్ని నియమాలవి !"

"నిజమే ! ఆ దినాల్లో ఉన్న సమాజాన్ని రక్షించడానికి అవి పనికి వచ్చాయేమో ! కానీ సమాజం ఎపుడూ ఒకే విధంగా ఉండదు. అది రోజు రోజుకూ మారిపోతోంది. అట్లా మారాలి కూడా ! మరి ఈనాడు మారిపోయిన సమాజానికి అవి పనికి రాకపోవచ్చు ! ఉదాహరణకు ఒక విషయం చెబుతాను. ఒక 'లాడ్జి'లో ఓ జంట పోలీసులకు చిక్కారనుకుందాం ! అయితే వాళ్ళిద్దరూ ఖచ్చితంగా భార్యాభర్తలమని రుజువు చేయడానికి మంగళ సూత్రం సరిపోతుందా?"

"సరిపోదా?"

"అయితే ప్రతి వ్యభిచారిణీ ఓ మంగళ సూత్రాన్ని మెడలో తగిలించుకుంటే సరి ?"

సంధ్య అపుడు నవ్విన నవ్వు ఆ చల్లటి గాలిలో కూడా చాలా వేడిగా చైతన్యను తాకింది ! చైతన్య సంధ్యతో తనకు మొదటి నుండీ, పరిచయమైన నాటినుండీ రోజుల్ని వరుసగా.. మొదటి సారిగా నెమరు వేసుకుంటూ కూర్చున్నాడు.

"మాట్లాడరేం ! మీ పేషెంటు జబ్బు నయం కావడం మీకిష్టం లేదా ?"

"అదేమిటి ? అట్లా ఎందుకుంటుంది!?"

"మరయితే నేను కోరుకున్నపుడల్లా మీరు నాక్కావాలి !" సంధ్య ఛివాలున చైతన్యను ముందుకు లాక్కొని బుగ్గమీద వేడిగా ముద్దు పెట్టుకుంది.

చైతన్య ఉక్కిరి బిక్కిరయ్యాడు. కమల అట్లా చాలా సార్లు తనను ముద్దు

పెట్టుకుంది. కానీ సంధ్య వేరు.. దీన్లో ఓ మత్తు ఉంది. ఆ మత్తు సామాన్య మయింది కాదు. తనని తన వశంలో లేకుండా వివశుడ్ని చేస్తోంది !

అప్రయత్నంగా చైతన్య రెండు చేతులూ సంధ్య భుజాల మీదుగా వెనక్కి వీపు మీదికి ప్రాకి సంధ్యను గట్టిగా ముందుకు లాక్కున్నాయి. సంధ్య ఊపిరి.. శ్వాస చైతన్య మెడని కాల్చే స్తోంది.

'ఇది ప్రేమా ? మరేదన్నానా ?'

తనకింతకు ముందు స్త్రీ సాంగత్య ముంది ! కానీ ఇది వేరు.. ఇది చాలా ప్రత్యేకమైన అనుభవం !!

"అన్నట్టు తెల్లవారేసరికి నీకు అసలు విషయం చెప్పాలి!"

"ఏమిటది ?" చైతన్య పొడిగా అన్నాడు.

"అదే నీ పేషెంటు ఈ నిద్ర మాత్రల్ని అంత ప్రేమగా ఎందుకు మింగుతుందో తెలియవద్దా ?"

"చెప్పు !"

తన మీద తలానించిన చైతన్య జుట్టులోనికి మెరుస్తున్న వేళ్ళని జొనిపి, వాటిని మెల్లగా చిందర వందర చేస్తూ మొదలు పెట్టింది సంధ్య...




"బావా, నేనూ సాధ్యమైనంతవరకూ ఒకళ్ళు కొకళ్ళం తటస్థ పడకుండానే తిరుగుతున్నాం ! ఒకవేళ ఎదురయినా ఎవరో ఒకళ్ళం తప్పుకుని వెళ్ళిపోయే వాళ్ళం !

అత్తయ్యా నన్ను చూసే చూపులో నేనూహించు కోలేంతగా నా మీద కసి ఉన్నట్టు నా కనుపించేది.

ఆ రోజు

బావ చాలా మామూలుగా సోఫాలో కూర్చుని ఏదో చదువు కుంటున్నాడు. నేను సరిగ్గా గమనించ లేదేమోగానీ.. బావ ఈ మధ్య కొంచెం మారిపోయినట్లు కూడా కనిపించాడు..

ఆ సాయంకాలం పని మనిషి ఇచ్చిన పాలు త్రాగి అట్లా మంచం మీదికి ఒరిగి ఏదో వారపత్రిక తిరగేస్తున్నాను. అంతే! నాకు తెలియకుండానే నా కళ్ళు మూతలు పడిపోసాగాయి. మనసు ఎక్కడెక్కడో పిల్లిమొగ్గలు వేస్తూ గిరికీలు కొడుతోంది. మనసు నిండా ఏవో రంగులూ.. ఆకారాలూ..!

కాలు కదపబోయాను. ఊహుఁ.. కాలూ, చేయీ ఏదీ నా అధీనంలో లేదు.

ఎందుకో విరగబడి నవ్వాలని అని పించింది. కానీ.. అదీ చాతకాలేదు ! కళ్ళు తెరిచి చూడలేను.. రెప్పలమీద టన్నుల కొద్దీ బరువయిన మేకులు దిగ వేసినట్టు మగత.. మైకం !

నా మీదికి మెల్లిగా ఎవరో వంగారు.. నన్నేదో చేస్తున్నారు !

వేడి ఊపిరి నా బుగ్గలను తాకుతోంది.

ఒంటి మీద నుండి ఏదో బరబరా లాగేస్తున్నట్లు ... శరీరమంతా ఎవరి తోనో ఇమిడి పోతున్నట్లు...

నాకేం అర్థం కావడంలేదు !

నా చేతులూ..కాళ్ళూ..శరీరం మర బొమ్మలా తిరిగి పోతున్నట్లుంది.

అట్లా ఎంత కాలం గడిచిపోయిందో?

కళ్ళు మెల్లిగా విప్పి చూసేసరికి....

ఎదురుగా కనిపించింది బావ మొహం !

బావ చాలా హాయిగా...దిలాసాగా సిగరెట్ పీలుస్తూ సోఫాలో కూర్చుని కాళ్ళాడిస్తున్నాడు !

నా కళ్ళు గోడ గడియారం వేపు మెల్లిగా తిరిగాయి.

అయిదు గంటలు...ఉదయం అయిదు గంటలు!!

అంటే...

అంటే నేను రాత్రి తొమ్మిది గంటల నుండీ మగతగా పడుకునే ఉన్నానన్న మాట.

హఠాత్తుగా నా శరీరాన్ని పరిశీలించి చూసుకున్నాను. చీర అస్తవ్యస్తంగా ఉంది.

జాకెట్టుగానీ..బ్రాగానీ లేవు !

ఒళ్ళంతా ఒకటే నొప్పులు,..

బుగ్గలు భగ్గుమని మండిపోతున్నాయి. పెదిమలు చిట్లి ముక్కలయిపోయినట్లు ఒకటే బాధ!!

"మైడియర్ సంధ్యా ! ఇంత కాలం నుండీ నేను ఎదురు చూసిన ఆనందాన్ని, నువ్వు దాచిపెట్టిన ఆనందాన్ని రాత్రంతా తనివితీరా అనుభవించాను ! కానీ..''

నా గుండెలు..శరీరం భగభగ మండి పోతున్నాయి !

"కానీ నువు పూర్తిగా స్పృహలో ఉండి నాతో సహకరించి ఉన్నట్లయితే ఆ ఆనందం నిజంగా అద్భుతంగా ఉండి ఉండేది గదా''




నేను బలమంతా కూడదీసుకుని ఉమ్మి వేశాను.

"టేకిట్ ఈజీ! ఇదిగో నీ బ్రా.. జాకెట్టు..ఈ బ్రా మన ఈ ఆనందకర మైన రాత్రికి, మధురమైన అనుభవానికి తీపి గుర్తుగా ఉండనీ !"

జాకెట్టు నామీదకు విసిరేశాడు !

నేను దుప్పటితో ఒళ్ళంతా దాచుకుని నిస్సహాయంగా చూస్తూ పడుకున్నాను !

"నా దగ్గిర దాచుకోడానికి నీ దగ్గరేమీ లేదింకా ! నీ శరీరంలోని ప్రతి అవ యవమూ నా స్పర్శతో పులకరించి పోయింది ! థేంక్యూ ! ఇవాళ్టి నా విజయా నికి భారీ ఎత్తున విందు చేయాలి ! వస్తా!"

బావ బయటకు వెళ్ళిపోయాడు.

తల దిమ్మింకా వదలలేదు.

మెల్లిగా లేచి వణుకుతున్న చేతులతో జాకెట్టు తొడుక్కొని చీర చుట్టుకున్నాను.

ఉదయపు గాలి గులాబీ చెట్లమీద నుండి పరవశించిపోయేలా కిటికీలగుండా గదిలోకి పరుగెత్తుకొస్తోంది !

అద్దంలో నా మొహం నాకే వింతగా ఉంది !

కళ్ళన్నీ ఎర్రబడి ఉన్నాయి.

ఓ నాలుగేండ్లు నా మీదికి దాడిచేసి నట్లుగా శరీరమంతా వదలిపోయి ఉంది!

కసిగా పండ్లు కొరికాను ! నా మనసంతా లావాలా కుతకుత ఉడికి పోతోంది.

నా శరీరాన్ని చూసుకుంటే నాకే చచ్చేటంత వెగటూ..ఏవగింపూ కలుగు తున్నాయి !

ఈ శరీరాన్ని భరిస్తూ ఎట్లా గడపడం?

ఎలాగో స్నానం చేశాను. శరీరం కాస్త తేలికయినట్లనిపించింది ! కానీ మనసులోని ఉడుకు ఏమాత్రం దిగలేదు.

అది వటుడిలా పెరిగిపోతోంది.. కసీ, బరువూ పెరిగి పెరిగి నా మనసునీ, హృదయాన్నీ పూర్తిగా ఆక్రమించేశాయి!

రోజులా అత్తయ్య 'టిఫిన్' పెట్టినప్పుడు ఎప్పటిలా మామూలుగానే ఉంది!

ఈ నీచపు 'రహస్యాన్ని' నాలోనే దాచుకోవాలి! అట్లా దాన్ని దాచుకుని క్రమంగా దాన్ని గురించి ఆలోచించడం మానేసి దాన్ని మరిచిపోవాలి! దాన్ని పూర్తిగా మనసు నుండి తొలగించే ప్రయత్నం చేయాలి!

గదిలో కూర్చుని భవిష్యత్ కార్యక్రమం గురించి చాలా దీర్ఘంగా ఆలోచించాను!

ఫలితంగా నాకు కొన్ని మార్గాలు కనిపించాయి! అందులో మొదటిది నేను చావడం! దానివల్ల నా 'కసి' తీరడం మాట అట్లా ఉంచి,. నన్ను అట్లా లొంగదీసుకున్న బావకే ఎక్కువ లాభం! అట్లా నా 'చావు' వల్ల బావ లాభపడడం నా కెంత మాత్రం ఇష్టంలేదు.

చివరికి ఒక నిర్ణయానికి వచ్చాను!

ఆ దినం సాయంత్రం మా ఫామిలీ డాక్టరు మూర్తిగారి దగ్గరకు పోయాను. అసలు జరిగిన విషయాన్ని వివరంగా చెప్పలేదుగానీ..నాకు ఇపుడిపుడే పిల్లల వసరంలేదనీ..ఒకవేళ అలాంటి సూచనలు గానీ నాలో కనబడితే 'అబార్షన్' చేయాల్సుంటుందనీ చెప్పాను!

"ష్యూర్! చాలా సంవత్సరాల నుండీ మీ కుటుంబ క్షేమం..మీ క్షేమం కోరుతున్నవాణ్ని! ఒక విధంగా మీరు నాకు ఆప్తులు..చెప్పండి..ఎన్నో నెల?"

నేను మాట్లాడలేదు!

ఆయన అర్థం చేసుకున్నట్లుగా నవ్వాడు. "ఆల్ రైట్.. సెకండ్ మంత్‌లో రండి! తప్పకుండా చేద్దాం!" అన్నాడు.

తేలికపడ్డ మనసుతో బయటబడ్డాను.

కారు ఇంటిముందాపి, తలుపు తెరుచుకుని క్రిందికి దిగాను.

ఇల్లంతా కోలాహలంగా.. సందడిగా ఉంది. అంతా గందరగోళం! హాల్లోనుండి కప్పు లేచిపోయేలా అత్తయ్య విపరీతంగా ఏడుస్తోంది. నౌకర్లు తలో మూలనచేరి నోట్లో గుడ్డలు కుక్కుకుని కుళ్ళి కుళ్ళి ఏడుస్తున్నారు. నాకేం అర్థం కాలేదు.

"ఏమయింది?" ఆత్రంగా అడిగాను నేను.

"బాబుగారు.. చినబాబుగారు మనకిక లేరు!"

నేను వింటూ లోపలికి పోయాను.

కారు ఏక్సిడెంటులో తుక్కు తుక్కయి గుర్తుపట్టడానిక్కూడా వీల్లేకుండా బావ శరీరం అక్కడ హాల్లో ఉంది. మొహమంతా చిందరవందరగా చితికిపోయింది. శరీరం నిండా రక్తం గడ్డలు కట్టిపోయింది.

గడచిన రాత్రంతా నన్ను స్పృహలో లేకుండా చేసి మగతలోకి నెట్టివేసిన మనిషి....

రాత్రంతా నన్ను నా ఇష్టం లేకుండా రబ్బరు బొమ్మలా.. తన ఇష్టమొచ్చినట్లు త్రిప్పి అనుభవించిన శరీరం... కానీ, నాలో దుఃఖం పొంగి కట్టలు త్రెంచుకుని బయట పడలేదు!

అట్లా అని ప్రతీకారం జరిగిందన్న తృప్తీ మిగలలేదు! నిర్వికారంగా జరుగుతున్న కార్యక్రమాలన్నిటినీ చూస్తూ ఊరుకున్నాను.

తర్వాత నేను నెల తప్పాను. నా అనుమానం నిజమే అయింది! నాలో

ఆనాటి విష స్పందనలూ...స్పర్శలూ... అవి పెరగడానికి వీల్లేదు.....ఆ ఊహ వస్తేనే నా కడుపులో ఎర్రగా కాలుతున్న అగ్నిగోళం బుసలు కొడుతున్నట్లని పిస్తుంది!

డాక్టరు మూర్తిగారి దగ్గరకు వెంటనే పోవాలి!

ఆ రకం తాలూకు అనుభవాన్ని ఎంత తొందరగా వీలయితే అంత తొంద రగా బయటకు తరిమేస్తేనే నాకు మన శ్శాంతి!

"ఆగమ్మా!"

బయటకు అడుగు పెట్టబోయిన నేను అత్తయ్య మాటవిని ఆగి వెనక్కి తిరిగి చూశాను!

మెట్లమీద అత్తయ్య నిలబడి ఉంది! ఊరికే కాదు.. రెండు చేతులూ జోడించి, నాకు నమస్కారం పెడుతోంది. ఆవిడ కళ్ళనుండి జలజలా నీళ్ళు పారిపోయిన ఆ బుగ్గల మీద ధారలుగా కారిపో తున్నాయి.

ఈ మధ్య కాలంలో మానసిక వ్యధ వలన కావచ్చు. అత్తయ్య బాగా కృంగి పోయింది. అదనంగా ఓ పాతికేళ్ళు మీద పడినట్లు మనిషి బాగా కృంగిపోయింది. అంతకుముందు మామూలుగా కనిపించే ఆవిడలోని అహంకారం..అభిజాత్యం... గయ్యాళితనం ఎక్కడికి ఎగిరిపోయాయో నాకర్థం కాలేదు!

"అమ్మా సంధ్యా! నాకంతా తెలుసు! వాడు నా రక్తం పంచుకుపుట్టిన కొడు కయినా నిజం చెబుతున్నాను. వాడివలన నీ మనస్సెంత దెబ్బతిన్నదో... నీ జీవితమెంత నాశనం అయిందో నాకు తెలుసు! ఆ దినం నువ్వు తాగిన పాలల్లో నిద్రమాత్రలు కలిపింది నేనే! తప్పంతా నాదే! ఎంత కాలం మీరిట్లా ఎడమొహం.. పెడమొహంగా ఉంటారు! ఎంత కాలం మీరిట్లా ఆగర్భశత్రువుల్లా కాపురం చేస్తా రని మధనపడ్డాను. నాకీ ఆస్తిమీద ఏ మాత్రం మమకారం లేదు! నీ కడుపున ఓ కాయకాస్తే చూసి తరించాలని అట్లా చేశానమ్మా! నీ కడుపులో వాడి రూపం పెరుగుతుందని అసహ్యపడకు. పెద్ద దాన్నయినా చేతులెత్తి నీకు నమస్కారం పెడతాను. వాడెట్లాగూ పోయాడు. కనీసం వాడి ప్రతిరూపాన్నయినా నీలో చూడనీ.. నాకు నువు తప్ప ఇంకెవ రున్నారు చెప్పు!"

నేను ప్రమాన్పడిపోయి వింటూ నుంచు న్నాను!

"నీ కసి తీరకపోతే.. అదుగో ఆ తుపాకీతో నన్ను కాల్చిపడెయ్! అంతే గానీ..."

నేను మరేం మాట్లాడకుండా వెనక్కి తిరిగాను. ఆ క్షణంలో నా మనస్సు అలా ఎందుకు ఎదురు తెరిగిందో నాకెంత మాత్రం అర్థం కాలేదు!

ముసలి అత్తయ్య మీద జాలా! కాదు గాక కాదు! బహుశా మామయ్య గుర్తుకు వచ్చి అలా అత్తయ్య మాటల్ని మన్నించి ఉంటాను!

తర్వాత డాలీ పుట్టింది. అది పుట్టిన కొద్ది రోజులకే అత్తయ్య కన్నుమూసింది. అపుడు అత్తయ్య నాతో అన్నమాటలు నాకు ఇప్పటికీ గుర్తున్నాయి.

"సంధ్యా! నీలో ఇంకా ఏమయినా ఈర్ష్య మిగిలుంటే దాన్ని వెంటనే చంపెయ్! ఎందుకంటే అది తెప్పించే కోపం మనల్నేం చేస్తుందో తెలియదు! నేను నిన్ను చూసి ఎందుకు ఈర్ష్య పడ్డాను? చివరికి ఏం సాధించాను? నీ




కడుపున పుట్టిన గుడ్డులో వాడ్ని, వాడి గుణాల్ని చూడకు.. నన్నూ... మీ మామయ్యనీ చూడు.''

తర్వాత నేను ఒంటరి దాన్నయ్యాను! డాలీని చూసినప్పుడల్లా తప్పకుండా బావ నాకు గుర్తుకు వచ్చేవాడు..

బావ అంత ఘోరంగా.. అసహ్యంగా ప్రవర్తించడానికి కారణం.. అతనికి చట్టబద్ధంగా నా శరీరం మీద లభించిన అధికారమేగదా? మరి ఆ అధికారం అతనికెలా వచ్చిందంటే.. ఇదుగో నా ఈ మెడలో కట్టిన ఈ త్రాడు దాన్నిచ్చింది. అందుకే దాన్ని చాలా పదిలంగా దాచి ఉంచాను. నా భయంకరమైన ఆ 'అనుభవాన్ని' జ్ఞాపకాలనూ మరిచిపోవడానికి 'డ్రగ్స్' అలవాటు చేసుకున్నాను. ఎందుకంటే నా వ్యక్తిత్వం, నా మనసూ నాశనమయింది.

ఆ మత్తులోనే...

సంధ్య చెబుతున్న మాటలకు చైతన్య అడ్డం వచ్చాడు.

"మరి అంతగా అసహ్యించుకునే ఆ మత్తు నీకెందుకు?"

"అదే చిత్రం. ఆ మత్తులోనే నాకు కసి పెరుగుతుంది. అలా కసి పెరిగి నా మనసును కమ్ముకున్నప్పుడు నాక్కాస్త మనశ్శాంతి దొరుకుతుంది."

"లాభం లేదు"

"ఏమిటి?"

''నా వైద్యం.మంచి 'సైకోథెరపిస్టు'ను సంప్రదించటం మంచిది"

సంధ్య ఎర్రబడ్డ కళ్ళతో చైతన్యను చూసింది. "అంటే నాకు 'పిచ్చనా' నీ ఉద్దేశం?"

"అబ్బెబ్బే అలా అని నేననలేదు. నీ వ్యవహారం అలా ఉంది"

"నాకు మిగిలింది కేవలం ఆనాటి ఘోరమైన అనుభవం. నాకు ప్రియమైన డాలీ. అది లేకపోతే ఎప్పుడో ఆ అనుభవాన్నీ, జీవితాన్నీ శాశ్వతంగా సమాధి చేసేదాన్ని."




''బాగా అలసిపోయి నట్టున్నారు" కమల మామూలుగా అంది. చైతన్య కళ్ళు పైకెత్తి సూటిగా కమల కళ్ళలోకి చూడలేకపోయాడు.

''పేషంట్లకు చాలా సీరియస్‌గా ఉందా?''

చైతన్య మాటలాడబోయిన గొంతును బలవంతంగా నిగ్రహించుకున్నాడు.

ఆ ప్రశ్న తనని సమాధానం ఆశించి అడిగినట్లు లేదని స్పష్టంగానే తెలిసిపోతోంది.

అలా అడిగినపుడు కమల కళ్ళల్లో కనిపించిన నిరసన భావాన్ని చూసి చైతన్య ఖంగు తిన్నాడు. దాన్ని కప్పిపుచ్చుకోవడానికి మొహాన్ని ముడుచుకుని సీరియస్‌గా కూర్చున్నాడు. అయితే మరో క్షణంలో కమల సన్నగా మందహాసం చేసి ముడిపడ్డ కనుబొమ్మలను విప్పి చూడగానే కాస్త తమాయించుకున్నాడు.

''చాలారోజుల తర్వాత మీతో హాస్యమాడాలనిపిస్తోంది. ఏమీ అనుకోవుగా?"

కమల నవ్వుతూనే అడిగింది.

కానీ, కమల కళ్ళలో 'నువ్వు నన్నేమీ అనలేవు. నా ఇష్టం. ఓ పేళ నువ్వన్నా నేను లెక్క చేసేదాన్ని కాను. అయ్ డోంట్ కేర్' అన్న చూపులు కనుపించాయి.

చైతన్య నెమ్మదిగా ఊపిరి పీల్చుకున్నాడు.

'గిల్టీ కాంషస్' చాలా చెడ్డదీ, భయంకరమయిందీ. మనం తప్పు చేసినపుడు ఎదటివాడు ఛడామడా నాలుగు దులిపి ఊరుకుంటే మన మనసులోని బరువు అంతా తగ్గిపోయి ప్రశాంతంగా,నిర్మలంగా ఉంటుంది. అలా కాకపోతే ప్రతి నిమిషం 'అపరాధ భావన' మనల్ని విడిచిపోకుండా వెన్ను మీద ములుకు పోట్లు పొడుస్తూనే ఉంటుంది.

తన పరిస్థితి మరీ ఘోరం. తాను తప్పు చేస్తున్నానని తనకు తెలుసు. అలా అని కమలకూ తెలుసు. కమలకి తెలుసనీ తాను తెలుసుకున్నాడు. అంతవరకూ



సవ్యంగానే ఉంది. అయితే కమల మాత్రం ఇంకో మెట్టు పైకెక్కి తనకేమీ తెలియనట్లు, తనేమీ ఎరగనట్లు మాటలాడుతోంది. ఫలితంగా తన గుండె తూట్లు పడిపోతోంది.



"నేనేమయినా ఎందుకనుకుంటానూ.? పైగా హాస్యమేనంటున్నావ్‌గా..." చైతన్య తెచ్చికోలు నవ్వుతో అన్నాడు.

"ఏమీలేదు గానీ సీరియస్‌గా ఉన్నది మీ పేషంట్లకా ? మీకా ?"

చైతన్య ఉలిక్కి పడలేదు. బలవంతపు నవ్వును తెచ్చుకుని అసందర్భంగా.. వ్యర్థంగా ఓ నవ్వు నవ్వి ఊరుకున్నాడు.

"పేషంట్లకయితే మీకు బాధ. మీకే అయితే నాకు బాధ"

ఎన్నడూ లేనిది కమల కాసేపు కూని రాగం తీసింది.

మంచం మీద దిండు కానుకుని వ్రేలాడేసిన కాళ్ళను పైకీ క్రిందకీ ఆడించింది కాసేపు. కమల కాళ్ళు తెల్లగా మెరుస్తున్నాయి.

కూనిరాగం ఆపు చేసి కాస్త దిండు మీది నుండి లేచి తల ముందుకు చాచి అంది—"అది సరే. మీరుత్తి యం. బి. బి. యస్సే అనుకున్నాను."

"కాదామరి ?" చైతన్య అయోమయంగా అన్నాడు.

"ఏమో... నాకు తెలీకుండా హోమియో, యూనానీ కూడా నేర్చుకున్నారా ఏమిటి?"

"చాల్పాల్లే" చైతన్య విసుక్కున్నాడు.

"ఎందుకు మీకంత చికాకు? మీకు ప్రకృతి వైద్యం గురించి కూడా బాగా తెలుసని నాకు తెలీదు. అంటే ఇంతకు ముందు తెలియదు. మరి ఇపుడెలా తెలిసిందంటారా?"

"ఏమిటా అర్థం పర్థం లేని మాటలు ?"

కమల కళ్ళలో నిరసనా, అధిక్యతా, ఏవగింపూ ఓ త్రిప్రకాలంకనిపించి మాయమయ్యాయి.

"అయ్యో" ఎక్కడయినా హాస్యానికి అర్థం ఉంటుందాండీ ? అర్థం ఉంటే అది హాస్యమెలాగవుతుందీ ? గుడి అనేది కేవలం శిల్పాలకికాదు... ప్రకృతి చికిత్సలకూ.. మానసిక రోగాలకూ మంచి నివారణా కేంద్రం అని నాకిమధ్యే తెలిసింది."

చైతన్య మొహానికి పట్టిన చెమట తుడుచుకున్నాడు. ఫ్యాను ఎంత స్పీడుగా తిరుగుతున్నా గదిలో భరింపరాని ఉక్క పోస్తోంది. కమల తనకు తోచినట్లు ఛడామడా తనని అని ఊరుకుంటే ఎంత బాగుండేది?

అయినా తాను అనవసరంగా తొందర పడగూడదు. ఈ సమస్యను వీలయినంత సామరస్యంగా దాటవేయడం మంచిది.

''పోనీ కమలా! ఎందుకొచ్చిన వాదన! కాస్త కాఫీ కలిపివ్వు తలంతా దిమ్ముగా ఉంది!"

కమల మనోహరంగా నవ్వింది. తర్వాత లేచి లోపలికి పోయింది.

చైతన్య తనకు దొరికిన ఆ ఒక్క నిమిషంలో కాస్త తేరుకున్నాడు.

నిమిషం తర్వాత కమల చేతిలో ప్లేటునిండా స్వీట్లు తెచ్చి టీపాయ్ మీద పెట్టింది.

"ఇవన్నీ ఏమిటి!"

"స్వీట్లు!"

"అదే..ప్రత్యేకత ఏమిటీ అని?'' చైతన్య పొడిపొడిగా అన్నాడు.

"ఏముందీ..మీరేమో ఇల్లు పట్టినట్లు పేషంట్లను వెంటేసుకుని తిరగండే! నేనొక్కదాన్నీ..?"

కమల మాట్లాడ్డం ఆపి అదో పెద్ద





జోకయినట్లు పొట్ట పట్టుకుని పొర్లి పొర్లి నవ్వింది. మంచం మీద దిండు నానుకుని జారగిలబడి అలుపు వచ్చేదాకా నవ్వింది.

చైతన్య మౌనంగా... సహనంగా కమలనే చూస్తూ కూర్చున్నాడు.

రెండు నిమిషాల తర్వాత కమల నవ్వాపింది.

"తినండి! అన్నట్లు మంచినీళ్ళు తేవడం మర్చేపోయాను!"

కమల లోపలికి గబగబపోయి పెద్ద గ్లాసు నిండా మంచినీళ్ళు తెచ్చి పెట్టింది.

"ఏంలేదూ ...... మిమ్మల్నెవరయినా మనసులో తలచుకొంటూ ఉంటే పొలమారి పోయేను మీకు!"

మళ్ళీ కమల తెరలు తెరలుగా నవ్వింది. నవ్వీనవ్వీ కమల కండ్ల వెంబడి రెండు కన్నీటి చుక్కలు బుగ్గలమీదికి జారాయి!

"అది సర్లేగానీ...విషయం ఏమిటో చెప్పనేలేదు!" చైతన్య ఓపిగ్గా అడిగాడు.

"ఏముందీ...నిన్న సాయంత్రం మా తమ్ముడు వచ్చాడు."

"ఓహో..అలాగా!" చైతన్య యధాలాపంగా అన్నాడు.

"మరేం చేయను! రోజంతా కబుర్లు చెబుతూ కూర్చున్నాడు. మిమ్మల్ని చాలాసార్లు గుర్తుచేశాడు.ప్చ్! ఏం చేయను.. మీరు లేరుగా!"

"మీ తమ్ముడు రావడమే గొప్ప విశేషమా ?'' చైతన్య స్వీటుముక్క కొరుకుతూ మామూలుగా అన్నాడు.

"ఉత్తగానే అయితే మీరన్నదే కరెక్టు! కానీ..వాడు అతి త్వరలోనే మామ కాబోతున్నాడే?"

"అలాగా!"

అయిదు నిమిషాల తర్వాతగానీ చైతన్య బుర్ర చకచకమని పనిచేయలేదు. విషయం ఏమిటో అర్థం అయిం తర్వాత ఉక్కిరి బిక్కిరయిపోయి కాసిని మంచి నీళ్ళు త్రాగి తేరుకున్నాడు.

"నెమ్మది డాక్టరుగారూ...నెమ్మది!"

"ఇన్నాళ్ళనుండి నాకెందుకు చెప్పలేదు. యూ..!"

చైతన్య హఠాత్తుగా ముందుకు ఒంగి కమల పెదిమల మీద మృదువుగా ముద్దు పెట్టుకున్నాడు.

"చెబుదామనే అనుకుంటున్నాను!"

కమల పెదిమల చివర్లు అందంగా కదిలాయి. చైతన్య క్షణ కాలం కమలను తేరిపార జూశాడు. కమలలో ఓ క్షణం క్రితం వరకూ కనిపించిన చిలిపితనం ఇపుడెందుకో కనిపించడంలేదు.

"మీవాడు మామయ్య అవుతాడన్న మాట! వెరీగుడ్ బావుంది!"

"సలేలెండి...ఇక హాస్యాన్ని వది లేద్దాం!"

చైతన్య ఊపిరి బిగబట్టి కమలనే చూస్తున్నాడు.

"ఇదిగో..ఇట్లారండి.''

చైతన్య మారు మాట్లాడకుండా కమల వెంబడి లేచాడు. కమల డ్రెస్సింగ్ టేబిలు ముందు నిలబడింది. కమల ప్రక్కనే నుంచున్న చైతన్య ప్రతిబింబాన్ని అద్దంలో చూస్తూ నెమ్మదిగా అంది-

"చూశారా. అద్దంలో కనిపించేవి మన ప్రతిరూపాలు. బొమ్మలు..! అవి మిథ్యా బింబాలు అని చిన్నపుడు మా సైన్సు టీచరు చెప్పేవాడు. మనం ఇక్కడి నుండి కదిలిన మరు క్షణం అవి చటుక్కున మాయమైపోతాయి. కానీ మనం..."

చివాలున కమల వెనక్కి తిరిగింది.



చైతన్య ఉలిక్కి పడ్డాడు.

కమల చైతన్య కళ్ళలోకి సూటిగా... దీక్షగా చూస్తోంది.

హిప్నాటిజం చేసే హిప్నటిస్టులా... కమల చూపులు చైతన్య కళ్ళని చీల్చుకుని సూటిగా మెదడులోకి చొచ్చుకు పోయినట్లుగా కదలకుండా, మెదలకుండా చేసిపారేశాయి.

"అదిమిథ్య. ఇదిశాశ్వతం. ఇదుగో.."

కమల మరబొమ్మలా..తన తెల్లని పొడవాటి చేతులతో మెడలోని మంగళసూత్రాన్ని ముందుకు చాచి పట్టుకుంది.

"చూశారా! ఇదేమిటనుకున్నారు? ఇది ఎవరికీ ఎవరంకాని మన ఇద్దర్నీ ఒకటి చేసింది. ఇది లేకపోతే మీకు నా శరీరం మీద గానీ మనసు మీదగానీ ఎలాంటి అధికారమూ ఉండేది కాదు. నాకూ అంతే! మీ బాగోగులూ, మంచి చెడ్డలూ చూడాల్సిన అవసరమే ఉండేదికాదు! అందుకనే మహానుభావా! మీరు దీన్ని నా మెడలో కట్టిండి. అదీ నా యెదలో కట్టిన బంధం. అట్లా కట్టిపడేశాను. అర్థమయిందా?"

పెళ్ళయిందగ్గర్నుండీ కమలెప్పుడూ అంత సేపు తనతో ఆ విధంగా మాట్లాడ లేదు.

అసలు కమలది ఎక్కువగా మాట్లాడే స్వభావం కాదు. అహం, దర్పం సదా ఆమెలో ఉంటాయి కాబట్టి తన కను పాపల, కనుబొమ్మల కదలికతోనే తన భావాలను చాలా చక్కగా పలి కించేది!

చైతన్య తత్తర పడ్డాడు!

తన ముందున్న కమల హఠాత్తుగా మహోన్నతంగా పెరిగిపోయినట్లు,సినిమా ట్రిక్ ఫొటోగ్రఫీలా తాను కమలముందు భూమి మీదకు అంగుష్ఠ మాత్రానికి కుంచించుకు పోతున్నట్లు ఫీలయ్యాడు! కదలకుండా అట్లాగే నుంచున్నాడు. చివరికి హీన స్వరంతో గొంతు పెగుల్చు కుని అన్నాడు–

"ఈ రోజు చాలా విషయాలు మాట్లా డుతున్నావే?"

"నిన్న మా తమ్ముడు స్నేహితు లతో రామప్ప పిక్నిక్‌కు వెళ్ళాడుట. దూరాన్నుండి మిమ్మల్ని చూసి పలకరించ బోయి ఊరుకున్నాడట"

"ఎందుకు?" అనాలోచితంగా అన్నాడు చైతన్య.

కమల కళ్ళెత్తి చూసింది. ఆ కళ్ళలో క్షణకాలం అసహ్యం, దారుణమైన ఏవ గింపు 'తళుక్కు'మని మెరిసిపోయాయి. మరుక్షణమే 'ఎందుకో తెలియదా? ఛీ!' అన్న నిరసన భావం కూడా వ్యక్తమ యింది. చైతన్య మాట్లాడకుండా వెనక్కి తిరిగి వచ్చి మంచం మీదికి ఒరిగాడు.

కమల ఎప్పుడు వచ్చి పక్కన కూర్చుందో కూడా చైతన్య గమనించ లేదు.




"ఏమిటి అట్లా ఉన్నావే?"

చైతన్య తలెత్తి సంధ్య కళ్ళలోకి చూశాడు. ఆ రెండు కళ్ళ మధ్యా తనక్కావలసిన శాంతి స్థిరనివాసం

ఏర్పాటు చేసుకున్నట్లనిపించింది.-

"ఏమీలేదు!''

"లేదు చెప్పాలి!"

చైతన్య బూట్లు విప్పి ఫోం బెడ్‌మీద వెల్లకిలా పడుకున్నాడు. ఎక్కడో దూరంగా మామిడి చెట్లమీద కోయిల రెండు సార్లు కూసి ఊరుకుంది.

"నొసలు ముడి పడ్డాయీ అంటే మెదడు చాలా తీవ్రంగా పని చేస్తోందన్న మాట!" సంధ్య చేయి చైతన్య నుదుటిని చల్లగా తాకి హాయనిపింపజేసింది.

"అవును. మెదడు ఆలోచించకుండా ఉన్నా బావుండేది!"

సంధ్య నవ్వి ఊరుకుంది.

చైతన్య హఠాత్తుగా పక్కకు ఒత్తిగిలి సంధ్య చేతిని తన చేతిలోకి తీసుకున్నాడు.

"చూడు సంధ్యా! మా ఆవిడకు ఆయ్ మీన్ కమల.. సారీ ఎట్లా చెప్పాలో అర్థం కావడంలేదు... మనం... మన విషయం..అంటే మన స్నేహం ఊహు(" చైతన్య ఇంకేం మాట్లాడలేక ఊరుకున్నాడు.

అపుడు సంధ్య నవ్విన నవ్వు ఏ మాత్రం మధురంగా మనోహరంగా లేదని చైతన్య అపుడు గుర్తించలేక పోయాడు.

"కనీసం ఒక విషయాన్ని సరిగ్గా చెప్పలేక పోయావు! పైగా బాగా చదువుకున్నవాడివి! తెలివిగలవాడివి. పిచ్చివాడా! మన మూర్ఖులు ఏర్పాటు చేసిన ఈ పిచ్చి బంధనాలూ, ఆచారాలూ, వ్యవహారాలూ, కట్టుబాట్లూ నిన్ను ఎంతగా కుదించుకుపోయేలా, ఖైదీలా, చాతకాని వాడిలా చేశాయోచూడు! నువ్వు కనీసం ధైర్యంగా నీ భార్య ముందు నాతో నీకున్న సంబంధాన్ని గురించి చెప్పలేక పోయావే? ఎందుకు? నీ నోరునొక్కిందెవరు? నేనా? ఇంకెవరన్నా నా?? నీ కిష్టమైన దోవలో ఒక్క అంగుళమైనా నిన్ను ముందుకు కదలకుండా చేసినదెవరు? 'అవునూ నాకూ, ఆవిడకూ శారీరక 'సంబంధం'ఉంది. ఇది నా ఇష్టం' అని స్వేచ్ఛగా నిష్కల్మషంగా ఎందుకు చెప్పలేక పోతున్నావు?''

చైతన్య విస్మయంగా సంధ్య వంకే చూస్తూ పడుకున్నాడు.

"మరి నా కలాంటి బిడియం, సిగ్గూ, లజ్జాలేవు! ఎందుకంటే నేను ఏ మూర్ఖపు ఆచారానికి బలి పశువును కాలేదు గనక.అన్నట్టు చైతన్యా! అసలు నీక్కావల్సిందేమిటో నువు తేల్చుకోగలవా?"

"నాక్కావల్సిందేమిటి ?"

"అదే...నేను కావాలా? నీ భార్య కావాలా? పోనీ నేనూ, నీ భార్యా ఇద్దరం కావాలా ?"

"ఇదేం ప్రశ్న?"

"అదంతే! ఇద్దరిలో ఏ ఒక్కరు కావాలన్న రెండోవారిని ఖచ్చితంగా త్యాగం చేయాలి! లేక ఇద్దరూ కావాలనుకుంటే ఖచ్చితంగా నువ్వు త్యాగం కావాలి"

చైతన్య నవ్వాడు.

"ఇద్దరిలో ఒకరిని త్యాగం చేయడం అంటే అర్థం ఉంది గానీ నేను త్యాగం కావడం ఏమిటి? అరవ తెలుగు లాగా... నాన్సెన్స్ అది ఎట్లా సాధ్యం?" మళ్ళా నవ్వాడు.

సంధ్య ఓపిగ్గా అంది.-"అది కాదండీ బాబూ! మీరు త్యాగం కావడం అంటే మీ 'క్వాలిటీస్'ని కొన్నింటినిదయచేసితగ్గించు

కోవడమన్నమాట. అవేవిటో తర్వాత వివరంగా చెబుతానుగానీ ముందు నా మొదటి ప్రశ్నకు జవాబు చెప్పు. నేను కావాలా...లేక నీ భార్య కావాలా ? లేక.."

"నా కిద్దరూ కావాలి !"

"మంచిది" మామూలుగా -అన్నా సంధ్య కంఠం ఒణికింది. తలంటు పోసు కున్న ఆవిడ వెంట్రుకలు ఓసారి గాలిలో అగ్నికీలల్లాగా అల్లల్లాడాయి.

"మంచిది! అట్లా అయితే నువు నీలో ఆత్మాభిమానం, రోషం, కోపం, అధి కారం, అహంకారం ఇంకా ఇలాంటి కొన్నివుంటాయిగా ...... వాటన్నింటికీ విడాకులిచ్చేయాలి!"

చైతన్య ఎర్రబడిన మొహంతో సంధ్యను చూస్తూ పంటితో క్రింది పెది మను నొక్కిపట్టి మెరుస్తున్న సంధ్య మొహం వంకే చూస్తూ కూర్చున్నాడు.

నవ్వబోయిన సంధ్య ఆగింది.

"అది సరే... ఒక్కసారే అంత సీరియస్ అయిపోయావేం ?"

"లేక నన్నో ఫూల్‌ని చేద్దామనుకుం టున్నావా?" తర్వాత మాటలను వెదు క్కుంటూ చైతన్య ఊరుకున్నాడు.

"నేనెవర్నీ ఫూల్ చేయడం లేదు. అవసరమూ లేదు. ఉన్న విషయాన్ని ఉన్నట్లుగా చెప్పానంతే !"

"ఏమిటది? వివరంగా చెప్పరాదూ ?"

"తెలియదా ఏమిటి? నీకిద్దరూ కావాలి. బాగుంది. నువు నీ భార్యతో కలిసుంటే నేనేం అభ్యంతరం చెప్పను. ఎందుకంటే నేను మొదటే నా తత్వం గురించి చెప్పాను. నేనీ సాంప్రదాయక బంధాల్ని లెక్క చెయ్యను. నాక్కావలసిందాంతోనే నాకు పని. అంతవరకే నేను ఆలోచించేది. నేను సెంటిమెంటల్ ఫూల్‌ని కాదు. మరి నీ మిసెస్ సంగతేమిటి? నేను నీతో పాలు పంచుకుంటున్నానంటే...అట్లా అనితెలిస్తే ఆవిడ సహించి ఊరుకుంటుందా? అంత సహనమూ, ఓపికా ఆవిడలో ఉన్నాయా? మరి లేనపుడు నీ పరిస్థితి ఏమిటి? నా నుండీ, నా వైపునుండీ నీకెలాంటి బాధ కలగకపోవచ్చు. ఆవిడ నీ వ్యక్తిత్వాన్నీ, పరువునూ నిలబెట్టి, నీ అహంకారాన్ని పదిలంగా కాపాడుతుందా ? అపుడు నీ సంగతేమిటని అట్లా చెప్పానంతే. అంతే గానీ వేరే ఉద్దేశంతో నేనేం చెప్పలేదు"

చైతన్య క్షణకాలం దిమ్మెరపోయి తర్వాత నెమ్మదిగా తేరుకున్నాడు. ఓ సారి గుర్తున్నంతవరకూ ఓపిగ్గా సంధ్య అన్న మాటలన్నింటినీ నెమరువేసు కున్నాడు.

నిజమే!

తనకు ఉద్రేకం రావాల్సిన అవసరం లేదు. ఆవేశపడాల్సిన అవసరం అంత కన్నా లేదు!

చైతన్య నెమ్మదిగా లేచి సంధ్య దగ్గ రగా వచ్చాడు. సంధ్య రెండు భుజాలనూ పట్టుకుని తనవేపు త్రిప్పుకున్నాడు.

"అయాంసారీ! నువ్వింతగా ఆవేశంగా మాట్లాడతావనుకోలేదు.. రియల్లీ సారీ!"

సంధ్య కళ్ళతో నవ్వింది.

"ఆల్ రైట్!"

అపుడు వీచిన గాలికి సంధ్య వెంట్రు కలు గాలిలో అలల్లా తేలియాడాయి.

* * *

"కమలా"

"ఊఁ"

"నువ్వంటే నాకు చాలా ఇష్టం."




చైతన్య అలా అన్న తర్వాత అంత అబద్ధం ఆడినందుకు గజగజమని తనలోనే వణికి పోయాడు.

"అయితే!"

"ఏమీలేదు.. నేనూ... నేను...!" చైతన్య ఆ వణుకులో...ఆ అలజడిలో.. భావోద్వేగంతో ఎటూ తోచక కొట్టు మిట్టాడాడు: తికమక పడి ఏమీ మాట్లాడ లేక ఊరుకున్నాడు.

అపుడు కమల చైతన్య వంక చూసిన చూపు వర్ణనాతీతం. కమల కళ్లు ఎన్నడూ చూడని విధంగా.. బయట పడని విధంగా..అపుడు వెలిగిపోయాయి. ఆవిడ అహంకారం.. దర్పం... గత వైభవం.. వంశ గౌరవంలోని ప్రతిష్టా భావం.. అన్నీ...అన్నీ ఓసారి తళుక్కు మని మెరిశాయి.

ఓ నిమిషం నిశ్శబ్దం అక్కడ రాజ్యం చేసినతర్వాత కమల నెమ్మదిగా అంది-

"చెప్పండి: ఏం చెప్పదలుచుకున్నారో సూటిగా చెప్పండి: డొంకతిరుగుళ్ళంటే నాకు పరమ అసహ్యం!" మొదటి వాక్యం నోటితో చెప్పి రెండో వాక్యాన్ని కేవలం కనుబొమ్మల.. పెదవి విరుపులతోనే చైతన్యకు చెప్పింది.

చైతన్య మాట్లాడలేదు. తాను అతి భయంకరమైన సముద్రపు తుఫానులో చిక్కుకున్నట్లు.. వాటి తాకిడికి తాళ లేనట్లు ఊరుకొన్నాడు. ఆ ఆందోళనా.. అలజడీ.. దిక్కుతోచని పరిస్థితిలో ఒకే ఒక ఆశా నక్షత్రం.. దూరంగా వినీలా కాశంలో.. మేఘాల నల్లని కారు చీకట్లను చీల్చుకుని వేగుచుక్కలా తనను చూసి నవ్వుతున్నట్లు..

సంధ్య.

అంతే..

"నాకు తెలుసు.. మీరు లేకపోతే నేనేం అవుతాననికదూ మీరడగ బోయింది. అంతేనా? నాకు తెలుసు. నన్నేంకమ్మంటారు? అసలు నేనేం అవుతా నని మీ ఉద్దేశం ?''

చైతన్య ఒక్కసారిగా కుంచించుకు పోయాడు. దిగులుపడ్డాడు. తన మీద తనే జాలిపడ్డాడు.

కమల అస్తిత్వం ఆ కొద్ది క్షణాల కిందటే కుంచించుకుపోయిందని చైతన్య గ్రహించలేక పోయాడు. చైతన్య కపుడు తాను సంధ్య భుజాలను పట్టుకుని తనవేపు త్రిప్పుకున్నపుడు కలిగిన అను భూతి తప్ప ఇంకేం జ్ఞాపకం లేదు.

చదువు... సంస్కారం.. చైతన్యం.. వివేకం.. వీటికి చెప్పిన అర్థాలు ఈనాటివి కావు.

* * *

"సంధ్యా!"

"ఊఁ"

... ...

చైతన్య చేతులు ముందుకు చాచాడు.

సంధ్య చాలా మామూలుగా చైతన్య చేతులందుకుని, అతని వేళ్ళను నిమురుతూ కూర్చుంది. దూరంగా ఎక్కడో 'అల్సేషియన్ డాగ్' ఒకటే మొరుగుడు. దాని భౌ... భౌ... శబ్దాలు వినడానికి చాలా సొంపుగా, లయబద్ధంగా ఉన్నాయి.

"సంధ్యా"

"యస్"

"ఇవాళ ఏదయినా డ్రగ్ వేసు కున్నావా?"

చైతన్యలోని డాక్టరుగాక చైతన్యే మామూలుగా ప్రశ్నించినట్లుంది అ అడిగిన తీరు.

"ఆఁ!"

సంధ్య గలగల నవ్వినపుడు చుట్టూ ప్రవహిస్తున్న జీవన స్రవంతి ఓసారి ఆగి రెప్పలేసి తిరిగి ముందుకు సాగింది.

"ఏమిటి?"

దానికి బదులుగా సంధ్య మానస సరోవరం మీద హంసల రెక్కల మీద కురిసిన మంచులా దరహాసం చేసింది.

"డ్రగ్" సంధ్య అర్ధనిమీలిత నేత్రాలతో అంది.

చైతన్య ముందుకు వంగి సంధ్య పెదిమలను గాఢంగా చుంబించాడు.



చైతన్యలో ప్రవహించే స్రవంతి.. పోటీపడి వురుకలెత్తి ఒడ్డు ఒరుసుకుని పారిందా క్షణంలో.

"అయిందా?!"

"ఏమిటీ?" చైతన్య ముందడిగాడు.

"ఏమిటి?" సంధ్య తిరిగి ఎదురు ప్రశ్న వేసినపుడు చైతన్య సంస్కారం మూగబోయింది.

సంధ్య... సంధ్య... సంధ్య!

చైతన్య చైతన్యం క్షణకాలం కాదు.. చాలా కాలంగా మూగబోయినట్లయింది.

* * *

"కమలా"



"ఊఁ"

"కమలా."

"ఊఁ"

చైతన్య ఏం మాట్లాడలేదు. కమల చైతన్య వంక నీరసంగా చూసింది.

"కమలా... కమలా."

"ఊఁ... ఊఁ."

"నీకేమయినా బాధుందా?"

"ఏం బాధ?"

డాక్టరు చైతన్య ఏమీ మాట్లాడలేక కొట్టుమిట్టాడాడు ఆ ఒక్క క్షణం.

"నా ప్రాణప్రదమైన కమలా..."

"ఉష్. ఎవరేనా వింటే నవ్వుతారు."

అంత నీరసంలోనూ కమల నవ్వింది. కమలలో ఈమధ్య అంతులేని, కానరాని మార్పు. ఆ మార్పును చైతన్య గ్రహించలేకపోయాడు.

దానికారణం...?

* * *

"చైతన్యా!"

"యస్!"

"డియర్!"

"యస్!"

"నాదో కోరిక."

"ఏమిటో?"

"తీరుస్తావా?"

చైతన్య తటపటాయించలేదు.

"ప్లీజ్! నాతోబాటు నువ్వీ 'డ్రగ్' తీసుకో."

"వాట్ ! ? ?"

చైతన్య వివేకం గంగవెర్రులెత్తిపోయింది.

"చైతన్యా! నేను కావాలి. నా అందమైన శరీరం కావాలి. నా పెదిమలు... పక్షోజాలు... నా..నా నా... సర్వస్వం కావాలి. నా... అవసరం లేదు."

చైతన్య అపుడు సంధ్యను చూశాడు! సంధ్య పమిట జారిపోయింది.. వక్షోజాలు చంద్రుణ్ణి సవాలు చేస్తూ చైతన్యనే చూస్తున్నాయి. సంధ్య పెదిమలు తేనెలూరుతూ చైతన్యనూరిస్తున్నాయి.

"కానీ.. కానీ.."

"కానీ లెందుకు ? నా అవసరం నీకవసరమా ? లేదా ?"

"అవసరమే" చైతన్య సంస్కారం అపుడు తడబడింది. గొంతు కూడా తడబడింది. చైతన్య అట్లా అచేతనుడై గ్రీకు శిల్పం లాంటి సంధ్యను చూస్తూ కూర్చుండిపోయాడు.

చైతన్య మొదటి సారిగా సంధ్య చేతిలో నుండి ఓ టాబ్లెటు తీసుకుని మింగాడు.మంచినీళ్ళకు బదులు విస్కీ. అందులో ఏమీ కలపకుండానే త్రాగాడు.

తర్వాత..

తర్వాత?

చైతన్య సంధ్యను తన చేతుల్లోకి తీసుకున్నాడు.

అంతే !

ఆ తర్వాత ఇంటికి ఎట్లా వచ్చాడో చైతన్యకే తెలీదు.

"సంధ్యా!"

కమల తలుపు తీసింది. తీసి సన్నగా నవ్వింది.

ఆవిడ కళ్ళు కారు కోసం., సంధ్య కోసం నిస్పృహగా వెదికాయి.

"సంధ్యా"

"నేను సంధ్యను కాను!"

చైతన్య కండ్లు తుడుచు కున్నాడు. లాభంలేదు.

ఎక్కడా.. ఎక్కడ చూసినా సంధ్యే కనిపిస్తోంది. సంధ్యది విశ్వరూపం!





మొత్తం...ప్రపంచం మొత్తం... సంధ్య !!

పలవరిస్తూనే చైతన్య కమల ఒడిలోనే చాలా సేపు నిద్రపోయాడు.

* * *

అదీ కారణం.

కమల బలహీనంగా నవ్వింది.

"కమలా !"

"ఊఁ"

"కమలా"

"ఊఁ"

చైతన్యకు అంతకన్నా ఎక్కువ మాట్లాడడానికి సిగ్గనిపించింది.

తనలో వివేకం లోపించింది.

అందుకే తాను కమలతో సరిగా మాట్లాడలేదు.

ఎందుకు లోపించింది?

కారణం ??

సంధ్య మీది ప్రేమా !

సంధ్య మీది జాలా ?

ఎవరికి ప్రేమ ? ఎందుకు జాలి ??

* * *

"నేను మా యింటికి పోతాను!" కమల నీరసంగా అంది.

"ఎందుకో !" చైతన్య అర్థం పర్థం లేని నవ్వోటి నవ్వాడు.

కమల కళ్ళెత్తి చూసింది. క్రింది పెదిమను ముని పంటితో నొక్కి పెట్టింది.

"నేను పోవాలను కుంటున్నాను. నన్ను వద్దంటావా ? ఆపగలవా ?" అన్న ప్రశ్న చాలా స్పష్టంగా కనిపించిందా చూపులో.

చైతన్య తడబడ్డాడు.

"సరే... నీ ఇష్టం"

అక్కడ ఎక్కువ సేపు నుంచోలేక చైతన్య వెనక్కు తిరిగాడు.

, కమల వెనక నుండి నవ్వింది. ముందు చాలా మృదువుగా... పిల్లగాలిలో పావురాల రెక్కల నుండి ఈకలు రాలి మెత్తగా నేలను తాకుతున్నట్లు.

తర్వాత క్షణం ఆగి తిరిగి నవ్వింది.

ఈసారి చాలా పెద్దగా అగ్నిపర్వతం ఒక్కసారిగా బ్రద్దలయి తనలోని లావాను, దుమ్మునూ, ధూళినీ, గంధకాన్ని విరజిమ్మినపుడు దాన్నుండి లేచిన గాఢమైన నల్లని విష మేఘం 'గప్పు'మని శబ్దం చేసినట్టు నవ్వింది!

* * *

"అట్లా ఉన్నావేం?"

"ఎట్లా?"

"అద్దంలో ఓ సారి చూసుకుంటే నీకే తెలుస్తుంది!"

"మరీ అంత ఘోరంగా ఉన్నానా? ఉండనూ. మొన్న నాకు నువ్విచ్చిన 'డోస్'తో అట్లా అయిపోయాను."

"అసలు 'డోస్' అది కాదుగానీ... క్లినిక్ అసలే తెరవడం లేదు"

"ఆఁ.." చైతన్య చాలా తేలిగ్గా చప్పరించేశాడు.

సంధ్య ఓ క్షణం సందేహించి తర్వాత ధైర్యం చేసి నెమ్మదిగా అంది.

"ఏమైనా ఫైనాన్షియల్ అడ్జస్టుమెంటు గురించా."

చైతన్య ఆశ్చర్యంగా తలెత్తి సంధ్య వంక చూశాడు.

"నో...అలాంటిదేమీలేదు. నేనుచదువుకున్న నా చదువును మరచిపోకుండా దానివల్ల రోజుకి ఏ ఒక్కరికైనా ఉపయోగం కలిగితే చాలని మాత్రమే

ప్రాక్టీసు చేస్తున్నాను. దట్సాల్.''

సంధ్య ఓ రెండు నిమిషాలు మౌనంగా ఉండి తర్వాత అడిగింది.

"అంటే... మీ మిసెస్...''

"ప్లీజ్ ! ఆ విషయాన్నంతటితో వదిలెయ్ సంధ్యా'' చైతన్య ముందుకు ఒంగి సంధ్య గులాబీరంగు చెక్కిళ్ళమీద చిన్నగా ముద్దు పెట్టుకున్నాడు.

"ఇంకో డోసివ్వనా?''

"అలాంటి వంద డోస్‌లకన్నా అత్యంత శక్తివంతమైన 'డోస్' ఇదుగో, ఇక్కడ వుంది సంధ్యా''




''నిన్న మీతో సరదాగా అలా మాటలాడాను''

చైతన్య చాలా జాగ్రత్తగా మాటలాడాలని నిర్ణయించుకున్నాడు.

''ఏ విషయం''

''అదే...నేను మా ఇంటికి ఓ సారి పోయొస్తానని అన్న విషయం''

''ఏమయిందిపుడు?''

''ఏమీలేదు. నేనోసారి పోయిరావాలన్నానంతే''

సరే అనాలో, వద్దనాలో తేల్చుకోలేక సిగరెట్ విసిరేసే నెపంతో కిటికీ దగ్గరకు పోయి నిలబడి బయటకు చీకట్లోకి చూస్తూ నుంచున్నాడు.

ఓ రెండు నిమిషాలవరకూ వెనక్కి తిరిగి కమల మొహంలోకి చూడడానికి భయం వేసింది. ఆ రెండు నిమిషాలూ కమల ఏమీ మాటలాడలేదు.

ఆ నిశ్శబ్దం గడ్డకట్టి ఆ గదినంతా నింపేసినట్లు ఊపిరాడక ఉక్కిరి బిక్కిరయిపోతున్నట్లు అనిపించింది చైతన్యకు.

ధైర్యం చేసి నెమ్మదిగా వెనక్కి తిరిగాడు.

కమల కళ్లు తన వీపునే ఇంతసేపట్నుంచీ గుచ్చి చూస్తున్నాయి.

ఇతకు ముందులా అవి కమల నోటితో చెప్పలేని భావాలను తమలో కదలనీయడం లేదు. ఆ రెండు కళ్ళూ భాద్రపద మాసంలో పూర్తిగా నిండి, పొర్లి ప్రవహింపబోయే తటాకాల్లా ఉన్నాయి.

ఇంతకాలం ఎలాంటి సన్నివేశాన్ని, సందర్భాన్నయినా చిన్న పెదిమల చివరి నవ్వుతో 'ఢీ'కొన్న కమల కళ్ళలో అలా నీళ్లు తిరగడం చాలా అసహజంగా, కృతకంగా తోచింది.

చైతన్య ముందుకి ఒంగి కమల పక్కనే దిండు మీద కూర్చున్నాడు. కమల నెమ్మదిగా చైతన్య చేయందుకుని తన రెండు చేతుల మధ్య అదిమి పట్టుకుని ఊర్కుంది. ఆమె కళ్ళనుండి కారుతున్న వెచ్చని నీళ్లు బొట్లు బొట్లుగా రాలి చైతన్య చేతులమీద పడుతున్నాయి.

"ఊర్కో"

"మీకో మాట చెప్పాలి."

''ఏమిటది?''

"ఏమీలేదు. మీరంటే నాకు చాలా ప్రేమ. అది పుస్తకాల్లో.. సినిమాల్లో.. వ్రాసే.. చూపే ప్రేమకాదు. మీరు నాకు భర్తకాబట్టి, నా మెడలో తాళికట్టిన




వాదు కాబట్టి పుట్టిన ప్రేమ. ఏ నియమం కట్టుబాటూ లేని విచ్చలవిడి ప్రేమ నాకనవసరం. దానికో హద్దుండాలి. ఈ మంగళ సూత్రం అలాంటి ప్రేమకు హద్దులు పెట్టి, అదుపులోపెట్టి అన్యాయంగా.. కానీ మీకు దీని మీద నమ్మకం లేదు.అందుకే.. నా మీద మీకు ప్రేమ తగ్గిపోయింది కదూ?''

''అదేంకాదు'' తడబడ్డాడు చైతన్య.

''అబద్ధం. ధైర్యం లేని పనులు చేసినపుడు కనీసం మాట్లాడకుండా ఊర్కుంటే రెండో తప్పు చేయనివారవుతారు. పోనీండి. మీ మీద ప్రేమ ఉండబట్టి ఇన్ని మాటలు మాట్లాడుతున్నాను. రేపు నేను పోయిన తర్వాత తెలుస్తుంది.''

"అవేం మాటలు. ఊర్కో. ''

"అదేమిటి? మనుష్యులు అస్సలు చావరని మీ చదువులో, శాస్త్రంలో చెప్పారా? మీకు చెప్పిందల్లా కేవలం మనిషిని చావునుండి మరికాస దూరంగా లాక్కుపోయేంతవరకే గదా!"

చైతన్య నిస్తబ్దంగా ఉండిపోయాడు.

తానింత కాలం నుండీ కమలకు ఋణపడి ఉన్నవానిలా..తక్కువ వాడిననే ఓ 'కాంప్లెక్స్'తో మాత్రమే ఆలోచించాడు.

కానీ...

కమలది ఎంత లోతైన హృదయం.

చైతన్యకు కళ్ళ వెంబడి నీళ్లు ఉబికి వచ్చాయి.

* * *

"సంధ్యా!"

"ఊ.''

కమలకు ఒంట్లో బాగోలేదు."

"అలాగా!"

సంధ్య చిరునవ్వు ఓసారి గాలిలో తేలి చల్లగా తాకింది.

"నెలలు నిండాయేమో...అందులోనూ నువ్వు డాక్టరువి..నీకు నాకన్నా ఎక్కువ తెలియాలి. పోనీ..ఓసారి వాళ్ళ పుట్టింటికి పంపించగూడదూ?"

చైతన్య యాంత్రికంగా చూశాడు.

ఆడవాళ్ళ ఆలోచనలు దాదాపు అందరివీ ఒకేలా ఉంటాయేమిటి? అయినా కమలకూ, సంధ్యకూ ఒక్క విషయంలో పోలిక ఉంది. భూగోళానికి ఉత్తర ధృవం ఒకరయితే దక్షిణ ధృవం మరొకరు.

అయినా ఇద్దరిలో ప్రధాన భేదం కూడా ఒకటుంది. ఆ మెదళ్ళు రెండూ ఏనాడూ ఒక్కతీరుగా ఆలోచించలేదు. ఇప్పుడు తప్ప.

ఇది విచిత్రమే..

అపుడే నౌకరు గబగబా వచ్చాడు.

"డాక్టరుగారూ..మీకు ఫోను.."

"వాట్ !?"

చైతన్య డ్రాయింగ్ రూంలోకి గబగబా పోయి టేబిలు మీది ఫోనందుకున్నాడు.

"హలో..చైతన్య హియర్."

''అయాం డాక్టరు గౌరీ స్పీకింగ్."

చైతన్య ఒక్కసారిగా షాకయ్యాడు.

గౌరి ఆ పట్టణంలో బాగా పేరున్న పెద్ద లీడింగ్ లేడీ డాక్టరు.

అందుకు కాదు–

తాను ఇక్కడ ఉన్నట్లు ఆవిడకెలా తెలిసి ఫోన్ చేసింది?

''అర్జంట్. దయచేసి వెంటనే నా క్లినిక్‌కు రండి"

"అలాగే వస్తాను. ఏమిటి విషయం?"

అవతల నుండి లైను 'కట్' అయిపో యింది.




చైతన్య డాక్టర్ గౌరి వంక బేలగా చూశాడు. ఆమె కమలను పరీక్ష చేయడం ముగించి బేసిన్‌లో చేతులు కడుక్కొని వచ్చి టవల్‌తో తుడుచుకుని కూర్చుంది.

ఆవిడ తనను మానసికంగా హింసించాలనే ఆ మౌనాన్ని అట్లా పొడిగిస్తోందని పించి చైతన్య అసహనంగా కుర్చీలో అటూ ఇటూ కదులుతూ కూర్చున్నాడు.

"డాక్టర్!" నిశ్శబ్దాన్ని భరించలేక చైతన్య దాన్ని త్రుంచేశాడు.

"యస్...డాక్టర్" గౌరి చాలా మామూలుగా అంది.

''వాటీజ్ ద కంప్లెయింట్?"

"మీకేం తెలియదా?''

చైతన్య తల విదిలించాడు. లేచి ఓసారి కమల 'పల్స్' చూశాడు. చాలా బలహీనంగా ఉన్నాయి. చెంపలు, నుదురు తాకి చూశాడు. శ్వాస దీర్ఘంగా పీల్చి వదులుతోంది.

"డియర్ డాక్టర్! స్టెత్‌తో గానీ, ఎక్కా మీటర్‌తో గానీ మీరామె జబ్బును కనుక్కోలేరు'' గౌరి నవ్వుతూ అంది.

"వాట్..వాటీజ్ ది కంప్లెంట్?"

"ఆవిడ జబ్బును కనుక్కోవాలంటే ఇదుగో..దీంతోగానీ..దీంతోగాని మాత్రమే సాధ్యమవుతుంది" గౌరి ఓసారి గుండె దగ్గిరా..తర్వాత నుదుటి మీదా కొట్టుకుని చూపించింది.

చైతన్య ఊరికే అట్లా నోరు వెళ్ళబెట్టి కూర్చుండి పోయాడు.

"ఆవిడ మానసికంగా బాగా దెబ్బ తిన్నట్లుంది"
గౌరి నెమ్మదిగా అంది.

అమె కళ్ళల్లోకి చూడలేక కళ్లు దించుకున్నాడు చైతన్య.

ఓ క్షణం నిశ్శబ్దంగా గడిచిపోయింది.

"మన మామూలు డ్రగ్స్‌తో ఆవిణ్ని తిరిగి నార్మల్ కండిషన్‌కు తీసుకు వస్తామని నాకేం నమ్మకం లేదు. మీరు పెర్సనల్‌గా తీసుకోనంటే నేను కొన్ని ప్రశ్నలడిగేదా?"

చైతన్య లేచి కమల దగ్గరకు రాబోయాడు. గౌరి కుడిచేతో వారించింది.

"అవసరం లేదు. నేనామెకు డాక్టరుగా చేయగలిగిందంతా చేశాను. ఇంకెవరూ చేసేదేం లేదిప్పుడు"

చైతన్య చెమట తుడుచుకుని కుర్చీలో తిరిగి కూలబడ్డాడు.

"చూడండి చైతన్యగారూ! మన సమాజం చాలా 'రిజిడ్'. దానిక్కారణాలను మనం త్రవ్వుకోవాలంటే చాలా చాలా వెనక్కి తిరిగి చూసుకోవాల్సుంటుంది. ఇది ఎంత రిజిడ్ సొసైటీ అంటే... ఆ హద్దులనూ, కట్టుబాట్లనూ దాటి ఒక అడుగు ముందుకు వేస్తే అది కాటేసి తీరుతుంది.

"సరే! సమాజం గొడవవొదిలేయండి. పర్సనల్‌గా ఒక కుటుంబ వ్యవహారాన్ని పరిశీలిద్దాం. ముందుగా నేను ఆడవాళ్ళను గురించి ఒకటి రెండు విషయాలు మాట్లాడతాను.ఆడది ఎంత చదువుకున్నా,




ఎంత నేర్పరితనంగా జీవితాన్ని సాగించా లనే ఆలోచన కలిగినదైనా-తన మొగుడు పరాయి ఆడదానితో సంసారిక జీవితాన్ని పంచుకోవడానికి అస్సలు ఒప్పుకోదు. ముస్లింలాంటి కొన్ని మతాల వాళ్ళ ఆచారాలూ, వ్యవహారాలూ మనకనవ సరం. దానికి వాళ్లు తరతరాలుగా అతుక్కుపోయి ఉన్నారు. మరి మన 'హిందూ' సమాజం అలా కాదే!

"సరే! ఇక మగవాడి విషయం తీసుకుందాం. కోప్పడకండి డాక్టరుగారూ! మీ ఆవిడే గనుక మరొకరి పక్కలో చేరితే మీరు సహించగలరా?"

చైతన్య కళ్ళు ఎర్రబడ్డాయి. ఓసారి తీక్షణంగా చూసి తల విదిలించాడు!

"నో!" చైతన్య ఆ ఒక్క మాటను చాలా కర్కశంగా అన్నాడు.

"కాదా మరి! మీకు మీ మిసెస్ వేరే వాళ్ళతో ప్రేమను పంచుకోడం ఇష్టం లేనప్పుడు, మరి మీరు ఇతర స్త్రీతో ప్రేమ'ను పంచుకొంటానంటే మీ భార్య ఎట్లా సహించి ఊరుకుంటుందనుకున్నారు? మీరు ఒక రూలూ, ఆమె కింకో రూలూ ఉండడంలో అర్థం ఏమిటి? మీకున్న ప్రత్యేక అర్హతలు ఏవైనా అలాంటి అవకాశాన్ని మీకు కలగజేశాయా? బాగా ఆలోచించండి. ఇంకో విషయం! ఇదింకా జాగ్రత్తగా ఆలోచించాల్సింది.ఏమిటంటే.. ఆర్థికంగా బలహీనంగా ఉండి మొగుడు విదిలించే ఎంగిలి మెతుకులమీద ఆధార పడే ఆడదాని విషయం వేరు! మొగుడు తనకింత మేత వేస్తున్నాడు కాబట్టి మనసునూ, ఆలోచనలనూ, స్వతంత్ర భావాలనూ చంపుకొని అడుగులకు మడుగులొత్తితే వత్తవచ్చు. మరి మీ కమల విషయం అలాకాదే! ఆవిడ దయా దాక్షిణ్యాల మీద మీరు చదువుకున్నారు. ఏ రకంగా చూసినా ఆర్థికంగా ఆవిడ మీకన్నా ఎన్నో రెట్లు పైనుంది. ఒక్క చదువులో తప్ప"

గౌరి మాట్లాడ్డం ఆపుచేసి, చైతన్యను చూసి భారంగా నిట్టూర్చింది. చైతన్య మెదడులో వేల అగ్నిపర్వతాలు ప్రేలి ఒకదానితో ఒకటి 'ఢీ' కొంటున్నాయి. చివరికి కంఠం పెగిల్చుకుని నెమ్మదిగా అన్నాడు.

"ఈ విషయాలన్నీ కమలే చెప్పిందా?"

"ఎవరు చెప్పినా విషయం మారదు గదా! కాబట్టి మీరు డాక్టరుగా కాక ఓ మంచి మనిషిగా, చదువుకున్న హృదయ మున్న 'మంచి భర్త'గా కమలను ఓదా ర్చండి! క్షమించమని అడగమని నేను చెప్పను. అట్లా అని సలహా కూడా ఇవ్వను. మీ భార్య బ్రతకాలంటే అట్లాంటి 'ట్రీట్‌మెంటు' కావాలి.

చైతన్య గుడ్లప్పగించి చూస్తూ కూర్చు న్నాడు.

ఒక్కసారి సంధ్యా తెల్లటి పావురాల రెక్కల చప్పుడు లాంటి గలగల నవ్వూ, గాలిలో తేలియాడే దరహాసం గుర్తుకు వచ్చి తల విదిలించాడు!

"ప్లీజ్...కనీసం ఓ ఆపదలో ఉన్న పేషంటుకు 'ట్రీట్‌మెంటు' చేస్తున్నాననను కుని చేయండి!"

ఈ మాటలని గౌరి చైతన్యను వదిలేసి చరచరా అక్కడినుండి బయటకు వెళ్ళిపోయింది.

అర్థగంట గడిచింది.

చైతన్య కమలవంక దీర్ఘంగా చూస్తూ కూర్చున్నాడు. కమల కళ్లూ, కను

మీద కృశించిపోయిన నవ్వోటి క్షణకాలం కనిపించి మాయమయింది!

"ఎప్పుడొచ్చారు ?"

"ఇపుడే కమలా! నీ ఒంట్లో ఎలా ఉంది?"

"నాకేం... బాగానే ఉంది?" అలా అని తర్వాత కమల కళ్లు మళ్ళా మూసుకుంది.

"నాదో చిన్న కోరిక!" కమల కళ్ళు మూసుకునే అంది.

"ఏమిటది?"

"నేను మూర్ఖురాలిని కావచ్చు! కానీ

రెప్పలూ బలహీనంగా విప్పుకున్నాయి. జీవం లేనట్లు పైకప్పు వంక ఓసారి చూసి తిరిగి మూసుకున్నాయి.

"కమలా !" చైతన్య చాలా మృదువుగా పిలిచి కమల చెంపలమీద నెమ్మదిగా నిమిరాడు. కమల కనుగుడ్లు తిప్పి చైతన్య వంక చూసింది!

ఎండిపోయి పాలిపోయిన పెదిమల

నాకో ప్రమాణం చేయండి!"

"ఏమిటది? చెప్పు కమలా!"

"నేనుగానీ ఛస్తే మీరు తిరిగి పెళ్ళి చేసుకో కూడదు."

"అవేం మాటలు?" చైతన్య బుర్రగిర్రున తిరిగింది.

"అదంతే." కమల పెదిమల

విపర్లలో.. కనుకొలుకుల్లో కనిపించిన భావాలు చూసి చైతన్య హడలిపోయాడు. వాటిల్లో తిరిగి మొట్టమొదటి రోజుల్లోని అహంభావం, గంభీరతా.. పెద్దరికం, పర్వం.. తనని శాసించే అధికారం.. అన్నీ..అన్నీ క్షణకాలం కలగాపులగంగా కనిపించాయి!

"ఎందుకో చెప్పనా? ఎవరి మెళ్ళో పడితే దాని మెళ్లో మంగళసూత్రాలు కట్టడానికేమేం ఉత్తి దారప్పోగులుకావు! నా సెంటిమెంటు నాది. అంతే! అలా అని ప్రామిస్ చేయండి"

చైతన్య యాంత్రికంగా కమల చేతిని పట్టుకుని ఊరుకున్నాడు.

రెండు గంటల తర్వాత కమలకు ఆ సీరసంలోనే.. నిస్సత్తువలోనే గజగజ వణుకు ప్రారంభమయింది. గొంతులో నుండి సన్నని మూలుగు, గురకలాంటి శబ్దం. చైతన్య నాడి చూశాడు.. ఒళ్లు కాల్చిన ఇనుప ముక్కలా మండి పోతోంది!

"డాక్టర్! డాక్టర్!"
డాక్టర్ గౌరి లోపలికి వచ్చింది.
"యూనో...!"
"యస్"
"అబార్షన్!"
"యస్"
"నాకు సాయం చేయగలరా?"
"సారీ నా వల్లకాదు"

"అయితే దయచేసి బయట ఉండండి"
చైతన్య బయటకు వచ్చి సిగరెట్టు షీద సిగరెట్టు పీలుస్తూ కూర్చున్నాడు!
అయితే-




విపరీతమైన రక్త స్రావంవల్ల కమల తెల్లవారు ఝామున చనిపోయింది!




"కమల పోయింది"
"విచారంగా ఉందా?"
"ఉండదా"
"ఊఁ.. పోవడం ప్రకృతి సహజం.. అది వేదాంతం! అయితే పోయిన వాళ్ళని గుర్తు చేసుకుని బాధ పడడం గొప్ప ఆనందం!"
"ఆనందమా!?"
"మరి ఏ జ్ఞాపకాలూ లేని మోడు జీవితాన్ని ఆనందకరమైన జీవితమని అనాలా? సాధారణంగా సుఖాల్ని చాలా తొందరగా మర్చిపోతాం మనం! కానీ... దుఃఖాల్నీ... బాధల్నీ అలాకాదు. అది ముల్లులా మన మనసును కెలుకుతూంటేనే ఆనందం!"

ఈ వితండ వాదాన్ని పట్టించుకోకుండా చైతన్య కిటికీలో నుండి బయట తోట లోని పారిజాతపు చెట్లను చూస్తూ నుంచు న్నాడు. వాటి మధ్యన అల్లిబిల్లిగా అల్లిన ఓ చిన్న గూటి అంచున వాలిన ఓ పసుపు పిట్ట తన ఎర్ర బారిన నోటిని ముందుకు జాపి లోపల నోరు తెరిచిన కూనలకు ఏదో తినపెడుతోంది!

అప్రయత్నంగా చైతన్య కళ్ళ నుండి రెండు కన్నీటి చుక్కలు జారిపడ్డాయి!

సృష్టిలో ప్రేమ...అనురాగం.. ఎన్ని

రకాలు? పుట్టిన ప్రతిజీవి ప్రేమనూ, అనురాగాన్నీ, ఆప్యాయతనూ కోరుకోవడం ఎంత ప్రకృతి సహజమైన విషయం! దానిలో ఎంత స్వార్థం నిండి ఉంది! ఎంతంటే...ఈ ప్రకృతినంతా ప్రేమించి తాదాత్మ్యం పొందగలిగినంత!!

కానీ...

అంతటి విశాలమైన మనసును ఎక్కడి నుండి పొందాలీ...

అయినా–

ప్రేమా,...అనురాగాలు క్షణ భంగు రాలుగదా! 'ఉఫ్' మంటే దూది పింజల్లా ఎగిరిపోతాయి గదా!?

అంటే...

సంధ్య చెప్పిన 'సాడిస్ట్ ఫిలాసఫీ'లోనే నిజమైన ఆనందం ఉందా?

'ఇంపాజిబుల్!

మనిషి బ్రతకడానికి ... చావునీ, విషాదాన్నీ ద్వేషించడానికి మాత్రమే జన్మ నెత్తాడు! అంతేగానీ...జీవితంలోని చేదు తీరాలను వెదుక్కోవడానిక్కాదు!

"ఏమిటో దీర్ఘమైన ఆలోచన!?"

సంధ్య చైతన్య భుజం మీద చేయి వేసింది! ఆ చేతి వేళ్ళు అతి నాజూగ్గా గులాబీపూలను నలిపి పోతపోసినట్లుగా మృదువుగా ఉన్నాయి.

చైతన్య సంధ్య వంక తిరిగి సంధ్య మొహాన్ని తన చేతుల్లోకి తీసుకున్నాడు. తర్వాత నెమ్మదిగా హంస రెక్కల్లాంటి సంధ్య భుజాల మీద తలానించి, వేడి కన్నీటిని కారుస్తూ ఉండిపోయాడు!

"ఊరుకో...సిల్లీ...రా...నా దగ్గిర పడుకో! నా ఒడిలో నీకు అంతులేని ప్రశాంతి! ఎక్కడా ఊహించినా... గాలించినా దొరకనంత శాంతినిసాను! రా!! ఇదే నీకు ఆఖరిసారిగా... నీ విషాదానికి...దుఃఖానికి చివరి మెట్టుగా అందిసాను...రా డియర్!!" చైతన్య సంధ్య ఒడిలో తల పెట్టుకుని కండ్లు మూసుకున్నాడు!!

* * *

చైతన్యకు గెడ్డం పెరిగింది. మనసు నిండా భరింపలేని బరువు పెరిగింది.

ఏం చేయాలన్నా తోచని పరిస్థితి.... సంధ్య దగ్గిర ఉన్న ఆ కొద్ది గంటలు మాత్రమే ప్రశాంతి! అట్లా కాలం గడుస్తున్నా అది నిజమైన శాంతికాదు!

భ్రమ!

కేవలం భ్రమ!

అదీగాక ... మింగే నిద్రమాత్రల సంఖ్య రెండు, మూడు నుండి అయిదు వరకూ పెరిగిపోయింది.

అవి మింగడం మొదలు పెట్టిన తర్వాత అర్థమయింది. జనం అంత వెర్రిగా ఎందుకు వీటికి బానిసలవుతారో.

అవి మింగిన తర్వాతే అర్థమయింది ఆ ఆనంద మయమనుకునే ప్రపంచం లోని అనుభూతి.

అది వేరే లోకం. దాన్లోకి స్పృహ ఉన్న మనుష్యులకు ప్రవేశం లేదు. కేవలం వాటిని మింగి జీర్ణం చేసుకున్న వారికే అందులో సభ్యత్వం.

"చైతన్యా!"

"ఊఁ"

"నువ్విక్కడికి రావడం తగ్గించెయ్"

ఎవరో ముక్కుమీద గుద్దినట్లు చైతన్య ఉలిక్కి పడ్డాడు.

"ఎందుకు?"

"నేను వద్దంటున్నది నీ మంచికే... అంటే మన మంచి కోసమే డియర్! చూడు..కమలను నువు మరిచిపోలేవు.

నేను మొహమాటం, దాపరికం లేకుండా ఫ్రాంక్‌గా చెబుతున్నా. మొదట్లో నీమీది ప్రేమ వల్ల కమల వల్ల నీకు కలిగిన గాయాన్ని మాన్పడానికి ప్రయత్నం చేశాను. కానీ, దానికిపుడు 'గుడ్‌బై' చెప్పేశాను. నువ్వు,నేను తప్ప మధ్యలో మరో వ్యక్తి ప్రమేయం నాకు గిట్టదు-నేనది సహించలేను. నాదగ్గిర ఉంటే కమలను మరిచిపోవాలి. ఆ స్మృతి నాదగ్గరకు రాప డానికి వీల్లేదు."

చైతన్య వింటూ కళ్ళు మిటకరించి చూస్తూ కూర్చున్నాడు.

"నువు మళ్ళా హాయిగా....పూర్వపు చైతన్యలా...ఆనందంగా నా కౌగిలిలో ఇమిడిపోవాలి."

''అసాధ్యం"

''ఏదీ అసాధ్యం కాదు. ముందా గెడ్డం గీకెయ్. ఆ స్మృతులన్నిటినీ చెరిపి పారెయ్.''

"నా వల్లగాదు"

సంధ్య గులాబీరంగు పెదిమల మధ్య నుండి చిన్న చిరునవ్వు మెలిచి మాయ మయింది.




''తాతా...నీపేరు ! ?"

''రంగయ్య కదా డాక్టరు బాబూ"

''రా...ఏమిటి నీ జబ్బు.. ?"

''అయ్యో..ఆర్నెల్లు వైద్యం చేసినారు గదా బాబూ. ఈ ఆర్నెల్లూ మీ ఆస్పత్రి మూసుంటే అక్కడా ఇక్కడా తిరిగాను. ఎక్కడా కొద్దిగా కూడా తగ్గనేదు."

"సర్లే సంగతేమిటో చెప్పు" చైతన్య విసుగ్గా అన్నాడు.

"దగ్గు బాబూ ! దగ్గు!!"

రంగయ్య ఓసారి దగ్గి చూపించాడు. చైతన్యకు నవ్వొచ్చింది. స్టెత్‌తో ఛాతీ.. వీపూ పరీక్షించి ప్రిస్క్రిప్షన్ రాసిచ్చాడు.

రంగయ్య తప్ప క్లినిక్‌లో పేషంట్లె వరూ లేరు.

హాస్పిటలంతా దుమ్ము కొట్టుకునుంది. బేసిన్‌లో నీళ్ళు లేవు. కాంపౌండరు కుర్రాడు మానుకుని ఎన్నో రోజు లయింది. అక్కడక్కడ సాలిగూళ్ళతో అంతా చిందర వందరగా ఉంది.

కమల !

కమల!

కమలే గుర్తుకు వస్తోంది. చైతన్య కళ్ళు మూసుకుని కణతలు నొక్కు కున్నాడు.

ఓ నిమిషం తర్వాత కళ్ళు తెరిచి చూస్తే రంగయ్య ఎదురుగా అట్లాగే ప్రిస్క్రిప్షన్ కాగితం చేత బట్టుకుని కనిపించాడు.

"ఏం రంగయ్యా. ఇంకా పోలా?"

రంగయ్య సానుభూతిగా చైతన్య వంక చూశాడు.

''ఏం కావాలో చెప్పు" చైతన్య ఇంకా విసుగ్గా కసురుకున్నాడు. "పో... పోయి మందులు కొనుక్కొని వాడు"

రంగయ్య పోలేదు. అలాగే కూర్చుని 'ఖంగు, ఖంగు'మని దగ్గి గొంతు సవరించు కున్నాడు.

''చూడు డాక్టరు బాబూ ! మీ కోపం రాదంటే నేనో సంగతి. చెబుతా-కోప్పడ

కండి. మీకంటే చిన్నోడ్ని. వయసున్నా అనుభవమున్న సదువులేనోడ్ని! మనసు గుఱ్ఱం లాంటిది డాక్టరు బాబూ. దానికి కళ్ళెం కావాలి. నేను జెట్కా తోలాను గదా డాక్టరు బాబూ. ఆ జెట్కా గుఱ్ఱమూ అంతే. దాని కళ్ళెం సరిగా నా చేతిలో లేకపోతే వచ్చేపోయే కార్ల వంకా... రంగు రంగుల బస్సుల వంక అలాగే నడవడం మానేసి సూస్తు నిలబడి పోద్ది. చెప్పండి డాక్టరు బాబూ! మీకు మన శ్శాంతి కావాలంటే ముందు మనసును అదుపులో పెట్టుకోండి. చెప్పండి బాబూ. ఈ పేదోడితో మీకేమయినా కావాలంటే నా చర్మం ఒలిచి మీకిస్తా. ఎందుకంటా రేమో...."

చైతన్య నిప్పులు కక్కుతున్న కళ్లతో లేచి నిలబడ్డాడు.

మనిషి నిలువెల్లా కోపంతో వణికి పోతున్నాడు. విసురుగా రంగయ్యా మెడందుకుని లేపాడు.

"యూ డర్టీ ఫెలో గెటౌట్. గెటౌట్ ఫస్ట్. నీ అంతస్తెక్కడ? నా అంతె స్తెక్కడ? నాకు నీతులు చెప్తావుట్రా ఇడియట్. ఛల్...లే. ముందు బయటకు నడువ్. లే నడవమంటే"

చైతన్య తోసిన తోపుకు రంగయ్యా తూలుకుంటూ గుమ్మం దాకా పోయి నిల దొక్కుకున్నాడు.

"మంచిదిలే ... బాబూ మంచిది" రంగయ్యా గొణుక్కుంటూ బయటకు పోయాడు.

చైతన్య కుర్చీలో కూలబడి చేతుల్లో మొహం కప్పుకున్నాడు. అప్పటికి సాయంత్రమయింది.

* * *

శాంతి కావాలి.

ఎక్కడ దొరుకుతుంది?

ఎలా...ఎలా?

సంధ్య దగ్గర శాంతి దొరికినా తర్వాత కలిగే అశాంతి తలుచుకుంటే ఒళ్ళంతా కంపరం పుడుతోంది.

కమల గుర్తుకు వచ్చినపుడల్లా మెదడు నిండా సమ్మెట పోట్లు.

చైతన్య ఆగి చూశాడు.

వీధంతా సందడిగా ఉంది. వీధి లైట్లు దేదీప్యమానంగా ... రంగుల తోరణాల్లా వెలుగుతున్నాయి.

రిక్షాలు, స్కూటర్లు, కార్లు హడావుడిగా దూసుకుపోతున్నాయి.

ఒక్క అర్నెల్ల కాలం - తన జీవితా న్నింత విచిత్రమైన మలుపుల్లోకి త్రిప్పి వదిలింది.

ఆ రోజుల్లో తానూ ఈ జన సందో హంలో ఒకడుగా ఆ ఆనందంలో భాగం పంచుకుని అద్భుతమైన అనుభవాల్ని పొందినవాడే ఈ విశాల విశ్వంలో... జనంలో... అందరిలో తానూ ఒకడు!

కాని, ఈనాడు...

ప్చ్...కాలం ఎంత భయంకర మైనది!?

చైతన్యా అప్రయత్నంగా బ్రాందీ షాపు కేసి నడిచాడు.

కౌంటరులోని మనిషి వినయాన్ని ఒలక బోస్తూ విస్కీ సీసా ఓటి చక్కగా ప్యాక్ చేసి చైతన్య చేతి కందించి, మెరిసి పోయే బట్టతలను తడుము కున్నాడు?

డబ్బిచ్చి చైతన్యా బారు నుంచి బయ టకు వచ్చాడు!

ఈ జనాన్ని తాను భరించలేడు!!

తనకి ఏకాంతం కావాలి!

ఏ హిమాలయాల్లోకో ఎగిరి వెళ్లి పోతే ఎంత బావుంటుంది? మనుషులెవరూ లేని చోట ఎంత ప్రశాంతత !?!

చైతన్య ఊరు దాటి వచ్చేశాడు! అక్కడంతా పేదవాళ్ళ గుడిసెలూ, బక్క చిక్కిన కుక్కల అరుపులూ... వాసనా... మురికి! :

దూరంగా గుడిసె ముందు ఎవరో ఇద్దరు ఆడవాళ్ళు చాలా ఘాటయిన బూతుల్లో తిట్టుకుంటున్నారు. వాళ్ళు ఇప్పుడో ఇంకో క్షణంలోనో సిగలందుకుని... మొహాలు రక్కుకుని...బట్టలు చించుకుని పోట్లాటకు దిగడానికి సిద్ధంగా ఉన్నారు.

ఓ రిక్షా మీద పడుకుని సీటుమీదికి కాళ్ళు బారజాపి నోట్లో బీడీతో ఆకాశాన్ని... చుక్కల్ని వెక్కిరిస్తూ కూని రాగం తీస్తున్నాడో పడుచువాడు.

చీకటి... వాసన... బురద... దూరంగా పొలాల మధ్యన మిణుగురు పురుగులు చేసే ఘాటయిన నృత్యం... అక్కడి నుండి వెనక్కి తిరిగి తాను వచ్చిన ప్రదేశాల్ని... పట్టణాన్ని చూస్తుంటే... ఒక పెద్ద భూతానికి వేయి... లక్ష... కోటి కండ్లు వచ్చి వాటన్నిటినీ... తెరిచి భయ పెడుతున్నట్లుగా హుంకరిస్తున్నట్లుగా చైతన్య కనిపించింది.

"ఓ మీరా! రండి డాక్టరు బాబూ! ఇట్లా మా యింటి దాకా రండి. రాండి!"

రంగయ్య జట్కా గుర్రానికి దాణా పెట్టిన పళ్ళాన్ని చేతితో పట్టుకుని చైతన్యకు దగ్గరగా వచ్చి పలకరించాడు. రంగయ్యలో ఉదయం జరిగిన సంఘటన తాలూకు ఛాయలు కూడా లేవు.

చైతన్య యాంత్రికంగా రంగయ్య వెంట నడిచాడు. "జర కిందికి తల దించండి. చూరు నెత్తికి తాకుద్ది బాబూ!"

గుడిసె చాలా చిన్నగా ఉంది. దాని కప్పుకున్న రెండు చివురుల నుండి ఓ వేయి చుక్కలు నిక్కి చూస్తున్నాయి. లోపల కిరసనాయిలు దీపం మిణుకు మిణుకు మని చుక్కల్ని పలకరిస్తోంది.

నేలమీద చాప! దాని పక్కన చిన్న కుండా... సత్తు గిన్నెలు... గ్లాసులు గోడకు జట్కా గుర్రపు కళ్ళాలూ... పటకాలూ... చర్నాకోల ఇంకా ఏవేవో వ్రేలాడుతున్నాయి.

చైతన్య చాపమీద చతికిల బడి, గోడకి జారగిల బడ్డాడు. రంగయ్య రెండు సార్లు దగ్గి చైతన్య చేతిలో నుండి విస్కీ సీసా అందుకుని పక్కన పెట్టాడు.

"ఇదే నా నీ ఇల్లు."

"అయ్యా...ఇదే నాకున్నది. బయట చిన్న పందిరి... దాని కింద నా బేటా నా జట్కా."

రంగయ్య ఓ నిమిషం ఆగి సత్తు గ్లాసుతెచ్చి, తుడిచి విస్కీ సీసా మూత తెరిచి దాన్నిండా విస్కీపోసి చైతన్య కందించాడు. ఒక్క గుక్కలో దాన్ని తాగిన చైతన్య ఉక్కిరి బిక్కిరయ్యాడు. పొలమారి రెండుసార్లు దగ్గాడు.

"నెమ్మది బాబూ నెమ్మది"

"నువ్వూ తాగు రంగయ్యా"

"దగ్గు ఎక్కువయిద్దేమో.. అమ్మో.. అయినా ఇంతధర గలిగింది నాకెందుకు?"

"తాగమంటే...?"

"డాక్టరుబాబులు.....మీ మాటకు ఎదురా?" రంగయ్య తాగాడు.

తర్వాత రంగయ్యలో అంతులేని




హుషారు. చైతన్య మనస్సెక్కడో తేలి పోతోంది.

"మీరు చదువుకున్న బాబులు. డాక్టర్లు.. మీకు చెప్పగూడదనుకోండి ! ప్చ్...! మనసు మంచిదికాదు బాబయా. కాదంటే.. దాన్ని నొక్కిపట్టి ఉంచాలి ! కష్టాలు ఎంత మాత్రం మంచివికావు బాబయ్యా."

చైతన్య వింటున్నాడు. రెండుసార్లు తాగాడు. మగతా, శాంతి నిర్లిప్తత.. మత్తు.. శాంతి.

రంగయ్య ఇస్తున్న ఊకదంపుడు ఉపన్యాసం.

అంతే ! అంతే.

తర్వాత చైతన్యకేమీ గుర్తులేదు.




చైతన్య ఉదయం లేచి మంచం మీద కూర్చుని ఆలోచిస్తున్నాడు. తలంతా దిమ్ముగా ఉంది. కణతలు తణేశ్... తణేశ్' మని మోగిపోతున్నాయి.

రాత్రి...

బాగా రాత్రయిన తర్వాత తాను రంగయ్య జెట్కాలో వచ్చాడు. జెట్కాలో తాను కనీసం సరిగా కూర్చోలేక పోయాడు. పడుకున్నాడు.

దారి పొడుగునా మందు మింగిన రంగయ్య హుషారుగా ఏదో 'సొద' చెబుతూ, దగ్గుతూ జెట్కా తోలుతున్నాడు.

"మగాడికి ఆడది కావాలె డాక్టరు బాబూ! కానీ. కానీ. కొద్ది రోజులయినంక ఆడదాని కంటే మొగోడికి.. ఆడదానికీ అంతేగద బాబూ.. పిల్లలు కావాలి. ప్రేమకు చివరికి దక్కేది పిల్లలేగద బాబూ. డాక్టరు బాబూ..: నాకా అదృష్టం లేదు. నేనో ఎర్రి ముండా కొడుకుని. పిల్లలెంతకీ పుట్టనేదని నా పెండ్లాన్ని తిట్టి తిట్టి సంపిన. అఖరికది ఆ బెంగతోనే సచ్చిపోయింది."

ఈ సోదిలో మధ్య మధ్య రంగయ్య దగ్గుతూనే రెండుసార్లు ఆనందంతో... నాలుగుసార్లు దుఃఖంతో ఏడ్చాడు కూడా.

జెట్కాదిగి తాను తూలుతూ వచ్చి పడక మీద పడుకున్నట్లు గుర్తు. తలుపులు దగ్గరగా వేయనన్నా వేయలేదు.

బయట ఎండ చిటచిట లాడిపోతోంది. చైతన్య మొహం కడుక్కొని కాఫీ తాగాడు.

కాఫీ తాగుతుంటే చైతన్య చేయి వణికింది.

తానెంత దిగజారి పోయాడు.

తన చదువూ, విజ్ఞానం, ఆలోచనా శక్తి.. ఎక్కడికి పోయినట్లు?

సంధ్య!?

అవును సంధ్య! సంధ్య గుర్తుకు రాగానే చైతన్య కొంచెం తెప్పరిల్లాడు. సన్నగా ఈలవేసి, తాళంవేసి రోడ్డు మీదికి వచ్చాడు.

పోయినవాళ్ళను గురించి ఆలోచించడం అవివేకం!

ఉన్న కమల తమ్ముడు అక్క కోసం రెండు రాగాలు పెట్టి వెళ్ళిపోయాడు.

రక్త సంబంధాలే అంతంత మాత్రంగా

ఉన్నాయి.

సంధ్య బంగళా వచ్చింది.

బంగళా కాంపౌండు మీద గేటు దగ్గర బోగన్ విల్లాలు గాలికి తలలూపుతున్నాయి. అది కాదు చైతన్యను ఆకర్షించింది.

గేటు దగ్గర కాకీ యూనిఫారం వేసుకుని గూర్ఖా కనిపించాడు.

సంధ్యకు గూర్ఖా అవసరం ఏమిటి? ఇదో పిచ్చి!

చైతన్య లోనికి పోబోయిన వాడల్లా, కొండచిలువలా అడ్డం వచ్చిన గూర్ఖా వాడి చేయి చూసి స్తంభించిపోయాడు!

“లే... నే నెవర్నో తెలుసా?”

“మాలూం సాబ్..”

చైతన్య దిమ్మెరపోయాడు.



తనకు.. తనకిక్కడ అవమానం.

పెద్ద పెద్ద అంగలేసుకుంటూ చైతన్య లోపలికి నడిచాడు.

ఏమనుకున్నాడో గూర్ఖా అడ్డుపెట్ట లేదు.

లోపల పాలరాతి గచ్చు చల్లగా ఉంది.



దూరంగా ఎయిర్‌కండిషనర్ పడ గ్గదిలో చేస్తున్న శబ్దం సన్నగా వినిపిస్తోంది.

డ్రాయింగ్‌రూమ్ సమీపించిన చైతన్య తక్కున ఆగిపోయాడు!

లోపలనుండి సంధ్య గొంతూ, మరో గొంతూ వినిపించింది.

చైతన్య గుండెలనదిమి పట్టుకుంటూ కిటికీ తెరను ఒత్తిగించి లోపలికి జాగ్రత్తగా తొంగిచూశాడు.

సంధ్య సోఫాలో కూర్చుంది.

సంధ్యకు ఎదురుగా నల్లకోటు వేసుకుని సిగరెట్టు తాగుతూ బూటు కాళ్ళను హుందాగా ఆడిస్తున్న కుర్ర లాయరు కూర్చున్నాడు.

సంధ్య గల గల మని సంపెంగ పూలు ఎండిన మొగలిపూల మీద రాలుతున్నట్లు మెత్తగా నవ్వుతోంది.

ఆ కుర్ర లాయరు నవ్వులు చిందిస్తూ వింటున్నాడు.

వాళ్ళ ఎదురుగా టీపాయ్ మీద కాగితాలు చిందర వందరగా పరుచుకుని ఉన్నాయి.

కానీ అదికాదు చైతన్యను ఆకర్షించిన విషయం.

ఆ కాగితాల పక్కనే టీపాయ్ మీద దంతపుభరిణె! సింహపు తలలు మూలల్లో చెక్కిన... చుట్టూ లతల్లో అందంగా అపురూపంగా మలచిన అందాల భరిణె.

చైతన్య ఊపిరి బిగబట్టి వింటూ నిలబడ్డాడు.

"అయితే ఈ విషయంలో ఎలాంటి చిక్కులూ ఉండవంటారా?"

"ఆహా!"

"ఆ... మీ లాయర్లు పుట్టి మునిగే వరకూ అట్లానే అంటారు! నాకు తెలియదూ మీ సంగతి"

"ఎవరి విషయమో వేరుగానీ... మీ విషయం మాత్రం అట్లాకాదు!

"ఎందుక్కాదు?" సంధ్య గొంతులో మామిడి చిగుళ్ళు నమిలిన కోకిల గొంతులోని మత్తు.

"ఎందుకంటే? మీరు..మీరు కాబట్టి"

సంధ్య సున్నితంగా నవ్వింది.

"భలే లిటిగెంటు లాయరుగారండీ మీరు! నేను నేను గాక మీ రెట్లా అవుతానండీ బాబూ!"

ఈ సారి పగల బడి నవ్వింది. అట్లా నవ్వినపుడు జారిన పమిటను గానీ... మెడలో సుతారంగా ఊగే ముత్యాల పేరును గానీ సంధ్య పట్టించుకోలేదు.

కుర్ర లాయరు ఉక్కిరి బిక్కిరవుతూ లేచి నుంచున్నాడు. మొహానికి పట్టిన చిరు చెమటను ఆదరా బాదరాగా తుడుచుకున్నాడు.

కాగితాలను సర్దే నెపంతో టీపాయ్ మీదికి ఒంగి ఆచ్ఛాదన లేని సంధ్య వక్షోజాలను అదే పనిగా...తనివి తీరా చూస్తూ కాగితాలను కెలుకు తున్నాడు.

సంధ్య నవ్వడం ఆపుచేసింది.

కుర్రలాయరు నిట్టూర్చి లేచి నుంచున్నాడు.

"మీరేం వర్రీ అవకండి. ఆ ఎంక్రోచ్ మెంట్లో... అక్విపెంట్స్... వాళ్ళ సంగతి... అంతా నేను చూసుకుంటాను మీ కేం ఫర్వాలేదు. నా ఒంట్లోని శక్తి నంతా ధార పోసి మీ కేసుల విషయం చూసుకుంటాను. సరా?"

"సరే!"

కుర్ర లాయరు పక్కనున్న బ్రీఫ్ కేసందుకుని, కాగితాలను దాన్లో కుక్కి బయటకు వచ్చాడు.

చైతన్య యథాలాపంగా తోటలోని చెట్ల వంక చూస్తూ నుంచున్నాడు.

కుర్రలాయరు టక టక మని వరండా మెట్లు దిగి వెళ్ళిపోగానే, చైతన్య విసురుగా లోపలికి పోయాడు. లోపలికి అడుగు పెట్టగానే గులాబీలా మెరిసి పోతున్న సంధ్య చేయందుకుని ఒక్క ఊపుతో సోఫాలో నుండి బయటకు లాగాడు

"ఏమిటిది? ఏవిటి మొరటుదనం"

చైతన్య నిప్పులు కక్కుతున్న కళ్ళతో సంధ్య మొహంలోకి మొహం పెట్టి పండ్లు పట పట లాడించాడు.

"యూ డెవిల్..."

"ముందు వదులు... వదలమంటే!"

చైతన్య వదలకుండా సంధ్యను విసురుగా బెడ్‌రూం లోకి లాక్కుపోయి ఫోం బెడ్ మీదికి త్రోసేసి తలుపులు దగ్గరగా వేశాడు.

"ఇందుకే అయితే ఇంత ఆరాటం ఎందుకూ? ఊరికే మామూలుగా చెప్పొచ్చుగా!?"

"షటప్ చెప్పు...నా ఒక్కో ప్రశ్నకు సమాధానం చెప్పు. ఎదురు మాట్లాడకుండా సూటిగా నిజం చెప్పు"

"కమాన్ డార్లింగ్..అట్లా కూర్చో"

"షటప్!" బంగళా అంతా దద్దరిల్లి పోయేలా అరిచాడు చైతన్య.

"ఎందుకట్లా అరుస్తావ్? అంత అవసరం లేదే!"

సంధ్య చాలా మామూలుగా అంది గానీ... చైతన్య వాటన్నింటినీ పట్టించుకునే పరిస్థితిలో లేడు!

"వాడెవడు?"

..........!

"అదేమిటి?"

చైతన్య ఈ ప్రశ్నలను అడిగిన తర్వాత చాలా సేపు నిశ్శబ్దంగా ఉండిపోయాడు. తాత్కాలికంగా అతని గొంతు మూగవోయింది.

"అర్థం లేని ప్రశ్న! అతను 'మన' పొలం... ఆస్థి వ్యవహారాలను చూసే లాయరు.

చైతన్య ఓ సారి కన్నెత్తి సంధ్యను తేరిపార చూశాడు.

చైతన్యకు హఠాత్తుగా గేటు దగ్గర తనను అటకాయించిన గూర్ఖా గుర్తుకు వచ్చాడు. తిరిగి ఒళ్ళుతెలియని ఆవేశం.. ఉద్రేకం.. కట్ట త్రెంచుకుని బయట్కి పడ్డాయి.

"అలాగా! మరయితే గేటు దగ్గర... బయట గూర్ఖాతో నన్నెందుకు అటకాయించమన్నావ్?

"నేను అటకాయించమని చెప్పానా"

"అవును. అట్లా అని వాడు చెప్పాడు"

సంధ్య పెదిమలు కొరుక్కుంటూ చైతన్యనే చూస్తుండిపోయింది.

చైతన్య ముందుకు ఒంగి సంధ్య భుజం అందుకుని బలంగా గుంజాడు.

"చెప్పు రాస్కెల్! నువ్వు లోపల 'వాడితో' కులుకుతూంటే నేను లోపలికి రాకుండా ఉండడానికి నువు చేసిన ఏర్పాటు గదూ?"

"చైతన్యా! నీ బుర్ర చెడిపోయింది.. నేనిపుడేం చెప్పినా నీ కర్థం కాదు..."

సంధ్య మాటలు ముగించే లోపలే చైతన్య లేచి విసురుగా సంధ్య చెంప ఛెళ్ళు మనిపించాడు.

సంధ్య కళ్ళ ముందు వేల మెరుపులు నల్లని పొగ లాంటి మేఘాలను చీల్చుకుని ఆక్రందనలు చేస్తూ.. బయటకు దూసుకుని సర్వప్రపంచాన్ని 'చెళ్ళు' 'చెళ్ళు' మనిపించినట్లు మెరిశాయి ఓ క్షణ కాలం. మనసంతా గతి తప్పి ఎక్కడికో తెలియని తీరాలకు ఎగిరిపోయినట్టయింది.

ఎర్రని గులాబీ నిప్పు సెగలకి మాడిపోయినట్లు సంధ్య చెక్కిళ్ళు చిన్నపోయాయి.

సంధ్య కళ్ళ నుండి తొలకరినాడు కురిసినట్లు జల జల మని మంచి ముత్యాల్లా.. ఎర్రటి బుగ్గల మీదికి అవి జారినపుడు కెంపుల్లా మెరిసిపోతూ నీటి

బిందువులు జల జల మని రాలాయి.

ఓ నిమిషం వరకూ సంధ్య అట్లాగే చూస్తూ కూర్చుంది.

చైతన్య కోపాన్ని కంట్రోలు చేసుకుంటూ నుంచున్నాడు. మనిషి నిలువెల్లా గజగజమని వణికిపోతున్నాడు.

మరు క్షణంలో...

సంధ్య గుండుదెబ్బతిన్న బెబ్బులిలా.. సివంగిలా గర్జించింది !

"అవును ! నువ్వన్నవన్నీ నిజం ! అన్నీ ఒప్పుకొంటున్నాను. నా ఇష్టం వచ్చినట్లు చేసే హక్కు నాకుంది! కట్టుకున్న వాణ్ణే లెక్క చేయలేదు నేను! నాకి బంధనాలంటే...ఆచారాలంటే ఇష్టం లేదని ముందే చెప్పాను! ఇది నా సామ్రాజ్యం. దీనికి నేను మహారాణిని! నా జీవితంలో ఎన్నో త్యాగాలు చేసి ఈ గుండెను ... రాయిలా ... పాషాణంలా మార్చుకుని ఈ సామ్రాజ్యాన్ని నిర్మించుకున్నాను. ఇందులోని ఆకాశ హర్మ్యాలు, అగాధాలు, అన్నీ అన్నీ.....నా ఇష్ట ప్రకారం కట్టుకున్నవే! వీటిని ప్రశ్నించే హక్కు ఎవరికీ లేదు. చివరికి నన్ను సృష్టించిన ప్రకృతికూడా! మరి నీకు.. నీకెక్కడిది?"

చైతన్య నిరుత్తరుడై వింటున్నాడు.

"నా శరీరం కావాలని నీవు కోరగానే నేను ఎన్నడూ నీ కందివ్వలేదు. మైండిట్! నా శరీరం 'నువు కావాలని' నిన్ను కోరి నపుడే నువు నా దగ్గరకు రాగలిగావు... వచ్చావు. అర్థమైందా?"

"కానీ. మన మధ్యకు ఇంకోడు రావడం నేను సహించను!"

సంధ్య నవ్వింది.



వెన్నెల మాడిపోయినట్లు. గులాబీ పూలను సైనైడ్ విషంలో కాలకూటంలో ముంచి బయటకు తీసి ఆరేసినట్లు నవ్వింది.

"ఆ 'వెధవ' సెంటిమెంట్లు నాకు పనికిరావని లక్ష సార్లు చెప్పాను. నీ పెళ్ళాం బ్రతికున్నపుడు ఓ రోజు నిన్ను నేను అడిగిన మాట నీకు గుర్తుందా? నాకూ, నీకూ మధ్యన మరొకరుండగూడదనీ, ఆవిడగానీ, నేనుగానీ ఒకరే ఉండాలని అడిగితే నువ్వేమన్నావ్? 'మేం ఇద్దరం కావాలని అనలేదూ?' అపుడు నాలో గలగని ఆవేశం, అసూయ, జెలసీ నీకిపుడు హఠాత్తుగా ఊడి పడడం ఏమిటి? దాన్ని నేనెట్లా స హిం చా నో, దీన్ని నువ్వట్లా సహించి తీరాలి!"

"కానీ...కానీ నిన్ను నేను మనసారా ప్రేమించాను!"

సంధ్య హేళనగా చూసింది. ప్రపంచంలోని కసినీ...ద్వేషాన్ని కనుపాపల మధ్యన నింపుకుని తీక్షణంగా...భయంకరంగా చూసింది!

"ప్రేమా? ప్రేమంటే ఏమిటి? ప్రేమ మనసుకు సంబంధించిందా? ఆత్మకు సంబంధించిందని కచూ పనికి మాలిన అబద్ధాలు చెప్పేది? అదీగాక అది శాశ్వత మయిందా? నీ పెళ్ళాం నీకేం తక్కువ చేసింది? నిన్ను ప్రేమించలేదా? ప్రేమించ కున్నా నువ్వు ఆవిణ్ని ప్రేమించాలిగదా? అంతా హంబక్! బోగస్...ఈదేహం... ఇది మాత్రమే శాశ్వతం! ఒకసారి అనుభవించిన ఈ దేహాన్ని ఆ సుఖాన్ని 'ప్రేమ'నుకుని బ్రతికినన్నాళ్ళూ కలవరించి పలవరించి పోవడం ప్రేమ కదూ? ఏం? నీ ప్రేమకు నా శరీరమే కావాల్నా? నా కంటే కురూపిని ప్రేమిస్తే అంతకు వేయిరెట్లు అది నిన్ను ప్రేమిం

చదూ? తన గుండెల్లో దాచుకుని పూజిం చదూ? పో...బయటికి పో...నాక్కని పించకు! నా దేహం కావాలనిపించినపుడు రెండు చేతులు చాచి అర్థిస్తూ నా దగ్గరకు మోకాళ్ళమీద పాక్కుంటూ రా! అపుడు నీక్కావలసిన సుఖం ఇస్తాను. అదీ నా ఇష్టమయితేనే!"

"యూ డెవిల్!" చైతన్య పళ్లు నూరుతూ ముందడుగు వేయబోయాడు.

"జాగ్రత్త! మర్యాదగా నా ముందు నుండి బయటకు పో!"

"నా జీవితాన్ని... నా విజ్ఞానాన్ని... సర్వస్వాన్ని నాశనం చేసిన నాగు పామువి! నిన్ను వదలను. నీ అంతు చూసాను. నా పగ తీర్చుకుంటాను"

సంధ్య కాలూపుతూ నవ్వింది.

"నీ చాతకాదుగాక కాదు! నా ఒక్క కనుసైగతో, నా ఒక్క చిరునవ్వుతో నీ పగ చల్లారుతుంది. నువు నా బానిసవు? నా కింద పడివుండే తివాచీవి!"

సంధ్య నవ్వడం మొదలు పెట్టింది.

భయంకరంగా పరిసరాలూ, గోడలూ కిటికీతెరలూ కదిలిపోయేలా వికటాట్ట హాసం చేసింది.

* * *

"సార్"

చైతన్య తలెత్తి చూశాడు! ఎదు రుగా నిన్న తనను గేటు దగ్గిర అట కాయించిన గూర్ఖా వినయంగా నిలబడి ఉన్నాడు.

చైతన్య ముందున్న విస్కీ సీసా ఎత్తి రెండు గుక్కలు తాగి, పెదాలు తుడుచుకుని సిగరెట్ వెలిగించు కున్నాడు.

"క్యాహోనా!?"

"అమ్మగారు ఈ ఉత్తరం మీ కిమ్మ న్నారు. లేవో సాబ్!"

"డర్టీ బిచ్"

చైతన్య తూలుతూ లేచి ఉత్తరా న్నందుకున్నాడు.

వాడు మళ్ళా ఓసారి 'సలాం' చేసి బయటకు వెళ్ళిపోయాడు.

చైతన్య దాన్ని చదవకుండానే ముక్క చెక్కలుచేసి అగ్గిపుల్లంటిద్దా మనుకున్నాడు. తర్వాత విసురుగా టేబిలు మీదికి విసిరేసి విస్కీ సీసా అందుకున్నాడు.

గొంతులో మంట! భగ్గున మంట!

మనసులో.. గుండెల్లోమంటలు..అగ్ని కీలలు!

కమల.. కమల !!

ఎంత ప్రయత్నించినా తనని చూసి తన చిన్న పెదిమల చివర్నుండి చిన్న భావం, కనుకొలుకుల నుండి చిన్న సైగతో శాసించే కమల రూపం ఎంత ఆలోచించినా గుర్తుకు రావడం లేదు..... స్మృతికి రావడంలేదు.

నెమ్మదిగా టేబిలు మీది ఉత్తరా న్నందుకున్నాడు..

"డియర్ చైతన్యా!"

చైతన్య కాగితాల బొత్తిని ఓసారి తేరిపారజూశాడు. సంధ్య అక్షరాలు ముత్యాల్లా పొందికగా ఉన్నాయి. కుడి వేపు ఉత్తరం పైభాగాన... ఎప్పటిదా తారీఖు... ఓహ్.. ఒక సంవత్సరం నాలుగు నెల్ల క్రిందటిదది.

అంటే—

అంటే తాను మొదటిరోజు సంధ్యకు ట్రీట్ మెంటు చేయడానికి ఆ బంగళాలో అడుగు పెట్టినప్పటి రోజు! అదే తారీఖు.

చైతన్య అయోమయంగా కళ్ళు



తాటించి ఉత్తరం చదవడం మొదలు పెట్టాడు-

"ఆశ్చర్యంగా ఉందా? నువు నాకీ దినమే ట్రీట్‌మెంటు ప్రారంభించావు, ప్రారంభిస్తావని నాకు తెలుసు. నువు తర్వాత నా బంగళానూ.. నన్ను వదల లేవనీ, చివరికి ఈ ఉత్తరం చదవాల్సిన రోజు నీకు వస్తుందనీ నాకు తెలుసు.

అందుకే డియర్!

ఈ చేదు ఉత్తరాన్ని వ్రాసి వీలు నామాలా భద్రపరుస్తున్నాను. ఇంకో ఆర్నెల్లకో, సంవత్సరానికో, రెండు మూడు సంవత్సరాలకో నువ్విది చద వాల్సిన రోజు తప్పకుండా వస్తుంది. రావాలి!

అంత ఖచ్చితంగా రావాలని నేనెందుకు చెబుతున్నానంటే.. నా మీద నాకున్న నమ్మకంవల్ల.

నా ఆత్మస్థైర్యం మీది నమ్మకం వల్లా, ఇతరుల బలహీనతల మీది విశ్వాసం వల్లా!

డియర్

ఇలాంటి రోజు నీకు రావాలని నేను కోరుకోవడం కూడా నాలోని ఒక బల హీనత కావచ్చు! కానీ నే నా బలహీనతకు బానిసనైపోయాను! ఎందుకంటే తాత్కా లికంగా ఆ బలహీనతలో నాకానందం దొరుకుతుంది కసక.

సరే-

ఓపిగ్గా ఉత్తరమంతా చదవాలి. నువు చదువుతావు.

ఎందుకు చదువుతావో మాటిమాటికీ కారణాలు చెప్పలేను.

సరే!

ముందు ఒకటి రెండు విషయాలు నాకు సంబంధించినవీ...మా కుటుంబానికి సంబంధించినవీ చెప్పాలి. అప్పుడుగానీ నీకు విషయం పూర్తిగా అర్థం కాదు.

మాది చాలా పేద కుటుంబం! మన దేశంలోని లక్షల కోట్ల కటిక దరిద్రుల వరుసలోనే మాదీ ఒక స్థానం. కష్టం, శ్రమ, కన్నీళ్ళు తప్ప ఏమీ మిగలని బతుకులు మావి.

మా నాన్న గుమాస్తా.

గుమాస్తా అనేది మన సామాజిక వ్యవస్థలో స్పష్టంగా కనిపించే ఒక రాచ పుండు. కష్టాలనబడే దురద పుట్టినపుడు దాన్ని గోకితే కలిగేది తాత్కాలికానందం మాత్రమే.

సరే!

అప్పులూ, ఇల్లు తాకట్టూ వ్యాధికి గురై రోజులు లెక్కబెడుతూ ఆ స్థితిలోనే వణుకుతూ ప్రయాసపడే అమ్మా, జులాయిగా తిరిగే తమ్ముడూ, నాకంటే రెండేండ్లు చిన్నదై రెండో కుంపటిలా మా గుమస్తా నాన్న గుండెల మీదికెక్కి రాజుకుంటున్న చెల్లెలూ...

కాలేజీలో ఇంటరయిందనిపించాను. డియర్ చైతన్యా! బీదరికంలోనూ ఓ అందం ఉంది.

అదేమిటో తెలుసా?

కారులో దిగే అందాల రాణినీ, అంత కన్న అందమైన బట్టలనూ హుందానూ చూస్తే కేవలం మగాడిలో ఆరాధనా భావం కలుగుతుందనుకుంటా! కానీ మామూలు, చిరుగులు కుట్టిన బట్టల్లో కనిపించే పేద దాన్ని చూస్తే ప్రపంచంలోని సెక్సంతా అంతా కసిగా మారి దాన్ని కొరుక్కు తినేయాలన్నంత కసి ఏర్పడుతుంది.

అంటే పేదరికం మాకు ఒక విధమైన వరమన్న మాట! అంటే పేదరికం వరం

లాంటి ఓ విధమైన శాప మన్నమాట.

నా కడుపులో ఆకలి గర గర లాడు తుంటే నా మానాన నేను పోతుంటే... ఎపుడు నన్ను కరకరా నమిలి మింగితే తమ ఆకలి తీరుతుందో అని ఆకలి చూపులో లొట్టలేసే జనం.

సరే! ఇదంతా చాలా మామూలు.

కానీ...

మా నాన్న ఆ ఊరి 'చిన్న దొర'కు అప్పు పడ్డాడు. అప్పూ, అవసరాలు... బాకీలు చక్ర వడ్డీలు ... మా గుమాస్తా నాన్నని చక్రబంధంలా పెనవేసు కున్నాయి.

ఒకరోజు ముందుగా చాలా గౌరవ మైన భాషలో ఇద్దరు భార్యలు చచ్చిన ఆ 'దొర'కు నన్ను కట్టబెట్టి చేతులూ... అప్పు కడుక్కోరాదా?' అనే రాయబారం వచ్చింది.

కరక్టే! ఎంత గుమాస్తా అయినా తన చేతి వ్రేళ్ళను తన బిడ్డ కంఠ నాళాల్లోకి గుచ్చి రక్తం పిండి చంపలేడు గదా !?

తర్వాత!

ఆ దినం సాయంత్రం...

సన్నగా వాన తుంపర పడుతోంది చిన్న దొర తన బలగంతో నాన్నను ఇరికించే 'చక్రబంధం' తాలూకు కాగి తాలతో మా ఇంటి మీదికి వచ్చాడు.

నీ చిన్నతనంలో సంత ఎప్పుడయినా చూశావా? దాన్నే అంగడి అని కూడా కొన్ని చోట్లంటారు! అక్కడ మనం మేక పిల్లని కొని మెడకి త్రాడు కట్టి ఇంటికి భద్రంగా తీసుకుపోతామే! అట్లా నాకు ఏర్పాటయింది. క్షణాల మీద పురో హితుడు వచ్చాడు. మంగళ సూత్రాలూ, బాజాల వాళ్ళూ అంతా క్షణాల మీద ఏర్పాటయిపోయింది మరి.

తర్వాత నాన్నని తన చక్రబంధం నుండి విడిపించి అతి జాగ్రత్తగా తన బంగళాకు నన్ను తీసుకుపోయాడు.

కింద కూలబడి మా గుమాస్తా నాన్నా, గుమ్మానికి చేరగిలబడి దగ్గుతూ అమ్మా, నోట్లో వేళ్ళు పెట్టుకుని దీనంగా చూస్తున్న చిన్న తమ్ముడూ, చూడలేక వెనక వంటింట్లో వెక్కుతున్న చెల్లెలూ.. వీళ్ళందరినీ...అందరినీ వదిలి ఆయనకు 'భార్యగా' వెళ్ళిపోయాను.

నా మెడలో మంగళసూత్రం ఓటి కట్టాడుగదా! ఇంకేం. ఇక నేనేమీ మాట్లా డడానికీ, ఎదురు తిరగడానికీ, చెప్పడానికి వీల్లేనంత గట్టిగా సంకెళ్ళు పడ్డాయి.

కొద్దిసేపు చదవడం ఆపుచేసి ఓ రెండు నిమిషాలు విశ్రాంతి తీసుకో! ఎందుకంటే ఆయన నా మెడలో వ్రేలాడ దీసిన ఆ సూత్రాలు...వాటిని తలుచు కుంటే 'హిస్టీరియా' వస్తుంది. కాబట్టి దీని తర్వాత భాగం రెండు మూడు గంటల తర్వాత వ్రాస్తాను!''

చైతన్య నిరుత్తరుడై కాగితాలను జారవిడిచి విస్కీ సీసా ఎత్తి గడగడ రెండు గ్రుక్కలు త్రాగాడు.

* * *

పొద్దంటూ పొడిచిన తర్వాత తప్ప కుండా రాత్రి కావాలి గదా. అది ప్రకృతి సహజం.

పడమటి దిక్కున సూర్యుడు వేట చాలించి విశ్రాంతికి పోతున్నపుడు నా మానసికాందోళన ఏమని చెప్పను.

రాత్రి నాకు నరకం!

పగలంతా చాలా గౌరవంగా అంద రిలో చాలా మర్యాదగా ప్రవర్తించే 'ఆయన' రాత్రయ్యేసరికి మీద ఉన్న మేక తోలును దూరంగా విసిరేసిన



తోడేలులా తన అసలు రూపాన్ని బయట పెట్టేవాడు. అడవిలో తిరిగి వేటాడే పెద్ద పులిలో ఎంతో కొంత దయ, కార్పణ్యం ఉండవచ్చునేమోగానీ ఆయనలో అవి అప్పుడు మచ్చుకయినా కనిపించవు.

సాయంత్రం అయిదు గంటలనుంచీ 'తాగడం' అనే కార్యక్రమం మొదలవు తుంది రాత్రి తొమ్మిది గంటలకే ఆ కార్యక్రమానికి ఫుల్‌స్టాప్ పడేది.

తర్వాత నాకు నరకం. అది సెక్సు కాదు. హింస. అతని 'శాడిజం' ఎంత వరకూ పోయిందంటే సన్నటి సూదుల్తో నా శరీరంలో చెప్పరాని చోట్ల గుచ్చి రక్తపు చుక్కలు కారుతుంటే సంతోషపడి కేరింతలు కొట్టి తృప్తి పడేవాడు!

చేతులు పరపర విరిచి, జడను తీగలా లాగి వీపుమీద గుద్ది శరీరంలోని ప్రతి భాగాన్నీ హింసించి హింసించి ఊరుకునేవాడు. తనకి అలసట కలిగి నిద్రపోవాలే తప్ప మరో విధంగా నాకు విముక్తి దొరికేది కాదు.

ఎదిరించలేను.

ఎదిరించి గెలవలేను.

నా పేదరికం, నా అసహాయతా, వీటి మధ్య 'ఆయన'తో పడిన నా బంధాన్ని

ఎట్లా త్రెంచుకోనిస్తాయి.

కసి!

కసి!

కసి కొండలా పెరిగి నన్ను అణువణు వునా కాల్చి పారేసేది.

కానీ నేనేం చేయను??

ఆయన్ని వదిలి బయట పడితే నా అంతంత మాత్రం చదువుకి ఎక్కడా పొట్టపోసుకునే మార్గం దొరకదు.

పైగా నన్ను జుట్టుపట్టి లాక్కువచ్చే హక్కు 'ఆయన' కుందాయె! అందుకే అలాంటి ఆలోచనే నాలోకి రాలేదు!

భరించాలి!

భరించక తప్పదు గదా!

"మనింట్లో రెండు కుక్కలున్నాయి!

అవి నా సొమ్ము తిని బ్రతుకు తున్నాయి. అందుకని అవి నా పట్ల విశ్వాసంతో కృతజ్ఞతతో పడి ఉండాలి! నేనేం చేసినా అవి భరించాలి. నేను చెప్పినట్లు వినాలంతే! ఎదురు చెప్పడానికే వీల్లేదు!"

ఇదీ ఆయనగారి ఫిలాసఫీ!

నేనేం మాట్లాడలేక పోయేదాన్ని!

"నీకు సరిగా అర్థం కాలేదా? అయినా విను. చెబుతా! ఒకటి బొంబాయి నుండి కొని తెచ్చిన అల్సేషియన్ డాగ్! రెండు నువ్వు!" అనేవారాయన

అవమానంతో నేను కుతకుత ఉడికి పోయేదాన్ని. కానీ ఏం చేయను?

అట్లా నాలో కసీ, నా నిస్సహాయత మీద కోపం, ప్రపంచం మీద...ప్రత్యేకించి సుఖంగా, ఆనందంగా సంసారం చేసుకునే దంపతుల మీద అంతులేని అసూయా, జెలసీ...ఈర్ష్య!

నాకు దొరకని ఆనందాన్నీ, సుఖాన్నీ అన్నింటినీ పొందుతున్న వాళ్ళమీద భరించలేని క్రోధం అట్లా పేరుకుంది. చాలా తీవ్రంగా పేరుకుంది.

ఈ అసూయ నన్ను పూర్తిగా కాలిస్తే నేనే మిగలకుండా పోతానుగదా! దీనికి తాత్కాలికంగా ఏదైనా నివృత్తి కావాలి!

దీన్ని అప్పటివరకన్నా మర్చిపోవాలి, ఈ అసూయను మరచిపోయే మార్గం కావాలి!

ఎట్లా?

ఎట్లా మర్చిపోవాలి?

తాత్కాలికంగానైనా మరుపు కావాలి!

అదీ! అట్లా నిద్రమాత్రలు...ట్రాంక్విలైజర్స్‌ను అలవాటు చేసుకున్నాను.

ఒకటి, రెండు, మూడు అవి తీసుకున్న తర్వాత తాత్కాలికంగా ఈ ప్రపంచాన్ని జయించినట్లు అనుభూతి!

ఈ బాధలూ, కష్టాలూ, అవమానం ఇవన్నీ ఎక్కడికో మాయమై నన్నో రంగుల ప్రపంచంలోకి నెట్టివేసేవి!

అది వేరే ప్రపంచం!

దాన్లో బాధలూ, కన్నీళ్ళూ, కష్టాలూ ఏ మాత్రం గుర్తుకి వచ్చేవి కావు!

ఆ అనుభూతి శాశ్వతం కాదు. కాదని తెలిసి దాన్లోనే తల దూర్చి తృప్తి పడే దాన్ని!

నా శరీరం అన్నింటికీ అలవాటు పడింది. దాన్ని 'ఆయన' ఎట్లా ఉపయోగించుకున్నా నా మనసు ఎదురు తిరిగేది కాదు. ఎందుకంటే అది అప్పటికే సగం చచ్చిపోయింది. మిగిలిన సగం తన్ను తాను మరిచి మత్తులో, మగతలో మూగబోయి పడుకుంది!

తర్వాత...?

తర్వాత కథ నీకు తెలుసు! ఆయన కారు యాక్సిడెంటులో పోవడం, ఆ ఆస్తి కంతటికీ నేనే వారసురాల్ని కావడం. అంత

వరకే నిజం!

నేను చెప్పిన మిగతా కథంతా అబద్ధం!

నా అందాల ప్రపంచంలో కూర్చుని అంతకన్నా అందంగా అల్లిన కథ అది!

మీలాంటి వారికి వినిపించి మీ గుండెల్ని కదిలించి తృప్తి పడడానికి నేను అల్లిన కథ అది!

అర్థమయిందా?

చాలా.. చాలా జాగ్రత్తగా చదువు డియర్!

నా బ్రతుకు నాశనమయింది. నేనీ ప్రపంచంలో అనురాగాన్నీ, ఆనందాల్నీ చూసి సహించలేను, భరించలేను. అందరూ నాలా నాశనం కావాలి; అలా కాకపోతే నేను చావడం ఖాయం! నాకు దక్కనిదాన్ని మరెవరూ అనుభవించడానికి వీల్లేదు గాక వీల్లేదు!

నాకు కావలసినంత, అందర్నీ ఆడించేటంత అందం ఉంది, ఐశ్వర్యం ఉంది. అంతకుమించి తోటి మానవుల మీద 'కసి' ఉంది. ఆ 'కసి' తీర్చుకుంటున్నపుడు కలిగే ఆనందమే నాక్కావాలి.

పథకం వేశాను!

ఆనందంగా, అన్యోన్యంగా ఉన్న జంటలను ఎంచుకుంటాను. డాక్టర్లు, లాయర్లు, వ్యాపారస్తులు ఎవరయితేనాకేం, వాళ్ళు కలిసి హాయిగా కాపురం చేసుకోవడం నేను సహించలేను. వాళ్ళందరూ నా కసికి 'టార్గెట్లు' కావాలి.

డియర్!

నువ్వెట్లా నాకు దొరికావ్? నీ కంటే ముందు చాలామంది అలా నా వలలో చిక్కుకున్నారు. అందరికీ నీకు చెప్పిన కథే! అందరూ నీలా తమ పండంటి సంసారాలను కూల్చుకుని కుమిలిపోయిన వారే.

డియర్!

పూర్తిగా అర్థమయిందా? 'డాలీ' నా బిడ్డకాదు. ఎవరో ఒకరు ఎపుడూ నా 'దయా దాక్షిణ్యాల' మీద అలా బ్రతుకుతూ పడుండాలి.

వెల్!

నా తర్వాతి 'ముద్దాయి' లాయరు రమేష్, దాదాపు వలలో చిక్కినట్లే.. తర్వాత ఇంకో మనిషి..

ఈ చర్మం అందంగా ఉన్నంతకాలం, నా రక్తనాళాల్లో రక్తం ప్రవహిస్తున్నంత కాలం నా వేట ఇట్లాగే సాగుతూంటుంది.

డియర్!

నన్ను మరిచిపోకు. తలుచుకుని, తలుచుకుని కుమిలిపో!

ఈ సమాజం.. దాని కట్టుబాట్లూ.. మన సాంఘిక ఆర్థిక వ్యవస్థా నన్నిట్లా తయారు చేశాయి!

నాకు గుండె ధైర్యం, తెగువా ఉన్నాయి. కాబట్టి ఇలా సమాజం మీది కెగబడి, తిరగబడి నా 'కసి', కోరిక తీర్చుకుంటున్నాను.

అన్నట్లు ఈ ఉత్తరం నకలు ఓటి తీసి ఉంచాను. దాని మీద నిన్నటి తారీఖు వేసి ఉంచాను.

ఎందుకో తెలుసా?

ఈ సాలె గూటిలోనికి మరో కొత్త పురుగు వచ్చి చిక్కుకోబోతుంది! మరి కొంత కాలానికి నీకిచ్చినట్లే పూర్తి 'వివరణ' ఆ 'పురుక్కి' ఇవ్వాలిగదా! నీకు చెప్పిన కథ మళ్ళా ఆ దారాల్లో చిక్కుకున్న పురుక్కి చెప్పాలి గదా!

ఏమంటావ్ డియర్!



# ప్రకటన

తారశ్రీ హీరోయిన్‌గా నటించిన రెండు సినిమాలు హిట్ అయ్యేసరికి ఒక్కసారే ఆమె పేరూ,పలుకుబడీ, డిమాండూ, రేటూ కూడా పెరిగి పోయాయ్. నిర్మాతలతో బాటు వ్యాపార ప్రకటన దార్లు కూడా పోటీలుపడి మరీ రాసాగారామె ఇంటికి.

ప్రతి కేలండర్ మీదా, ప్రతి పత్రిక లోని ప్రతి పేజీలోని ప్రకటనల్లోనూ తారశ్రీ ఫొటోయే వుండాలనీ, బీడీ కట్టల ఎడ్వర్‌టైజ్‌మెంట్ నుంచి షాంపూల వరకూ సమస్త వస్తువుల ప్రచారానికి తారశ్రీ ఫొటేనే వుపయోగించాలనీ, ఎల్లెడలా తారశ్రీ పేరు మార్మోగి పోవాలనీ తారశ్రీ తల్లియైన నాంచారమ్మగారి నిర్ణయం.

అంచేత ప్రకటన చిత్రాలగ్గాను కాస్త సరసమైన ధరల్ని నిర్ణయించడంతో ప్రకటన దార్లు కాస్త వేలం వెర్రిగా రాసాగారు. ఇప్పటికే పెరిగిన, ఇంకా పెరగబోతున్న కూతురి పేరు ప్రతిష్ఠలు చూసి సంబరపడిపోతూ అందరికీ మాట ఇచ్చేస్తోంది నాంచారమ్మ.

ఓ రోజున ఓ సబ్బుల కంపెనీ తాలూకు యజమాని వచ్చి "మాకో చిన్న సబ్బుల కంపెనీ వుందండి. మెడిసినల్ సబ్బులు తయారు చేసాం..." అంటూ చెబుతోంటే "మీరేం చేస్తే మాకేంగాని మీ సబ్బుల ప్రచారానికి మా అమ్మాయి ఫొటో కావాలా ?" అంటూ సూటిగా అడిగేసింది నాంచారమ్మ.

"చిత్తం"

ఓ రేటు చెప్పి "అందుకిష్టమైతే రేపే వచ్చి మీ కిష్టమైన విధంగా ఫొటో తీయించుకోండి. దాని క్రింద మా అమ్మాయికి నచ్చిన సబ్బు, మెచ్చిన సబ్బు అంటూ మీ కిష్టమొచ్చినట్లు రాసుకోండి. మాకేం అభ్యంతరం లేదు. పత్రికల్లో పడ్డాక మాత్రం పెద్దసైజు కాపీ ఒకటి మాత్రం ఫొటో కట్టించి మాకివ్వాలి. ఈ షరతుల కొప్పుకుంటే అడ్వాన్సిచ్చి వెళ్ళండి" అందావిడ యమ బిజీ ఫీలవుతూ.

ఆవిడంత తేలిగ్గా ఒప్పుకుంటుందని



ఆశించని ఆ పెద్ద మనిషి మహదానంద పడిపోయి "చిత్తం చిత్తం" అంటూ వెంటనే డబ్బు సమర్పించి ఆ మర్నాడు ఫొటోగ్రాఫర్‌తో వస్తానన్చెప్పి మరీమరీ శలవు తీసుకు వెళ్ళిపోయాడు.

అది జరిగిన పదిహేను రోజులకి ఆ సబ్బుల కంపెనీ వాళ్ళు అందంగా ఫొటో కట్టించి తెచ్చిఇచ్చిన వాల్‌పోస్టర్‌ని చూసి తారశ్రీ, ఆమె తల్లీ కూడా మూర్ఛ బోయారు !

దాని మీద సబ్బు పట్టుకున్న తారశ్రీ ఫొటోతోబాటు "నా చర్మ సౌందర్యానికి

అసలైన కారణం ఈ సబ్బే - తారశ్రీ" అన్న ప్రకటనకింద "దురద, గజ్జి పోగొట్టి మిమ్మల్ని ఆరోగ్యంగా వుంచే ఏకైక సబ్బు" అన్న ముక్కలున్నాయ్!

—సింహప్రసాద్

# పెళ్లి చూపులు

సెక్షన్ ఆఫీసర్ కుటుంబరావుగారు శర్మకి ఆరు రోజులు లీవ్ శాంక్షన్ చేసేశారు. ఆ వార్త వినగానే సెక్షన్లో అంతా సంతోషించారు, కొత్తగా వచ్చిన ఆఫీసరుగారు శలవలు తేలిగ్గా శాంక్షన్ చేసేస్తున్నారని!

"ఏం చెప్పావ్ కారణం?" అని అడిగారు శర్మని

"ఉన్న సంగతే చెప్పాను."

"ఏమీ అన్లేదా?"

"లేదు. కారణం వినగానే నీకు పెళ్ళి కాలేదా? అన్నాడు. లేదన్నాను. వెంటనే చిరునవ్వుతో లీవ్ శాంక్షన్ చేసేశాడు" జవాబిచ్చాడు శర్మ.

శర్మ చెప్పింది నిజమే. కుటుంబరావు గారికి ఆరుగురు ఆడపిల్లలున్నారు. ఎవరికీ పెళ్లి కాలేదు. పెళ్ళిచూపుల పేరు మీద ఎందరో బ్రహ్మచారులకి కాఫీ, టిఫిన్లు మేపాడు ఆయన. ఎవరికీ టిఫిన్లు నచ్చినట్లుగా పెళ్లికూతురు నచ్చలేదు. అందుకే ఆయన కూతుళ్లు యింకా ఓ యింటి కోడళ్లు కాలేదు. అందుకే ఆడపిల్లల తండ్రికి వుండే బాధలు ఆయనకి బాగా తెలుసు.

ఆరడుగుల విగ్రహం వున్న అందమైన శర్మ 'మాచ్' చూడటానికి వూరెళ్తున్నాననీ, శలవు కావాలనీ అడగ్గానే ఆయనకి ముందు అసూయ కలిగింది- ఎవడో ఆడపిల్ల తండ్రి అదృష్టాన్నందుకో బోతున్నందుకు. తన అసహాయతకి తన మీదే జాలి వేసింది. శర్మ తమ కులం కానందుకు. అనక విశాల హృదయం విచ్చుకుని సంతోషం కలిగింది- ఈ భరతభూమిలో ఓ పిల్ల కన్నె చెరన్నా వదలబోతున్నందుకు. అందుకే వెంటనే శలవు మంజూరు చేసేశాడాయన 'బెస్ట్ ఆఫ్ లక్' చెప్పి మరీ!

* * *

ఆ రోజులూ నూటనలభై నాలుగ్గంటల్లా గడిచి పోయాయి. శర్మ మామూ



లుగా ఆఫీసుకి వచ్చేశాడు. సీట్లో కూచుని మిత్రులతో తనటూర్ విశేషాలు చెప్తుండగా ఆఫీసర్ గారి నుంచి పిలుపొచ్చింది. లేచి వెళ్లాడు.

"గుడ్‌మార్నింగ్ సార్!" అన్నాడు గదిలోకి అడుగెట్టి.

"గుడ్‌మార్నింగ్, రండి. ఠంచన్‌గా వచ్చేశారే, వెళ్లిన పని పూర్తయిందా?" అంటూ అడిగారు కుటుంబరావుగారు.

"అయింది కద సార్" అన్నాడు శర్మ.

"ఊం... ఏమయింది మాచ్ ? కాయా పండా ?" ఉత్సుకతగా అడిగారాయన.

"మీరు పేపర్లో చూడలేదా ? మనం ఘన విజయం సాధించేం కదండీ ?" అన్నాడు శర్మ – ఈయనకి క్రికెట్ అంటే ఇంట్రెస్ట్ లేదా ? అనుకుంటూ.

"పేపరా ?...ఘనవిజయమా ? మీరు వెళ్లింది పెళ్లి చూపులక్కాదా ?" తెల్ల బోయాడు కుటుంబరావు గారు.

"లేదు సార్. చెప్పే వెళ్లాను కదా– మాచ్ చూడటానికని! క్రికెట్ మాచ్..."

కుటుంబరావుగారి మొహం మరింత తెల్లబడింది.

—పి. వి. ఆర్. శివకుమార్

# ఆ రేటే రైటు

"వెంకటరమణ కాలనీకి వస్తావా ?"

"మీటరు మీద అఠణా ఎక్కువ యివ్వాలె" పెద్ద పోజు.

'సర్లె అఘోరించు' అని మనసులో అనుకుని, ఎక్కికూర్చున్నాను ఆటోలో.

దిగుతూ మీటర్ చూసి ఆశ్చర్య పోయి, "నీ మీటర్ తప్పు తిరుగు తోందయ్యా బాగుచేయించు" అన్నాను.

"నా మీటర్ తప్పున్నదని ఎవ్వల్లు అన్లె యిప్పటి వరకు. మంచిగున్నవు నివ్వు" అని వెటకారంగా నవ్వేడు డ్రైవరు.

"అసలు మీ ఆటో మీటర్లలో ఏ రెండైనా ఒక్కలా చూపిస్తాయని. సరైన పనిష్మెంట్ లేక మీ ఇష్టమొచ్చి నట్లు వసూలు చేస్తున్నారు మా దగ్గర"

"అరె. ఎక్కువ తక్కువ మాట్లాడ కయ్యా. పైసలియ్యి. మీటర్ తప్పున్నదంట. చెప్తుండు దొరగారు"–ఎంత నిర్లక్ష్యం ?!

"ఓరి పిచ్చోడా ! నా ఉద్దేశం నీ మీటర్ 'తక్కువ' చూపిస్తున్నదని. కోఠీ నుంచి ఇక్కడకు మూడు రూపాయలు అవుతుంది. నీ మీటర్లో రెండు రూపాయలే అయ్యింది"

"ఒక్కసారిగా ఆటోలోంచి దిగి, వినయం ఉట్టిపడేలా నిల్చుని, అమాయకంగా చూస్తూ అన్నాడు 'దొరగారు'–

"గట్లన సార్. థేంక్యు సర్. నాకు తెల్వనే తెల్వదు. దీనవ్వ తక్కువ జూపుతున్నది



మీటర్. గట్లనే మంచిగ జేయిపిస్తాసార్"

"మరిప్పుడు 'నీ మీటర్' లెక్కనే ఇచ్చెయ్యమంటావా?"

"అల్లెట్ల సార్. తమరే జెప్పిరిగద సార్. మూడ్రూపాయల్లెక్కనే యివ్వాని సార్–పైన అఠాణా కూడా ఒప్పుకున్ను సార్"

"..........!!"

–తులసి బాలకృష్ణ

# బహుమతి

"సాయంత్రం వచ్చేటపుడు మల్లెపూలు మరిచిపోరు కదూ!" గోముగా అడిగింది సుభాషిణి.

"మరి బదులుగా నాకేం ఇస్తావ్ !" అంతకన్నా కొంటెగా ప్రశ్నించాడు సుబ్బారావు.

"మీ సతి భక్తికి మెచ్చి ఒక బహుమతి అనుగ్రహిస్తాను"

"మల్లెపూలేం ఖర్మ చామంతులు, సంపెంగలు అన్నీ తెస్తాను గానీ త్వరగా అనుగ్రహించు దేవీ !"

"ఆఁఆఁ మరీ తొందరైతే ఎలా ? ఓపిక పట్టండి. బహుమతి కావాలంటే సాయంత్రం దాకా వెయిట్ చెయాల్సిందే"

"అంతేనా!" నీరసంగా మొహం పెట్టి దగ్గర్లో వున్న అయిదేళ్ళ బాబిగాడిని ఎత్తుకొని ముద్దు పెట్టుకున్నాడు సుబ్బారావు జాలిగా సుభాషిణి వంక చూస్తూ.

"ఛీ! పాడు ! ఎవరైనా ముద్దు పెట్టుకుంటారా పెద్దవాళ్ళని" అంటూ తనేదో పెద్దవాడైనట్లు అసహ్యంగా మొహం చిట్లించాడు బాబిగాడు.

"హారి భడవా !" అని వాణ్ని కిందికి దింపి నవ్వుకుంటూ సైకిలెక్కి ఆఫీసుకి దారి తీయించేడు సుబ్బారావు.

కానీ ఆఫీసులో పని చేస్తున్నంత సేపూ, ఆలోచిస్తూనే వున్నాడు. సుభాషిణిస్తానన్న బహుమతి గురించి.

అయిదయింది.

ఫైళ్లు కట్టేసి చకచకా సైకిలెక్కి పూల మార్కెట్ కి పోయి బేరం చేయకుండా ఇలా ఒక పొట్లం చొప్పున అన్ని రకాలు కట్టించుకొని సరాసరి ఇంటి కొచ్చేశాడు యమ స్పీడుగా.

"సుషీ! ఇవిగో పూలు! నువ్విస్తానన్న బహుమతేది మరి ?"

చిరునవ్వుతో కాఫీ ఇచ్చి "అలా చెప్పను. ఇలా రండి చెవిలో ఇచ్చేస్తాను" అంటూ దగ్గరగా వచ్చింది.

"……………………"

"అమ్మ దొంగా! అదా సంగతి. ఈ సారి నాకు పాపే కావాలి. ఫస్ట్ టైం పాప కావాలంటే ఇవ్వలేదు. ఈ సారి మాత్రం నా ఛాయిస్ పాప" గారంగా అన్నాడు సుబ్బారావు సుభాషిణిని దగ్గరగా తీసుకుంటూ.



"ఛీ! వదలండి ! బాబు చూస్తున్నాడు. సిగ్గు లేకపోతే సరి" ముద్దుగా

"అవున్రా బాబీ...... నీకు చెల్లి కావాలా ? తమ్ముడు కావాలా ?? వేగిరం చెప్పు"

"మరే... మరే... నాకు వాళ్లెవరూ వద్దు. నాకేమో... సురేష్ వాళ్లింట్లో లాంటి బొచ్చుకుక్క పిల్ల కావాలి" అంటూ నవ్వాడు.

— వై. నాగార్జున

# నాగరికపు ఆటవికులు







ఉన్నాయి. వారికి ప్రస్తుత ప్రపంచ వాసనలు ఉండవు. ఘమకారాల్యూ స్వలాభాపేక్షలు తెలియవు. వారి ఆ స్థితి ప్రాకృతిక అహాయకత్వానికి ప్రతీక!

అన్ని రంగాల్లోనూ అసమానంగా ఉంటూ నాగరిక ప్రపంచానికి మార్గదర్శి అనిపించే అమెరికా వాసులలో 19 మందికి రాతి యుగంలో నివసించాలనిపించింది. వారు అణు యుగంలో రాతి యుగాన్ని సృష్టించుకోవాలనుకున్నారు. అందుకు అనువైన ప్రదేశం భూలోక స్వర్గంగా భాసించే భారత దేశమే అని వారు నిర్ధారించుకున్నారు.

1978, మార్చిలో ముగ్గురు పురుషులు, పదిమంది స్త్రీలు, ఆరుగురు పిల్లలు మన దేశం వచ్చారు. 'రాతియుగం' అనగానే 'తెగ' కూడా ఉండాలి కనుక వారంతా 'శివలీల తెగ'గా మారారు. చింపాంజీల మాదిరిగా జీవించటానికీ, ఆధునిక నాగరికతతో నీతిబాహ్యం కాని ప్రశాంత భూతలం కోసం వారు వేట ప్రారంభించారు. శివలీల తెగకు నాయకుడు గ్రిడ్‌లీ లోరిమెర్ రైట్.

వారు మొదట ఢిల్లీలోని గోల్ఫ్ లింక్స్ కాలనీ బ్రహ్మాండమైన భవనాన్ని అద్దెకు తీసుకున్నారు. పేరుకు రాతియుగ జీవనం కాని వారు వాడేవి అతి ఖరీదైన యల్. యస్. డి, హాషిష్ లాంటి మాదక ద్రవ్యాలు, వారి కుక్కకు రోజూ కిలో మాంసం, వారికి సేవచేయటానికి ఓ నౌకరు, ప్రచారం కోసం కరపత్రాలు, ఫొటోలు.!

గ్రిడ్‌లీ పట్టభద్రుడు. సన్నగా పొడవుగా ఉంటాడు. నీలి కళ్లు. తెల్లని శరీరచ్ఛాయ. శివలీల తెగను ప్రారంభించిన వ్యక్తి అతనే!

1978లోనే వారు అమెరికా వదలి వచ్చేశారు. తరువాత ఫిలిప్పైన్స్‌లో ఆగారు. అక్కడే రాతి యుగపు ఆటవికులుగా ప్రవర్తిద్దామనుకున్నారు. కానీ అక్కడి అధికారుల ఆగ్రహానికి తాళలేక మళ్ళీ సంచారం ప్రారంభించారు. అప్పుడు వారి గమ్యం మన దేశమే! రావటంతోనే మనాలిలో విడిది చేశారు. ఇక్కడికి వచ్చిన మూడు వారాలలో నలుగురు పిల్లలు మరణించారు. వారిలో గ్రిడ్‌లీ కూతురు సూర్య కూడా ఉంది. ఆమెకు 5 ఏళ్లు. పిల్లల చావు వారినెవరినీ కదిలించలేకపోయింది. గ్రిడ్‌లీపై వారందరికీ ఉన్న భక్తి విశ్వాసాలు అలాంటివి.

సూర్య బాధతో గిలగిలలాడుతూ మృత్యువుకు దగ్గరగా ఉన్న సమయంలో నిర్లిప్తంగా "డాక్టరును తీసుకురమ్మంటావా" అన్నాడు గ్రిడ్‌లీ. ఆమె మొండిగా 'వద్దు' అంది. "పోనీ మందులు వాడతావా?" అడిగాడు తండ్రి. ఆమె నీరసంగా మళ్ళీ "వద్దు" అంది. "ఆమెకు చావు రాసిపెట్టి ఉంది. అందుకే నేనేమీ మాట్లాడలేదు; ఏ ప్రయత్నమూ చేయలేదు. కూతురు కోరికను నేను మన్నించాను'' అన్నాడు గ్రిడ్‌లీ ఆ తరువాత !

'చనిపోయిన పిల్లలు నలుగురూ కోరింత దగ్గు వల్ల కాని, పొంగులాంటి వ్యాధి వల్ల కాని బాధ పడినవారే. శివలీల తెగకు టీకాలపై నమ్మకం లేదు. ''టీకాలు, ఇతర రోగ నిరోధక సాధనాలు శరీరంలోని ప్రకృతి సిద్ధమయిన శక్తిని హరించివేస్తాయి. ఎవరు చేసుకున్న ఖర్మకు వారే కర్తలు. ఇహంలో వారికి నూకలు చెల్లిపోయాయి" అన్నారు తెగవారు—పిల్లల




మరణాల గురించి మాట్లాడుతూ. అన్నట్టు ఈ తెగవారికి తాంత్రికయోగం, క్రీస్తు బోధనలు లాంటి వాటిపై నమ్మకం ఎక్కువ.

తెగలోని స్త్రీలకు కమల నాయకురాలు. ఆమెకు వివియన్ కునిజియన్ అని మరో పేరు కూడా ఉంది. ఆమెది దూకుడు స్వభావం. చనిపోగా మిగిలిన ఆరుగురు పిల్లలకూ ముగ్గురు పురుషులూ తండ్రులే. వారికి అసలు తల్లిదండ్రులెవరో తెలియదు. స్త్రీలంతా పాలిచ్చి పెంచారు. కాని ఆ ఆరుగురికీ పిల్లల సంరక్షణ బాధ్యత లేదు. ఆ పని చేసేది ఒకరిద్దరే !

రాతియుగపు మనుషుల మాదిరిగా వారికి మాతృ స్వామ్యం పైనే మక్కువ. పిల్లల పుట్టుకకూ పెరుగుదలకూ తండ్రుల పాత్ర చాలా తక్కువ అని వారి అభిప్రాయం. అలాగే వారు అలవు తెచ్చుకున్న మరో విధానం ... స్వేచ్ఛా శృంగారం. చిన్న పిల్లలు కూడా ఆ తరహా ప్రయోగాలకుఅర్హులే! "పశువులూ, పక్షులూ ఏం చేస్తాయి? వాటికి వావీవరసా ఏముంటుంది? వయోభేదం దృష్ట్యానైనా శారీరక వాంఛలకు పరిమితులు విధించటం మాకు ఇష్టంలేదు" అంటారు శివలీల తెగ.

ప్రజోత్పత్తికి జరిగే శృంగార క్రీడలు మాత్రం నిర్దుష్టంగా ఉంటాయి. ఆ సమయంలో స్త్రీ పురుషుల శారీరక, మానసిక స్థితులకు ప్రాధాన్యం ఇస్తారు. అలా చేయటం వల్ల అందం, ఆరోగ్యం సమపాళ్ళలో ఉన్న శిశువులు జన్మిస్తారని వారి ఉద్దేశం. సృష్టికార్యం కోసం ప్రత్యేకంగా మన దేశానికి చెందిన ఇద్దరు సాధువులను నియోగించుకున్నారు. వారి ద్వారా ఆ తెగ సంఖ్య మరో నాలుగుకు పెరిగింది.

వారు అంత నిర్లజ్జగా, స్వేచ్ఛగా ప్రవర్తించటానికి కారణం వారు ఎల్.ఎస్.డి. వాడతారు అని కొందరు వ్యాఖ్యానిస్తున్నారు. మన దేశంలో కొందరు సాధువులు, సన్యాసులకు సైతం శివలీల తెగవారు ఆ రకం మాదక ద్రవ్యాలను అలవాటు చేశారు. కేవలం ఆ తరహా పద్ధతుల వల్లనే వారు అలా మనగలుగుతున్నారు. "సరైన వ్యక్తి మార్గదర్శకత్వంలో ఎల్.ఎస్.డి. హాషిష్ లాంటివి రోజూ వాడినా ఎలాంటి చెరుపూ జరగదని శాస్త్రీయంగానూ, నిర్ద్వంద్వంగానూ మేము నిరూపించాం" అంటున్నారు శివలీల తెగలోని స్త్రీలు.

కోపతాపాలు, ఉద్రిక్తత కలిగిన ప్రతి క్షణంలోనూ వారు మైథునం కోసం పరుగులు తీయరు. కోరిక కలిగినప్పుడల్లా స్త్రీ పురుషుల కలయికను వారు అంగీకరించరు. అలాంటి సమయాల్లో ఒకరినొకరు తీవ్రంగా కొట్టుకోవటం, గిల్లుకోవటం, తన్నుకోవడం లాంటి శరీరానికి బాధ కలిగించే చేష్టలతో ఆ బాధను ఉపశమింప చేసుకుంటారు. అప్పుడు వారికి ఎంతో బరువు దిగినట్లు ఉంటుందని తెగలోని వారు ప్రకటించారు.

శివలీల తెగలోని స్త్రీలు నిర్భయులు, ఆత్మవిశ్వాసం ఉన్నవారు. అన్నిటికి తెగించి, అవసరమైతే ఆత్మరక్షణ కోసం ఎంతపని చేయటానికైనా వెనుదీయరు. కాని మొత్తం తెగఅంతా గ్రిడ్‌లీ అదుపు ఆజ్ఞలోనే ఉంటుంది.

అనుచరులతో సహా గ్రిడ్‌లీ వచ్చిన తరువాత-భక్తవార్‌పూర్ పల్లా గ్రామంలో తాము ఉండటానికి అనువుగా ఉంటుందని గ్రహించాడు. ఆ గ్రామం ఢిల్లీ పరిసరాల



లోనే ఉంది. ట్రాక్టర్లు, ఇతర మోటారు వాహనాలతో ఆ గ్రామం మహా రద్దీగా ఉంటుంది.

అక్కడకు దగ్గరలోనే కస్తూర్బా ధర్మకర్తల ఆశ్రమం, అనాధుల కోసం ప్రత్యేకించిన పాఠశాల ఉన్నాయి. 'ఆ పిల్లలను కూడా తమ మాదిరిగా గ్రిడ్‌లీ మార్చేస్తాడు' అనుకొన్నారు గ్రామస్తులు. కాని తెల్లని అతని భారీ కాయాన్ని చూసి ఇంజక్షన్లు చేయటానికి వచ్చాడనుకొని పిల్లలెవరూ గ్రిడ్‌లీ దరి దాపులలోనికి కూడా రాలేదు.

ఆ పిల్లల కోసం దుస్తులు పోగుచేసి ఇద్దామనుకున్నారు ఆ గ్రామస్తులు. శివలీల తెగపిల్లలు ఆగ్రామంలోని పిల్లలను దరిచేరనీయలేదు. కారణం- మొదట వారు ఆ తెగవారిపై రాళ్లు విసిరి, కొట్టి హింసించారు. ఇప్పుడు వారి పరిస్థితి బాగానే ఉంది. ఈమధ్యే వారంతా తమ అమెరికా వీసాలను తగలపెట్టేశారు. ప్రస్తుతం భారత ప్రభుత్వ రక్షణలో ఉన్నారు. *

# జలరాక్షసి

పూర్వం రాజుల కథల్లో, పురాణాల్లో మాత్రమే కన్పించి మనిషిని ఊహా లోకాల్లోకి లాక్కుపోయిన మత్స్య కన్యలు (జల దేవత) జల సర్పాలు, జల రాక్షసులు ఇప్పుడు నిజంగానే ప్రత్యక్షమై మనిషిని ముప్పతిప్పలు పెట్టనున్నాయి. ఇప్పుడు ఎక్కడ ఏ వింత జంతువు కన్పించిందన్నా శాస్త్రజ్ఞులందరూ పోలోమని ఆధునిక పరికరాలతోసహా ఆ ప్రదేశానికి పరిగెడుతున్నారు. కోట్లాది సంవత్సరాల క్రితం సాగర గర్భంలో ఎన్నో రకాల జంతురాశి వుండేది. కాలక్రమంలో అనేక రకాలు నశించిపోగా ఎలాగో కాలగతిని తప్పించుకొని చిరంజీవులైన అప్పటి ప్రాణులు కొన్ని ఇప్పటికీ అడపా దడపా దర్శనమిస్తూ శాస్త్రజ్ఞులతో దాగుడుమూతలాడుతున్నాయి.

గత సంవత్సరం మే నెలలో టాంజానియాలో మొజాంబిక్ వద్దగల కిల్వా ప్రదేశ సమీపాన సముద్రంలో ఆవు లాంటి ఓ జంతువు లభించింది. దాని తలపై కుడి వైపున బొంగరంలాంటి కన్నొకటి మెరుస్తోంది. ఒకే కొమ్ముంది. మేక కున్నట్లు గడ్డం వుంది. నోట్లో దంతాలు లేవుగాని పొడవైన నాలుక వుంది. దీని ఛాతిమధ్య మరో చిన్న కన్ను వుంది. అయితే మనిషికి వున్నట్లు రెండు కాళ్ళు, రెండు చేతులు, ఐదేసి వేళ్ళు వున్నాయి. ఈ జంతువును చూసిన సామాన్య ప్రజలు, శాస్త్రజ్ఞులు కూడా నోరు తెరుచుకొని నిలబడిపోయారు. ఇది సముద్రపు ఆవా మరోటా అని తికమక పడుతున్నారు.

అంతకు ముందు ప్రకృతి పరిశీలకుడు స్టెల్లర్ పసిఫిక్ ద్వీపంలో ఓ సముద్రపు ఆవు నడుస్తుండగా చూశానని, అది 20 అడుగుల పొడవు, 4 లేక 5 టన్నుల బరువు వుంటుందనీ చెప్పాడు. దీనికి కాళ్లు లేవు. చేతులు చేప రెక్కల్లా వున్నాయి. ఈ రెక్కలను సముద్రంలో ఈదడానికి గాక నిల్చోడానికి ఉపయోగిస్తుంది. దీనికి చిన్న తల, ఒత్తైన జుట్టు వున్నాయి. నోట్లో పళ్లు లేవు గాని అందమైన చర్మం వుంది. సముద్రపు నాచుమొక్కలు, కాయగూరలు దీని ఆహారం. ఒకటి ప్రమాదంలో చిక్కు




కుంటే మిగిలినవన్నీ వచ్చి రక్షిస్తాయి.

స్టెల్లర్ మత్స్య కన్యలు ఓ రకమైన సముద్రపు ఆవుల్లాంటివని అభిప్రాయ పడ్డాడు. కోట్లాది సంవత్సరాల క్రితం భారీ శరీరం కలిగిన జలచరాలు, భూచరాలు అనేకం వుండేవి. కాల క్రమేణా క్రమ పరిణామ గతికి లోనై ఈ జంతువులన్నీ దాదాపు నశించిపోయి వస్తు ప్రదర్శనశాలల్లో అలంకార ప్రాయంగా వున్న అస్థికలుగా మిగిలి పోయాయి. ఈ భారీ శరీరం కలిగిన జలచరాలు, భూచరాలు డైనోసారస్ తెగకు చెందినవి.

తాడి చెట్టును కలుపు మొక్క పీకినట్లు పీకేసే మహాకాయులైన రాక్షసుల కథలు చదివి కల్పితమనుకొనే దశ దాటిపోతోంది. గత 50 సంవత్సరాలుగా మనిషి పుట్టు పూర్వోత్తరాలను పరిశోధిస్తున్న శాస్త్రజ్ఞులకు మన దేశంలోనేగాక చైనా, జావా, ఆఫ్రికా దేశాల్లో లభించిన పుర్రె ఆకారాన్ని, దంతాలను క్షుణ్ణంగా పరిశీలించాక ఆ అవశేషాలు పూర్వం భారీ శరీరాకృతులు గలిగిన నర వానరులవేనని తేల్చారు. చైనా, జావాలో లభించిన భారీ పరిమాణం గలిగిన పుర్రె, దంతాలు మనిషి పుర్రెను పోలి వున్నాయి. వానర దంతాలు అన్నీ ఒకటే పరిమాణంలో వుంటే మనిషి దంతాలు దవడలలో వెనక వైపు పళ్ల వెడల్పుగా వుంటాయి. ఈ అవశేషాల వలన పూర్వం విశాలమైన దవడలు, దంతాలు కల మనుషులుండే వారని నిరూపించడానికి ఖచ్చితమైన ఋజువు దొరికింది. ఈ పుర్రెలు వానర జాతివి కాదని నర వానర జాతికి చెందినవని తేల్చారు. ఢిల్లీకి ఈశాన్యంగా సుమారు 200 మైళ్ళ దూరంలో వున్న శివాలిక్ పర్వత శ్రేణుల్లో లభించిన ఆధారాల బట్టి పురాణాల్లోని రాక్షసుల వర్ణనలు సదరు మనుషులవేనని నమ్మాల్సి వచ్చింది.

ఇలా ఒకదాని తర్వాత ఒకటి ఆశ్చర్యకరమైన సత్యాలు బయట పడటం ప్రారంభించడంతో రంగంలో వున్న శాస్త్రజ్ఞులందరికీ ఆసక్తి పెరిగిపోయింది.

హిమాలయ పర్వత సానువుల్లో సంచరిస్తున్నాడని భావించిన రాక్షసకాయుడు 'యతి' తెచ్చిపెట్టిన తలనొప్పి ఇంకా తగ్గకుండానే బ్రిటన్‌లో 'లాక్‌నైస్' సరస్సులో 'నైసీ' అనే జలరాక్షసి ప్రత్యక్షమయింది. అప్పటి నుంచి ఇప్పటి దాకా 'నైసీ' శాస్త్రజ్ఞులందరినీ ఏడిపిస్తూ ఓ పట్టు పడుతూనే వుంది.

'లాక్‌నైస్' సరస్సు 2,000 అడుగుల ఎత్తుగల పర్వతాలలో 22 మైళ్ళ పొడవు 2 మైళ్ళ వెడల్పున విస్తరించి వుంది. దీని సగటు లోతు 700 అడుగులని అంచనా. అసలు లోతు ఎంతో ఎవరికీ తెలీదు. 150 అడుగుల లోతుకన్నా దిగువన సరస్సు నీరు ఉష్ణోగ్రత 42 డిగ్రీల ఫారన్‌హీట్ వుంటుంది. 'నైసీ' క్రీ॥ శ॥ 565 నుంచే ఈ సరస్సులో వుందని ఓ భావన.

ఇది ఓం ప్రథమంగా 1933లో దర్శనమిచ్చి శాస్త్రజ్ఞుల కంటిమీద కునుకు లేకుండా చేసింది. మొదట్లో 'నైసీ' గురించిన వార్తలను అభూత కల్పనలుగా భావించారు. సీల్ వంటి జంతువును చూసి జలరాక్షసి 'నైసీ' అని భ్రమపడుతున్నారనుకొన్నారు శాస్త్రజ్ఞులు—అయితే 'నైసీ'ని చూశామన్న వారి సంఖ్య కొండవీటి చాంతాడులా పెరిగి పోవడంతో 'నైసీ' ఉనికిని పరిశోధించాల్సి వచ్చింది



శాస్త్రజ్ఞులకి.

జలరాక్షసి 'నైసీ' కథ విన్న వివిధ సర్కస్ కంపెనీలు, జంతు ప్రదర్శన శాలల అధికారులు దాన్ని ఖరీదు చేసి ప్రపంచ ప్రఖ్యాతి సంపాదిద్దామని ఉబలాట పడ్డారు. ఓ సర్కస్ కంపెనీ 'నైసీ'ని సజీవంగా పట్టితెస్తే 2 వేల డాలర్లిస్తానని ప్రకటిస్తే న్యూయార్క్‌లోని ఓ జంతు ప్రదర్శనశాల 5 వేల డాలర్లు ఇస్తానని బేరసారాలారంభం అవడంతో బ్రిటన్ మేధావి వర్గం 'నైసీ' సరస్సులోనే వుండాలనీ ఆ జలరాక్షసిని పట్టుకోడానికెవరినీ అనుమతించరాదనీ ప్రభుత్వానికి విజ్ఞప్తి చేశారు. ప్రభుత్వం వెంటనే నైసీ సరస్సు చుట్టూ సాయుధ కాపలా ఏర్పాటు చేసింది.

'నైసీ' జలరాక్షసిని మొదటి సారిగా ఫొటో తీసిన ఘనత హ్యూగ్ గ్రే అనే వ్యక్తికి దక్కాలి. దురదృష్టవశాత్తు ఈ ఫొటోను 200 గజాల దూరం నుంచి



తీయడం వలన స్పష్టంగా రాలేదు. ఈ ఫొటోలో చాలా పెద్దగా వున్న ఓ సర్పాకార ఆకృతి కన్పించింది. బ్రిటన్‌లోని డైలీ రికార్డు, డైలీ స్కెచ్ పత్రికలీ ఫొటోను ప్రచురించడంతో చాలామందికి 'నైసీ' పట్ల కుతూహలం కల్గింది. 'నైసీ'ని ఫొటో తీయడానికి దూర ప్రాంతాల నుంచీ అనేక మంది సరస్సు వున్న ప్రాంతం చేరుకోవడం ప్రారంభించారు. 1934 ఏప్రిల్ నెలలో కల్నల్ రాబర్ట్ కెనెత్ విల్సన్ అనే డాక్టరు నైసీ ఫొటో తీశాడు. ఇప్పటి వరకూ తీసిన నైసీ ఫొటో లన్నింటిలో ఇదే స్పష్టంగా వుందని శాస్త్రజ్ఞుల అభిప్రాయం. ఇందులో నైసీ తల చిన్నగా, మెడ పొడవుగా వుంది. 1972లో అమెరికాలోని 'నాసా' పరిశోధనా కేంద్రంలో ఈ ఫొటోను ఎన్‌లార్జ్ చేసి నైసీకి మీసాలున్నాయని, అవి క్రింది దవడల వరకూ వ్యాపించాయనీ కనుగొన్నారు. రెండో ప్రపంచ యుద్ధం నాటికి 'నైసీ' వార్తలు ప్రపంచమంతటా వ్యాపించాయి. చివరికి ముసోలినీ ఆ సరస్సు మీద బాంబులు వేసి నైసీని సంహరించాడన్న పుకార్లు కూడా పుట్టాయి.

1943లో ప్రభుత్వ అనుమతితో ఫ్లింట్ అనే కమాండర్ ఒక లాంచీలో సరస్సులో ప్రదక్షిణాలు చేస్తూ నైసీ కోసం అన్వేషణ సాగించాడు. కొంచెం సేపటికి ఓ పెద్ద ప్రాణి లాంచీని ఢీకొట్టడంతో లాంచీ అడుగుభాగం ధ్వంసమైంది. లాంచీ ఇంత తీవ్రంగా దెబ్బతినేంత బలంగా దెబ్బకొట్టగల శక్తి నైసీకి తప్ప మరో దానికి లేదని నిర్ధారించారు. దీనితో భారీ ఆకారం కలిగిన ప్రాణి ఆ సరస్సులో వుందని శాస్త్రజ్ఞులకు నమ్మకం కలిగి 'నైసీ' జాడ కనుక్కోడానికి ప్రయత్నాలు తీవ్రతరం చేశారు.

1954 డిసెంబర్‌లో ఆధునిక

పరికరాలు, యంత్రాలు అమర్చిన ఒక నౌక నైస్ సరస్సులో 'నైసీ' కోసం వెతక సాగింది. నౌకలో వున్న ప్రతి ధ్వనులను నమోదు చేసే పరికరం నీటి అడుగు నుంచి వచ్చే చిత్ర విచిత్ర ధ్వనులను కొన్నింటిని నమోదు చేయ సాగింది. ఈ ప్రతిధ్వనులను పరిశీలించి 500 అడుగుల లోతున కనీసం 50 అడుగుల పొడవున్న ఓ ప్రాణి వుందని నిర్ణయించారు. 500 అడుగుల లోతులో నివసించే చేపలు, జలవృక్షాలు ఇలాంటి శబ్దాలు చేయలేవు. అప్పటి వరకూ నైసీ గురించి లభించిన వివరాలను వ్యాయిట్ అనే రచయిత 'మోర్ దేన్ ఎ లెజెండ్' అన్న పేరుతో పుస్తకంగా ప్రచురించగానే దాని కాపీలు వేడివేడి మిరపకాయ బజ్జీల్లా అమ్ముడై పోయాయి.

1968లో బ్రిటన్‌లోని బకింగ్‌హామ్ విశ్వవిద్యాలయంలోని "ఎలెక్ట్రికల్ ఇంజనీరింగ్" విభాగంలో నీటిలో చాలా లోతు నుంచి వచ్చే శబ్దాలను విని, లోతున నివసించే ప్రాణులను చూడగలిగే పరికరాన్ని కనుగొన్నారు, డాక్టర్ టమర్‌కి ఈ పరికరాన్ని 'నైసీ' జాడ కనుగొనడానికి ఉపయోగించాలన్పించి నైస్ సరస్సులో దీన్ని వదిలారు. కొంతసేపటికి 50 అడుగుల పొడవున్న ఓ ప్రాణి సంచరిస్తున్నప్పుడు అయ్యేశబ్దాలను మాత్రమే నమోదు చేయగలిగింది ఇది. ఈ ప్రయోగానంతరం అమెరికా శాస్త్రజ్ఞులకు నైసీ విషయంలో కుతూహలం పుట్టుకొచ్చింది. వీరు ఓ చిన్న జలాంతర్గామిలో అత్యంత సున్నితమైన



శబ్దాలను కూడా నమోదు చేసే 'వైపర్స్' అనే ఓ పరికరాన్ని వుంచి సరస్సులో ఎక్కువ లోతువున్న చోటికి పంపారు. అక్కడ 820 అడుగుల లోతును సూచించింది పరికరం. మరి కాసేపటికి 600 అడుగుల లోతు నుంచి వచ్చిన శబ్దాలను జలాంతర్గామి వెంబడించగానే శబ్దాలు ఆగిపోయాయి.

తర్వాత 1972లో అమెరికాకి చెందిన "అకాడమీ ఆఫ్ అప్లయిడ్ సైన్సెస్'' అనే పరిశోధనా సంస్థ నీటి అడుగున అత్యంత వేగంతో కదిలే ప్రాణి స్థిరంగా నిల్చున్నట్లు ఫొటో తీసే సామర్థ్యం గల ఓ కెమేరాను (స్ట్రోబోస్కోపిక్ కెమెరా) నీటిలో చాలా లోతునున్న ప్రాణులను చూడగలిగేవి, శబ్దాలను వినగలిగే సామర్థ్యం గల ఆధునిక సాధనాలను సరస్సులో వదిలారు. 1972 ఆగస్టు 7న ఈ కెమేరా మొదటిసారిగా నీటి అడుగున జలరాక్షసి నైసీని ఫొటో తీసింది. ఆ ఫోటోలో కన్పించే జలరాక్షసి నైసీ శరీరం గరుకుగా వుంది. దాదాపు 60-70 అడుగుల పొడవున్న నైసీ రెక్కలు వజ్రాల పొడిలా మెరుస్తున్నాయి. ఈ ఫొటోవలన నైసీ అనే జలరాక్షసి వున్నట్లు స్పష్టమైన రుజువు దొరికింది.

1975 నుంచి ఈ ప్రాణిపై జరిగే పరిశోధనల కయ్యే 75 వేల డాలర్ల ఖర్చును అమెరికా అకాడమీ ఆఫ్ అప్లయిడ్ సైన్సెస్ సంస్థ, అమెరికా 'దీ న్యూయార్క్ టైమ్స్' పత్రికలు చెరి సగం పంచుకోవడానికి నిశ్చయించాయి. పెద్ద ఎత్తున జరగబోయే ఈ పరిశోధనకు సంబంధించిన వివరాలను ప్రదర్శించడానికి ఎన్. బి. సి. టెలివిజన్ సంస్థ అధికారం సంపాదించింది. అకాడమీ ఆఫ్

అప్లయిడ్ సైన్సెస్ అధ్యక్షుడు డాక్టర్ రాయిన్ నీటిలో నైసీని తీసిన ఫొటోలన్నింటినీ కొందరు శాస్త్రజ్ఞులు పరిశీలించి నైసీ 70 లక్షల సంవత్సరాల క్రితం అంతరించిన సముద్ర "డైనోసార్స్" సంతతికి చెందినదని క్రమ పరిణామ గతినెలాగో తప్పించుకొని ఇప్పటికీ జీవిస్తోందని అభిప్రాయ పడ్డారు. ఫొటోల్లో నైసీ మెడ, శరీరం, తెరుచుకున్న నోరు, పండ్లు అన్నీ స్పష్టంగా కన్పించాయి.

శాస్త్రజ్ఞులు 'నైసీ' పరిశోధనకు ఉరక్యూ హార్ట్ అనే అఖాతాన్ని కేంద్ర స్థలంగా ఎన్నుకున్నారు. 1961-71 మధ్య 75 సార్లు నైసీ వివిధ వ్యక్తులకు అక్కడే కన్పించడమే దానికి కారణం. అక్కడ ఒక టెలివిజన్ కెమేరా, శక్తివంతమైన ఒక వీడియో టేప్ 24 గంటలు జల రాక్షసి కోసం కాపలాకాయసాగాయి. తీరాన మకాం వేసిన శాస్త్రజ్ఞులు 24 గంటలూ టెలివిజన్‌ను ఆన్ చేసి వుంచుతారు. కెమేరాను,వీడియో టేప్‌ను ప్రవీణులైన గజ ఈతగాళ్ళు సరస్సులో 40 అడుగుల లోతున అమర్చారు. నైసీ నీటి లోపల కూడా శ్వాసించగలదు. అదీగాక లోతైన నీటిలో వుండటమే దాని కిష్టం. అసాధారణ పరిస్థితుల్లో మాత్రమే అది పైకి వస్తుంటుంది గనుక పరిశోధనలలో నైసీ జలరాక్షసి ఒక రోజులోనే కన్పించవచ్చు లేదా సంవత్సరాలైనా పట్టవచ్చని శాస్త్రజ్ఞులుముందే అంచనా వేసుకున్నారు. కాని అసలది పైకంటూ వస్తే నీటి ఉష్ణోగ్రతలో తప్పకుండా స్వల్పంగానయినా మార్పువస్తుంది.అత్యంత స్వల్పమైన ఉష్ణోగ్రత మార్పుని కూడా పసిగట్టే ఒక సాధనాన్ని అఖాత తీరంలో అమర్చినందువల్ల నీటి ఉష్ణోగ్రత ఒక డిగ్రీ తగ్గినా, పెరిగినా శాస్త్రజ్ఞులకు వెంటనే తెలిసిపోతుంది.

నీటి అడుగున కలిగే మార్పులను, శబ్దాలను నమోదు చేసే సోలార్ యంత్రాలను అమర్చారు. ఈ యంత్రం మూడు పనులను నిర్వహిస్తుంది.ఆసరస్సు అడుగు భాగపు ఫొటోలు తీస్తుంది. సోలార్ యంత్రాలమర్చిన బోటు నియమిత క్రమంలో సరస్సులో తిరుగుతూ సరస్సు అడుగు భాగాన వున్న భూమి ఉపరితలంలోని మార్పులను కనిపెడుతుంటుంది. జల రాక్షసి నివాసస్థలం కనుగొనడం దీని ఉద్దేశం.

రెండోది సరస్సు అడుగున వున్న అస్థి పంజరాలు, ఇతర అవశేషాల జాడ తెలుసుకొంటుంది. ఇంతవరకూ ఏ అవశేషాల జాడా కన్పించలేదు. మూడో పని ఈ యంత్రంలోని కెమేరా నీటిలో తిరిగే ప్రతి వస్తువునూ, ప్రాణినీ గమనిస్తూ, ఫొటో తీస్తుంటుంది. ఇంత పకడ్బందీగా భారీ ఎత్తున చేసుకున్న ఏర్పాట్లతో శాస్త్రజ్ఞులందరూ సరస్సు ఒడ్డున మోహరించి వున్నా నైసీ జల రాక్షసి మాత్రం వాళ్ళకి కన్పించకుండా ఆట పట్టిస్తూనే వుంది.

ఈ జల రాక్షసిని కనుగొంటే ఎన్నో ప్రకృతి రహస్యాలను తెలుసుకోవచ్చని శాస్త్రజ్ఞుల ఆశ. అయితే జల రాక్షసి దయ మాత్రం వారిమీద ఇంకా ప్రసరించలేదు. వాళ్ళలా సరస్సు ఒడ్డున 'నైసీ నామస్మరణ చేస్తూ పడిగాపులు పడుతున్నారు ఎప్పటికైనా తపస్సు ఫలించకపోతుందా అన్న ఆశతో!

Edited, Printed and Published by Ramoji Rao Ch. for Vasundhara Publications. Printed at Colorama, Offset Printers, Hyderabad. VIPULA Telugu Monthly. Eenadu Compound, Hyderabad - 500 004.

